# గోపాలకృష్ణీయం

## గోపి-కె.పి

## కృష్ణమూర్తి పద్ధతి విశేషాంశాలు


రచయిత

జ్యోతిర్విద్యామహోదధి, జ్యోతిర్విద్యామహామహోపాధ్యాయ

**పి.యం. గోపాలాచారి.**



**శ్రీ మహాగణపతి జ్యోతిర్విద్యా పరిశోధనా సంస్థ**

16-1020, పొగతోట, నెల్లూరు. ఫోన్ : 0861-2306275

# గోపాలకృష్ణీయం

గోపి-కె.పి

కృష్ణమూర్తి పద్ధతి విశేషాంశాలు



రచయిత సహధర్మచారిణి

**శ్రీమతి అమృతతార గారి షష్టిపూర్తి స్మృత్యంకము**


రచయిత

జ్యోతిర్విద్యామహోదధి, జ్యోతిర్విద్యామహామహోపాధ్యాయ

**పి.యం. గోపాలాచారి.**

ప్రచురణ సం॥ 2008, ఆగస్టు
ప్రతులు - 1000
వెల - రూ. **70/-**



ప్రతులకు :

1) **విజ్ఞాన తరంగిణి**
నెం. 2, ఆర్.కె. టవర్స్, సోమశేఖరపురం
జయభారత్ హాస్పిటల్ వెనుక, నెల్లూరు - 1.

2) **శ్రీ మహాగణపతి జ్యోతిర్విద్యా పరిశోధనా సంస్థ**
16-1020, పొగతోట,
నెల్లూరు. ఫోన్ : 0861 2306275



# విషయసూచిక


1. జ్యోతిషము పరిచయము ............ 1
2. కృష్ణమూర్తిపద్ధతివిశేషాలు ............ 5
3. కృష్ణమూర్తిపద్ధతి-ప్రత్యేకత ............ 10
4. జననకాలసంస్కారం-నిర్ధారణ ............ 14
5. సాయనము-నిరయణము ............ 23
6. ఎఫిమెరిస్ ఆధారంగా జాతకచక్రం తయారు చేయడం ............ 25
7. ఎఫిమెరిస్ ఆధారంగా లగ్నం కట్టడం ............ 26
8. అధికారిక గ్రహాలు ............ 28
9. ఫార్ములా ............ 30
10. సబ్‌లార్డ్ థియరీ ............ 32
11. కారకగ్రహాలను కనుగొనడం ............ 33
12. ద్వాదశభావాలు ............ 37
13. కారకులుగా వివిధభావ కార్యాధిపతులిచ్చే ఫలితాలు ............ 42
14. ఆయుర్దాయనిర్ణయం ............ 47
15. రోగము ............ 51
16. ప్రశ్నజాతకం ............ 53
17. ప్రశ్నజాతకంలో వివిధ భావాలు ............ 56
18. గోచారఫలితం ............ 66
19. ఉదాహరణలు
    1. గుజరాత్ ఎన్నికలు 2007 ............ 69
    2. శ్రీలంక ఆస్ట్రేలియా ............ 71
    3. 20 20 ప్రపంచ క్రికెట్ కప్ ............ 73
    4. అధ్యక్షుని ఎన్నిక (ఇండియా 2007) ............ 74
    5. బెనజీర్ భుట్టో హత్య ............ 75
    6. వివాహం విడాకులు ............ 77
    7. తప్పిపోయిన వ్యక్తి ............ 79
    8. రాజాజీ మరణం ............ 81
    9. పదోన్నతి ! (ప్రమోషన్) ............ 83
    10. గృహం - స్థలం కొనడం ............ 85
    11. విదేశయానం ............ 87
    12. ఉద్యోగ ప్రాప్తి ............ 89
    13. జన్మించేది మగశిశువా ఆడశిశువా ............ 91
    14. వివాహమా మరణమా ............ 93
    15. ఆయుర్దాయ ప్రశ్న ............ 95
    16. ప్రసవకాలమెప్పుడు ............ 97

## జ్యోతిషము-పరిచయం

### జ్యోతిష శాస్త్ర ఆవిర్భావం

ఆది మానవునుండి ఆధునిక మానవుని వరకు, కులమేదైనా, మతమేదైనా, జాతి ఏదైనా, లింగమేదైనా రేపు ఏలా ఉంటుందో ? తెలుసుకోవాలనే యావ, తపన ప్రతి ఒక్కరిలో ఉంటుంది. అదియే జ్యోతి శ్శాస్త్ర ఆవిర్భావానికి మూలం. ఆది మానవుడు కొద్ది కొద్దిగా సంస్కారవంతుడవడానికి కూడా ఈ జ్యోతుల ప్రభావం వలన ఏర్పడే ప్రకృతి లోని మార్పే మూలకారణం. ప్రకృతిలో జరిగే ప్రతి మార్పుకు మనమవునన్నా కాదన్నా మన చుట్టు విశ్వాంతరాలంలో ఉన్న ఈ జ్యోతులే(వివిధ పేర్లతో పిలవబడే) కారణం అవుతాయి.

ఋతువుల మార్పిడి, వాతావరణంలో వివిధ దశలు, ప్రకృతి వైపరీత్యాలు గమనిస్తు వచ్చిన మన పూర్వులు, నక్షత్రాలు గ్రహాలు మొదలైన వాటి వివిధ గమనాలను పరిశీలిస్తూ ఈ జ్యోతిర్వేదానికి నాంది పలికినారు. కాలము, దేశము, దిక్కు వీటిని నిర్ణయించినారు. దశాబ్దాలుగా, శతాబ్దాలుగా పరిశీలించి తమ అనుభవాలను అనుభూతులను, పరిశీలనా ఫలితాంశాలను ఒక చోట క్రోడీకరించి పొందుపరిచినారు. వాటి ఫలిత స్వరూపమే జ్యోతిశ్శాస్త్రము.

ఈ శాస్త్ర పరిశీలనలో (అబ్జర్వేషన్) ముఖ్యత్వం ప్రాణులకే ఈబడినది. ప్రాణములేని, అచేతనాలమీద గాకుండ ప్రాణులపై జ్యోతుల ప్రభావం ఏ విధంగా వివిధ కాలాల్లో ఉండేది వాటికి ప్రతి చర్య ఈ ప్రాణులు ఏ విధంగా చేసేవి, ఆ నాటి అనుభుతులు ఎలా ఉండేవి అనే అంశాలపై జ్యోతిశ్శాస్త్రజ్ఞుల పరిశీలన, పరిశోధనలు చోటు చేసుకొన్నాయి.

మన చుట్టు ఉన్న గ్రహాల ప్రభావం ఒక జాతికో, కులానికో, మతానికో చెందిన వారిపై మాత్రమే కాదు భూమిపై ఉన్న ప్రతి ప్రాణపై ఉంటుంది. సూర్యుని వేడిమి, చంద్రుని చల్లదనం ప్రకృతి వైపరీత్యాల వల్ల వచ్చే కష్ట నష్టాలు మానవ సమాజం అంతా ఒకే విధంగా అనుభవించవలసి ఉంటుంది. అందుచే ఈ శాస్త్రం ఒక వర్గం వారికే పరిమితం కాదు.

### జ్యోతిశ్శాస్త్రం శాస్త్రమా? కాదా?

జ్యోతిశ్శాస్త్రం శాస్త్రమా? కాదా? అనే ప్రశ్న కూడ ఈ కాలంలో చోటుచేసుకుంటుంది. మనిషిని మనిషి అనవచ్చా అనకూడదా, పిల్లిని జంతువు అనవచ్చా, అనకూడదా,గరుడుని పక్షి అనవచ్చా అనకూడదా ?అన్నట్లు ఉంటుంది.

ఆకాశంలో మన చుట్టు గానవచ్చే జ్యోతిస్సుల గమన ప్రభావాన్ని బట్టి భూమి మీద నివసించే ప్రాణులపై ఏర్పడే స్థితి పరిస్థితులను చర్చించి నిర్ణయించే విషయంగల

పనికి జ్యోతిషశాస్త్రం అని ప్రాచీనులు, దాని ప్రవర్తకులు పేరు పెట్టిన తర్వాత ఇది శాస్త్రమవునా? కాదా? అని చర్చించడం మూర్ఖత అవుతుంది.

వ్యాకరణ శాస్త్రం, తర్కశాస్త్రం, మీమాంసా శాస్త్రం ఇలా జ్యోతిషం కూడ ఒక శాస్త్రమే.

వచ్చిన ఇబ్బంది 'సైన్స్' అనే పదానికి 'శాస్త్రం' అనే దాన్ని పర్యాయంగా తీసుకోవడమే. ఇవి రెండు పర్యాయపదాలు కావు. సైన్సు అనేది ఆధునిక కాలంలో విజ్ఞానశాస్త్రానికి ఆధునికులు నిర్ణయించిన మాట. పేరు.

శాస్త్ర మనే పదం కొన్ని వేల సంవత్సరాల నుండి వివిధ విద్యలను వివరించిచే పదంగా వాడకంలో ఉంది. అర్వాచీన కాలంలోని సైన్స్ లక్షణాల్ని అత్యంత ప్రాచీన కాలం నుండి వాడుకలో వస్తున్న ' శాస్త్ర' నిర్వచన లక్షణాల్ని తౌల్యం చేసి చర్చించడం విజ్ఞులు చేయవలసిన పని కాదు.

జ్యోతిషం సైన్సు అవునని వాదించడానికి పలువురు జ్యోతిశ్శాస్త్ర వేత్తలు తాపత్రయ పడుతున్నారు. అది అనవసరం. సైన్స్ పరిధి చాలా చిన్నది. ఫిజిక్స్, కెమిస్ట్రి, జూవాలజీ, బాటనీ ఇవన్ని చాలా తక్కువ పరిధి గలవి. వీటినన్నిటిని కలగలుపునుకొని ప్రాణం, మనస్సు గల వ్యక్తి చర్య, ప్రతి చర్యల పరిధి కలది జ్యోతిషం. సైన్సు బేసిక్స్‌ను మాత్రమే చెప్తుంది. మెడిసిన్ విద్యాభ్యాస కాలంలో సైన్సు. ప్రాక్టీసు చేసేటప్పుడు సైన్సు కాదు. కళ. లేబోరేటరీలో టెస్ట్ ఫలితాలు వచ్చినంత కచ్చితంగా రోగులందరి పైన సమానమైన, కచ్చితమైన ఫలితాలు చూడలేమనేది జన విదితమే. నేర్చుకొనేటప్పుడు కంప్యూటర్ సైన్సు. వృత్తిలో ప్రోగ్రామర్, కంప్యూటర్ ఆపరేటర్ అవుతాడు గాని కంప్యూటర్ సైంటిస్టు కాడు. యం.పి.సి. తీసుకొని చదివే సమయంలో ఫిజిక్సు, కెమిస్ట్రి సైన్సు అవుతుంది. బి.టెక్, బి.ఇ.చేసి జాబ్ చేసే సమయంలో ఇంజనీర్ అవుతాడు గాని సైంటిస్టుకాడు.

నేర్చుకొన్న విద్యను ప్రజా బాహుళ్య ప్రయోజనకరంగా మార్చేటప్పుడు సైన్సు అనే పరిధి దాటి విశాలతను తెచ్చుకొంటుంది. గ్రహాల గమన, గణన వరకే ఆస్ట్రోనమి. ప్రజోపయోగానికి వాడే సమయం సైన్సుకాదు. దానిని మించిన గొప్ప విద్య. గొప్ప శాస్త్రం.

సూర్యుడు నక్షత్రమా? గ్రహమా?

సూర్యుడు ఒక నక్షత్రం. మిగిలిన గ్రహాలు సూర్య కుటుంబం లోనివి. చంద్రుడు

భూమికి ఉపగ్రహం. రాహు,కేతువులకు రూపే లేదు. అయినా వాటిని 9 గ్రహాలుగా వ్యవహరిస్తూ జ్యోతిశాస్త్రజ్ఞులు తమ అజ్ఞానాన్ని ప్రకటిస్తున్నారని వాదించేవారు మన అక్షరాస్యులలో పలువురు ఉన్నారు.
ఆధునికుల అభిప్రాయం ప్రకారం సూర్యుడు ఒక నక్షత్రం. కాని సూర్యుని నక్షత్రంగా గుర్తించి తెలుపక ముందే సూర్యుని గ్రహంగా స్వీకరించిన జ్యోతిష శాస్త్రం వెలసింది. అసలు గ్రహం అంటే ఎమిటి? ప్లానెట్ అనే ఆంగ్ల పదానికి పర్యాయంగా గ్రహం అనే పదాన్ని స్వీకరించడమే తప్పు. గ్రహం అనే పదానికి 'గ్రహించేది' అని అర్థం. ప్లానెట్ కి చెప్పిన లక్షణాలున్నదే గ్రహం కాదు. భూమి తిరిగే కక్ష్యలో దగ్గరగా ఉండి భూమిజాలపై తమ ప్రభావాన్ని వ్యక్తీకరించేవన్నీ గ్రహాలే. అవి చిన్నవైనా, పెద్దవైనా, ఛాయారూపాలైనా, రూపులేని అప్రకాశక గ్రహాలైనా సరే.
సూర్యుని నుండి కాంతిని పొంది మిగిలిన గ్రహాలు తమ స్వభావాన్ని కలగలపి భూమిజాలపైన, సకల ప్రాణుల్ని ప్రభావితం చేస్తాయి. అదే సమయంలో వాటిపై భూమి తిరిగే కక్ష్యలోని నక్షత్రాల ప్రభావం కూడ ఉంటుంది.

ఇదే విధంగా అశ్విన్యాది నక్షత్రాలు సూర్యునిపై కూడ ప్రభావాన్ని చూపుతాయి. సూర్యుడు కూడ ఇతర గ్రహాలవలె ఆయా నక్షత్రాల ప్రభావాలకు లోనై తన కాంతిని భూమిపై ప్రసరింపచేస్తాడు. అగ్ని గోళంగా ఉండే రవి ఎల్లవేళలా ఒకే రకమైన వేడిమిని భూమిపై ప్రసరింపజేయడు. రాశి చక్రంలో తానున్న నక్షత్ర పరిసరాలకనుగుణంగానే వ్యక్తీకరిస్తాడు. ఉదాహరణకు మే 11 నుండి సుమారు 13 రోజులు రాశి చక్రంలో కృత్తికా నక్షత్ర ప్రాంతాల్లో సంచరించే కారణంగా రవి అత్యధిక వేడిమిని వెడల గ్రక్కడాన్ని అనుభవపూర్వకంగా మనం చూస్తున్నాము. అంటే ఇతర గ్రహాల వలె సూర్యుడు కూడ నక్షత్ర ప్రభావాలకు లోనై ప్రవర్తిస్తున్నాడు.
కాబట్టి సూర్యుడు కూడ ఒక గ్రహమే.

గ్రహం అంటే

గ్రహణం అంటే ఏమిటి? పట్టుకోవడం. రాహువు, కేతువు అనే ఛాయా గ్రహాలు రవిని, చంద్రుని కొంత సమయం పాటు పూర్తిగానో, పాక్షికంగానో కాన రాకుండ చేస్తాయి. అంటే రాహువు, కేతువుల ప్రభావం రవి, చంద్రులపై ఉంది. కాబట్టి నీడలైనా అవి గ్రహాలైనాయి. మరియొక అర్థం. ఆ కొంతకాలం రవిగాని, చంద్రుడు కాని భూమిజాలపై ప్రభావాన్ని చూపరు. కాబట్టి ఆ సమయంలో అవి గ్రహాలు కావు. కాబట్టే అప్పుడు 'గ్రహ న'గ్రహించడం లేదు. గ్రహణ అయింది. ఆ సమయంలో మానవునకు అధిక శక్తి ఉంటుంది. ధ్యానం, యోగం, జపం అత్యధిక ఫలితాల్నిస్తాయి. అని పెద్దలు

నిశ్చయించినారు.

ఆధునికులు ఒక కాంతి పుంజాన్ని ఒక మారు ప్లానెట్ అంటారు. కొన్నాళ్ళకు అది కాదంటారు. ఒక దాన్ని స్టార్ అంటారు, మరికొన్నాళ్ళకు కాదంటారు. ఒకమారు ఒక పేరు మరియెక మారు మరొక పేరు పెడతారు. 'జామాతా దశమో గ్రహః' అన్నప్పుడు అల్లుడు ప్లానెట్ కాదుకదా. ఒత్తిడి తెచ్చే వ్యక్తి అని అర్థం.

అదికాకుండా పదాలకు రూఢ్యర్థాలు, గౌణార్థాలు ఉంటాయి. వాటిని జాగ్రత్తగా అర్థంచేసుకోవాలి. ఫాదర్ అని పిలవబడేవారంతా కన్నతండ్రులు కానక్కరలేదు. ఫాదర్ అఫ్ నేషన్ అని పిలువబడే వ్యక్తి ఆ నిర్ణీతజాతివారి
కందరికి కన్నతండ్రి కాడు కదా.
'స్టార్' అంటే సూర్యాది స్వయం ప్రకాశం గల రూపాలైతే 'సినీ స్టార్' లో స్టార్ అర్థం ఏమిటి. ఆ స్టార్ కొన్నాళ్ళకు ఫేడ్ అయిపోతుందే. వెండితెరలో వెండి ఉందా? హోటల్లో కూర్చుని' రైస్' అంటే అన్నం తెస్తాడు. పలసరకుల అంగటిలో' రైస్' అంటే బియ్యం తెస్తాడు. ప్లానెటోరియంలో ప్లానెట్సును మాత్రమే పరిశీలిస్తామా? విశ్వాంతరాళంలో ఉండే అన్ని కాంతిపుంజాల్ని పరిశీలిస్తామా? స్కై అనే ఆకాశం వేరు. ఈ పంచభూతాల్లో 'ఈథర్' అనే ఆకాశం వేరు. సైకిల్లో హబ్, కంప్యూటర్‌లో హబ్ ఒకటేనా? కాన్స్టిట్యూషన్ అంటే రాజకీయశాస్త్రంలో ఒక అర్థం, శారీరకశాస్త్రం (మెడిసిన్)లో వేరొక అర్థం. హార్డువేర్ అనే పదానికి సందర్భాన్ని బట్టి అర్థనిర్ణయం చేయాలి గదా!
నవగ్రహాలకు ప్రతి రూపాలుగా స్వీకరింపబడే నవధాన్యాల సంగతేంటి. బియ్యం, గోధుమలు,రాగులు, ఒక వర్గానికి చెందితే కందులు, సెనగలు, మినుములు, అనేవి పప్పు వర్గానికి చెందినవి. నువ్వులు, ఉలవలు ధాన్యమా? పప్పులా? అయినా అన్నింటికి మనవారు ధాన్యమనే పేరు పెట్టారు.
ఏ శాస్త్రజ్ఞులైనా వారికి అవసరమైన రీతిలో పరిభాషలు సృష్టించుకొంటారు. వీటిని తప్పు బట్టడం విజ్ఞత కాదు. ప్రతి గ్రహం ఎప్పుడూ తన కక్ష్యలో తిరుగుతూ మొత్తం రాశి చక్రంలో ప్రయాణిస్తాయి. జ్యోతిషంలో భూ కేంద్రంగా అన్ని గ్రహాలూ దీని చుట్టూ తిరగడమే తీసుకుంటాము. నిజానికి భూమితో బాటు అన్ని గ్రహాలు సూర్యుని చుట్టూ తిరిగినా భూమి చుట్టూ తిరుగుతున్నట్టుగానే పరిగణిస్తాము. మనం భూమిలో నివసిస్తున్నాం కాబట్టి అలా తీసుకోవాలి. ఇండియాలో వాన పడే విషయం తెలుసుకోవడానికి అమెరికాలో మబ్బు లేచిందా లేదా అని చూడం కదా! ఇండియాలో రైళ్ళ రాక పోకల సమయం తెలుసుకోవడానికి యు.కె. టైం టేబుల్ పుస్తకం చూడం కదా!

# కృష్ణ మూర్తి పద్ధతి

ప్రపంచ మంతటా జ్యోతిశ్శాస్త్ర పండితులు, విద్యార్థులు, తమ సంభాషణలో కె.పి. సిస్టమ్ అనే పదాన్ని వాడకుండా ఉండరు. దానిని గురించి పూర్తిగా తెలిసినా, తెలియకపోయినా ఆ పద్ధతిని వాడుకోవడం తెలియకపోయినా కె.పి. సిస్టమ్ అంటూ ఒకటి ఉన్నదని అందరికీ తెలుసు. తెలుగులో లేక సంస్కృతంలో ఇది కృష్ణమూర్తి పద్ధతి అని వ్యవహరింపబడుతుంది. పద్ధతి అంటేనే సిస్టమ్. కె.పి. సిస్టమ్ అంటే కృష్ణమూర్తి పద్ధతి పద్ధతి అని అర్థం చెప్పవలసి వస్తుంది. ఆ విధంగా కాయిన్ చేయడం తప్పు. అయినా వ్యవహారంలో అదే ఎక్కువగా ఉన్నది. కృష్ణమూర్తి పద్ధతి అంటేనే చాలు.

కె.యస్. కృష్ణమూర్తి గారు చాలా సంవత్సరాల పరిశోధనల తరువాత ఈ పద్ధతిని ప్రచారంలోనికి తెచ్చారు. ఇది నిజానికి వినూత్నమైనది, విప్లవాత్మకమైనది. కొందరు సాంప్రదాయవాదులు ఈ విధానంలో దోషాన్ని లేదా తప్పును చెప్పలేక పోయినా దీనిని కనుగొన్నది 'మీన' అను కలము పేరుగల జ్యోతిష్య శాస్త్రవిదులే అని చెప్పి వీరి కీర్తికి మచ్చ తెచ్చుటకు ప్రయత్నం చేసినారు. అటులనే ఈ విధానంలో కూడ కొంత తప్పు ఉందని కొన్ని సందర్భాలలో ఫలితాలు తారుమారు అవుతున్నాయని, అందువల్ల ఇది పూర్తిగా శాస్త్రీయం కాదని చెప్పేవారు లేకపోలేదు.

న్యూటన్ చెప్పక ముందు నుంచి కూడా భూమికి ఆకర్షణ శక్తి ఉంది. అలాగే పై నుంచి పడిన వస్తువు తప్పక భూమిపైన పడుతుందని అందరికీ తెలుసు. అయినా న్యూటన్ చెప్పినది ఒక సిద్ధాంతంగా ఒక సూత్రంగా విజ్ఞాన శాస్త్రంలో నిలబడింది. అదే విధంగా శ్రీ మీన గారు ఇంకా మరి కొందరు, నక్షత్రాలను ఆధారంగా చేసుకొని వాటిని విభజించడానికి ప్రయత్నం చేసినా వీరి వలె నిశితమైన పద్ధతిలో ఇతరుల ఆమోద యోగ్యం పొందే రీతిలో చెప్పలేక పోయినారని చెప్పాలి.

అలాగే వీరు చెప్పినదంతా చాలా నూతనమైనదని, సంప్రదాయ జ్యోతిష్యములో పూర్తిగా ఎక్కడా కానరాదని చెప్పడానికి వీలులేదు. ప్రశ్న మార్గలో, ధృవనాడిలో వీటికి మూలాలు ఉన్నాయి. అటులనే అష్టక వర్గ విధానం కూడ ఈ పద్ధతి తయారికి తోడ్పడి ఉంటుంది. నవాంశ విధానములో ప్రతి రాశి 9 గా విభజింపబడగా వీరు ప్రతి నక్షత్రాన్ని 9 గా విభజించారు. దానికి కారణం నక్షత్రాలకు, నక్షత్రాల అధిపతులకు ప్రాధాన్యతను ఇచ్చే ఉడు దశావిధానం ప్రచారంలోకి రావడమే. మన వారు రాశిచక్రాన్ని 

విధములగా విభాగించి షోడశ వర్గుకు ప్రాముఖ్యం ఇచ్చినారు. అవి కాలచక్రదశ, జైమిని దశ మొదలగు రాశి దశలను బట్టి ఫలితాలు నిర్ణయించే సమయంలో, గ్రహాల బలాల్ని నిర్ణయించే టప్పుడు తోడ్పడుతుంది. దానిని మనసులో ఉంచుకొని ఈ కాలంలో బహుళ ప్రచారంలో ఉన్న వింశోత్తరి దశావిధానాన్ని మూలాధారం చేసుకొని, ఖచ్చితంగా ఫలితం చెప్పడానికి తోడ్పడే విధానాన్ని కృష్ణమూర్తి గారు కనుగొని మనకు అందించినారు. ఇది నిజానికి మన అదృష్టం అని చెప్పాలి.
మీన గారు ఆ నక్షత్రాలను నాలుగు సమానమైన భాగాలుగా చేయడం మనకు కానవస్తుంది. కాని వీరు వింశోత్తరి దశను ఆధారం చేసుకొని ప్రతిగ్రహానికి చెందిన దశా సంవత్సరాల నిష్పత్తిలో మొత్తం రాశి చక్రాన్ని 249 భాగాలుగా విభజించారు.
ఇట్లు శ్రీ కృష్ణమూర్తిగారు జ్యోతిష శాస్త్ర రంగంలో ప్రజలకు ఎంతో మేలు చేశారు అనక తప్పదు. సాయన పద్ధతిలో అయినా, నిరయణ పద్ధతిలో అయినా రాశులు 12. అవి మేషం, వృషభం, మిథునం, కర్కాటకం, సింహం, కన్య, తుల, వృశ్చికం, ధనుస్సు, మకరం, కుంభం, మీనం. పాశ్చాత్యులు దీనిని 360 డిగ్రీలుగా విభజించి ఒక్కొక్క డిగ్రీకి ఉన్న ప్రత్యేకతను, ప్రాముఖ్యతను, విడమరచి చెపుతూ ఏ ఏ గ్రహాలు ఏ ఏ డిగ్రీలో ఉంటే ఎలాంటి ఫలితాన్ని ఇస్తారో, వారు పరస్పరం, నిర్ణీతమైన వీక్షణను కలిగి ఉంటే ఎలాంటి నిర్ణీత ఫలితాలను ఇస్తారో చెప్పి ఉన్నారు. జ్యోతిష్య శాస్త్ర రీత్యా వారు రాశిచక్రాన్ని నక్షత్రాలుగా విభజించలేదనే చెప్పాలి.
మనవారు ఈ రాశి చక్రాన్ని 27 భాగాలుగాను ప్రతి ఒక్క నక్షత్రాన్ని 4 పాదాలుగాను విభజించినారు. మొత్తం 108 పాదాలు కలది ఒక రాశి చక్రం అని చెప్పినారు. అనగా ఒక్కొక్క రాశిని 9 భాగాలుగా చేయడం జరిగింది. అవి సమానమైన భాగాలు. కాని కృష్ణమూర్తి గారు ఒక్కొక్క నక్షత్రాన్ని 9 భాగాలుగా చేయడం, అందునా వింశోత్తరి దశా రీతిలో చేయడం గమనార్హం. అశ్విని నక్షత్రం 0 డిగ్రీల నుండి 13.20 డిగ్రీల వరకు మేషరాశిలో ఉంటుంది. మనవారు 13 భాగల 20 గడియలు అని నామకరణం చేశారు. ఈ 13.20 డిగ్రీలను 9 భాగాలుగా చేయదలచినప్పుడు తదధిపతి కేతుదశా సంవత్సరాల్ని పరిగణలోనికి తీసుకొని (అశ్వినికి కేతువు అధిపతి కావున) మొదటి భాగం 13.20 ని 7/120 భాగాలు చేయగా మొదటి భాగమునకు 0.46.40 డిగ్రీలు వచ్చినది. ఇది కేతువునకు చెందినది. ఈ మొత్తం 800 నిమిషాలను ఒక్కొక్క గ్రహానికి పంచాలి. ఈ విధముగా అన్ని గ్రహములకు చేసిన అశ్వినిలో ప్రతి గ్రహానికి చెందిన కక్ష్య తెలిసి వస్తుంది.

భరణి నక్షత్రానికి 13.20 ని 20/120 భాగించగా 2.13.20 వచ్చును. దీనిని మరల 9 గ్రహములకు వారివారి దశా సంవత్సర విధానంలో పంచగా ఉపకక్ష్యలు క్రిందివిధంగా వస్తాయి.

శుక్రునకు 0.22.13.20 రవికి 0.6.40.00
చంద్రునకు 0.11.06.40
కుజునకు 0.7.46.40 రాహు 0.20.00.00 గురు
0.17.46.40
శని 0.21.06.40 బుధ 0.18.53.20 కేతు
0.7.46.40

ఇట్లు అన్ని నక్షత్రాలకు వింశోత్తరి దశారీతిలో భాగములు పంచగా మొత్తం రాశి చక్రం 249 భాగములు అయినవి. ఒక్కొక్క భాగమునకు ఒక్కొక్క గ్రహం అధిపతి అగును. మిథునంలో డి.12.50నిలో ఒక గ్రహం ఉన్నది అనగా, ఆ గ్రహం మిథునమందు ఉండుటచే దాని రాశి అధిపతి బుధుడు, నక్షత్రాధిపతి రాహువు కక్ష్యాపతి బుధుడు. మన సంప్రదాయపద్ధతిలో 12.50 లో ఉన్న గ్రహం తానున్న రాశి అధిపతి చెందిన ఫలితాన్ని ఇస్తాడు. ఆ పిదప తానున్న నక్షత్రాధిపతి ఫలితాన్ని ఇస్తాడు. కృష్ణమూర్తిగారి అభిప్రాయం ప్రకారం ఆ నక్షత్రాన్ని 9 భాగాలు చేయగా ఏ భాగంలో ఆ గ్రహం ఉంటుందో ఆ భాగాధిపతి ఇచ్చే ఫలితాన్ని ఇస్తాడు. అనగా సూర్యుడు 72.50 లో ఉన్నప్పుడు అతడు బుధుడు ఇచ్చే ఫలితాన్ని ఇస్తాడు చెప్పాలి.

ఇట్లు రాశి చక్రాన్ని విభజించడంతో తృప్తి చెందక శని బాహిరకక్ష్యలోని గ్రహాలను నిరయణ విధానం లోకి తెస్తూ అందులో కూడ ఒక ప్రత్యేకతను చాటినారు. స్వయంగా ఒక అయనాంశను కూడ గణించి మనకిచ్చినారు. అది లాహరి అయనాంశకు కొద్ది దగ్గరగా ఉంటుంది. బి.వి. రామన్ గారి అయనాంశకు, చైత్ర పక్ష అయనాంశకు చాల తేడా ఉంటుంది. వీరు ఇచ్చిన అయనాంశను కృష్ణమూర్తి అయనాంశ అంటాము. వేర్వేరు అయనాంశాలు, వేరు వేరు దశా శేషాలను చూపుతాయి. కె.పి. అయనాంశ వారి ఎఫిమెరిస్‌పై గణిస్తే ఫలితాలు సరిగా నిర్ణయించిన సమయంలో జరగడం గమనించవచ్చు.

సాధారణంగా అమడలు జన్మించినపుడు తేడా నిమిషాలలో మాత్రమే ఉంటే ఒకే లగ్నం, ఒకే నక్షత్రం ఉండడంతో పాటు అన్ని గ్రహాలు ఇద్దరి జాతకాల చక్రంలో ఒకే రీతిలో ఉంటాయి. కాని జాతకుల ఫలితాలు వేరు వేరుగా ఉంటాయి. వారి వృత్తుల్లో, రంగుల్లో, జీవన విధానంలో, కొన్ని ముఖ్యమైన రోగాల విషయంలో విభిన్నత కానవస్తుంది. ఒక వేళ విభిన్న ద్రేక్కాణాలలో, విభిన్న నవాంశలలో జన్మించి ఉండవచ్చునని చెప్పుకొని తృప్తిపడవచ్చు. లేదా ఆ విభిన్నతకు ఆత్మల పూర్వజన్మ

సంస్కారమే అని చెప్పుకొని దాటవేయవచ్చు. కాని అది శాస్త్రీయం కాదు. కృష్ణమూర్తి పద్ధతి అట్టి అమడ బిడ్డలలో గల విభిన్నతకు కూడా దారి కల్పిస్తుంది. వారి విధానంలో ప్రతి నక్షత్రం 9 భాగాలుగా చేయబడి ఉన్న సంగతి మనకు తెలుసు. లగ్న భావం, అమడ బిడ్డలకు ఒకే నక్షత్రంలో పడిఉన్నా కక్ష్య భాగం వేరు కావడానికి అవకాశాలు ఉన్నాయి.

ఒక వేళ ఆ కక్ష్యాభాగం కూడ ఒకటే అయినా దానిని మరలా 9 సూక్ష్మ భాగాలు చేసిన తప్పక భేదం తెలియ వస్తుంది. లగ్న భావం వలె దశమ భావాన్ని, 6 వ భావాన్ని, 2 వ భావాన్ని చేస్తే వృత్తిలో భేదం కూడా తెలియవస్తుంది. 1,6,8,12 భావాలను పరిశీలిస్తే అనారోగ్య కారణాలు, వాటి సమయాలు స్పష్టంగా తెలుసుకో వీలు అవుతుంది.

కె.పి. సిస్టమ్‌లో ఒక మైలురాయిగా చెప్పుకోదగినది హొరరి అస్ట్రాలజీ. (ప్రశ్నజాతకం). దీని ఆధారంగా 100 కి 98 శాతం ఫలితం ఖచ్చితంగా చెప్పవచ్చు. అలవాటు పడేంత వరకు ఇది కొంత శ్రమను, విసుగును కలిగించవచ్చు. ఫలితాన్ని సరిగా చెప్పడంలో దీనికి ఇదే సాటి. మొత్తం రాశి చక్రాన్ని 249 భాగాలుగా చేసిఉన్నాము. ప్రశ్న అడుగుటకు వచ్చిన వ్యక్తిని 249 లోగా ఏదైనా ఒక సంఖ్యను చెప్పమనాలి. ఆ సంఖ్య ఆధారంగా చేసుకొని అనగా దానిని ప్రథమభావంగా తీసుకొని 12 భావాలను తయారు చేసి, ఆ సమయంలో గోచార రీత్యా గోచార గ్రహాలను వివిధ రాశులలో వేసి ప్రశ్నకు సంబంధించిన భావాలను ఆధారంగా చేసుకొని ఫలితాలు చెప్పాలి.
వీరు నిర్ణయించిన రీతిలో కారకులను (సిగ్నిఫికేటార్స్) నిర్ద్వంద్వంగా నిర్ణయిస్తేనే ఫలితం ఖచ్చితమవుతుంది.

కె.పి. సిస్టమ్ అర్ధమై జీర్ణం కావడం చాలా కష్టం. దాని పేరు చెప్పినంత సులభం కాదు. కొందరికి కొన్ని నెలలు పట్టవచ్చును. కొందరికి కొన్ని సంవత్సరాలు పట్టవచ్చును. ఈ పద్ధతిలో సిగ్‌నిఫికెటర్స్‌కి అత్యంత ప్రాముఖ్యత కలదు.

మన సంప్రదాయ పద్ధతిలో ఒక భావాన్ని గురించి తెలిపే గ్రహాన్ని కారకము అంటారు. ఆ కారకగ్రహం ఉన్న భావాన్ని ఆ భావ అధిపతి ఉన్న స్థలాన్ని బట్టి వాటిని చూచే గ్రహాలను బట్టి ఫలితాలు చెప్పడం జరుగుతుంది.
కె.పి. సిస్టమ్‌లో ఈ విధానం ఇంకా కొద్దిగా సాగదీయబడి సిగ్‌నిఫికేటర్స్‌గా చెప్పడం జరిగింది.

పరిశీలనలో ఉన్న గ్రహాల ఉనికి భావ మాత్రంలో తృప్తి పడక ఆ గ్రహం ఏ నక్షత్రంలో నున్నదో దాని అధిపతిని ముందు తెలుసుకోవాలి. ఆ గ్రహం ఉన్న రాశి అధిపతిని తెలుసుకోవాలి. ఆ రాశి అధిపతి ఏ నక్షత్రంలో ఉన్నదో గమనించాలి. భావంలో ఉన్న గ్రహం, ఆగ్రహమున్న నక్షత్రాధిపతి, ఆగ్రహమున్న రాశిఅధిపతి, తన్నక్షత్రాధిపతి ఈ 4 రకాలైన గ్రహాలతో కలసికాని, చూస్తూ కాని ఉన్న గ్రహాలను కూడా పరిగణలోకి తీసుకోవాలి. ఇప్పుడు మొత్తం సిగ్నిఫికెటర్స్‌ని గుర్తించినట్లు అవుతుంది.

ఉదారహణకు ఒక వ్యక్తి యొక్క వృత్తిని గురించి పరిశీలించేటప్పుడు దశమ భావాన్ని చూడాలి. తొలుతగా 10 వ భావంలో ఏఏ గ్రహాలు ఉన్నయో చూసుకోవాలి. ( బుధుడు ఉన్నాడు అనుకుందాము). వెంటనే ఆ గ్రహం ఏ నక్షత్రంలో ఉన్నదో చూడాలి. ఆ బుధ గ్రహం ఉన్న రాశి అధిపతి ఎవరో కనుగొనాలి. ఆ రాశి అధిపతి ఏ నక్షత్రంలో ఉన్నాడో తెలుసుకోవాలి. ఇలాగే ఒక భావంలో నివాసమున్న గ్రహం, ఆ గ్రహం ఉన్న నక్షత్రం, అలాగే ఆ గ్రహం ఉన్న రాశి అధిపతి, ఆ అధిపతి ఉన్న నక్షత్రాధిపతి. ఇవి 4 ముఖ్య కారకాలు సిగ్నిఫికెటర్స్ అవుతాయి. ఈ 4 గ్రహాలను చూచే లేదా వాటితో కలసి ఉన్న గ్రహాలు కూడ కారకాలు అవుతాయి. అయితే ఇవి అనుషంగికాలు.

ఈ కె.పి. సిస్టమ్ లో గ్రహాల వీక్షణ కేవలం సాంప్రదాయ పద్ధతిలోనిది మాత్రమే కాదు. పాశ్చాత్య విధానం కూడా స్వీకరింపబడినది. దీనిని కేవలం పాశ్చాత్యం అని చెప్పుటకు కూడా వీలులేదు. తాచక విధానంలో ఇలాంటి వీక్షణలు చోటు చేసుకొని ఉన్నాయి. సాధారణంగా అన్ని గ్రహాలు మన పద్ధతిలో 7 వ ఇంటిని చూస్తాయి. గురు గ్రహం 5,9 రాశులను, శని గ్రహం 3,10 రాశులను, కుజ గ్రహం 4,8 రాశులను కూడా చూస్తాయి.

కె.పి. సిస్టమ్ లో 45,60,90,105,120,135,180, డిగ్రీల దూరంలో ఉన్న గ్రహాలను అన్ని గ్రహాలు వీక్షిస్తాయి. ఒకే రాశిలో ఒక గ్రహంతో చాలా గ్రహాలు కలసి ఉంటే కంజన్క్షన్ అంటారు. 90, 180 వీరి పద్ధతి ప్రకారం మంచిది కాదు. 45, 135 అంత మంచిది కాదు. మిగిలిన వీక్షణలు మంచివి.

ఈ విధానంలో మరొక ముఖ్యమైన పరిభాషాపదం ఫార్చునా. ఇది పాశ్చాత్య పద్ధతిలో ఉన్న పార్స్ ఫార్చునాగా లెక్కకట్టవచ్చు. ఇది ఈ విధానంలో అత్యంతకీలకమైన పాత్ర వహిస్తుంది. ప్రశ్న జాతకంలో ఈ ఫార్చునా డిగ్రీలను ఆధారంగా చేసుకొని తలచిన పని జరిగేది లేనిది, అది ఎప్పుడు జరిగేది మొదలైన విషయాలను చాలా చక్కగా

ఖచ్చితంగా చెప్పవీలౌతుంది.
ఆధికారిక గ్రహాలకు వీరు అత్యంత ప్రాముఖ్యమిచ్చినారు. దీనిని రూలింగ్ ప్లానెట్స్ అంటారు. జాతక గణన ప్రారంభించిన సమయాన గడిచే లగ్నాధిపతి, లగ్ననక్షత్రాధిపతి, రాశ్యధిపతి, చంద్రనక్షత్రాధిపతి, వారాధిపతి ఈ ఐదు గ్రహాలు ఆధికారిక గ్రహాలవుతాయి. ఇన్ని కొత్త విశేషాలలో కె.పి. సిస్టమ్. ప్రపంచ వ్యాప్తి చెంది ఉన్నది. సూర్యునికి పరదా కట్టలేము. అలాగే ఈ పద్ధతిని ఇందలి మేళ్ళను ఎవరూ కాదనలేరు. నిజానికి తొలుత అర్థం చేసుకోవడం చాలా కష్టం. సరిగా అవగాహన అయినప్పుడు ఫలితం సుకరం సులభమౌతుంది.

శ్రీ కె.యస్. కృష్ణమూర్తి గారి తరువాత వారి అనుయాయులు దీనిని ఇంకా విపులీకరించి, లోతుగా విశదీకరించినారు. వీరు చూపిన పద్ధతిలోని రాశి చక్రాన్ని 249 భాగములు చేయడంతో తృప్తి చెందక ప్రతి ఒక్క భాగమును కూడా 9 భాగాలుగా విభజించిరి. అది సబ్ సబ్ నిర్మాణమునకు దారి తీసినది. రాశి, నక్షత్రం, కక్ష్య, ఉపకక్ష్య భాగముగా విభజించడం జరిగింది. దీని వల్ల జరుగవలసిన పని జరిగే సమయాన్ని ఖచ్చితంగా పిన్ పాయింట్ చేయడానికి వీలౌతుంది. ఇది ఒక విధంగా మహాదశ, విదశ, అంతర్ విదశ, సూక్ష్మదశ వర్గీకరణలాంటిది.

ఎందరో ఎందరెందరో మహానుభావులు జ్యోతిర్విదులు ఈ కె.పి. విధానం ద్వారా ప్రజలకు, ఆర్తులకు మానసికంగా సాంత్వన నందిస్తున్నారు. కె.ఎస్.కె. గారి తనయులు శ్రీ కె. సుబ్రహ్మణ్యం గారు, శ్రీ కె. హరిహరన్ గారు, శ్రీ వైఖరి రామమూర్తిగారు, శ్రీ కె.ఎం. సుబ్రహ్మణ్యం గారు, శ్రీ కె. బాలచంద్రన్ గారు, శ్రీ అంబరీష్గారు బాలశేఖర్ గారు, భాస్కరన్ గారు మొదలైన పెద్దలు 'అస్ట్రాలజి అండ్ అదృష్ట' అనే మాస పత్రికలో, కె.పి యియర్ బుక్లో పరిశోధనావ్యాసాలు ప్రచురించి ఈ పద్ధతికి ఎంతో ప్రాచుర్యం తెచ్చినారు.
సర్వశ్రీ యోగేశ్వరరావు లజ్మీ, లూథర్ రథ్, మేడం సేంద్రీ క్రోతర్, ఏంద్రూదత్త్, కుమార సంజయ్, కనకబోస్మియా, రంగరాజన్ కృష్ణమూర్తి, ఎం.కె. విశ్వనాథ్ నాయర్, పద్మ రామచంద్రన్, పునిత్ పాండే, ప్రణవ్ శివ, రఘునాథరావు నేమాని, సునిల్ గొండలేకర్, టిన్ విన్, వెంకటరమణ మొదలైనవారు,
ఒరిస్సాకు చెందిన కేశబ్ ఆర్ కర్ గారి మల్టిస్టెల్లర్ థియరీ, కె.బి. థియరీ, ఎస్.బి. కుల్లర్ థియరీ, కస్పల్ ఇంటర్ లింక్ థియరీ, టి.ఎస్.పి థియరీ ఇత్యాది అడ్వాన్స్డ్ విధానాలు తర్వాత రాబోయే పుస్తకంలో చోటుచేసుకొంటాయి.

# కృష్ణమూర్తి పద్ధతి

జ్యోతిషశాస్త్ర ఆధారంగా ఒకవ్యక్తి జీవితంలో కొన్ని ముఖ్యసంఘటనలు జరుగుతాయా జరుగవా? ఎప్పుడు జరుగుతాయి? అని తెలుసుకోవడానికి ప్రయత్నం చేస్తాము. అదే జ్యోతిషంయొక్క ముఖ్యప్రయోజనం. ఆ పని ఒక కృష్ణమూర్తి పద్ధతి ద్వారానే సుసాధ్యమవుతుంది. మిగిలిన వ్యక్తి రంగు, ఒడ్డు పొడుగు, గుణగణాలు, స్వభావాలు రాసులను బట్టి, గ్రహాలను బట్టి వాటి సంబంధాన్ని బట్టి కొంత అటో ఇటో చెప్పుకోవచ్చు. అయినా ఇవి దశలను బట్టి, గోచారాన్ని బట్టి మారుతూనే ఉంటాయి. కొన్ని సమయాల్లో సత్యమవుతాయి. కొన్ని సందర్భాల్లో అసత్యాలవుతాయి.

రోగప్రాప్తి, రోగవిముక్తి, సంతానం, వివాహం, ఉద్యోగం, విదేశగమనం ఇలాంటి అతిముఖ్యమైన విషయాలు ఎప్పుడు అనుభూతిలోనికి వస్తాయి అనేది కృష్ణమూర్తి పద్ధతి ద్వారా చక్కగా తెలుసుకో సాధ్యమవుతుంది. మిగిలిన ఏ ఇతరవిధానాల్లో అయినా ఉజ్జాయింపుగా చెప్పవలసిందే. జరిగితే విజయం. జరుగకుంటే నిశ్శబ్దం. ఈ స్థితిని అధిగమించడానికి గాను కృష్ణమూర్తిగారు వివిధ విధానాల్లో, వివిధరీతుల్లో పరిశోధన జరిపి ఈ పద్ధతిని మన కందించినారు. ఇది ప్రపంచవ్యాప్త జ్యోతిర్విదుల అదృష్టం. తపః ఫలం.

వింశోత్తరీవిధాన ఆవిర్భావానికిముందు రాశిదశలు, హరగౌరీ విధానాలు అలవాటులో ఉండేవి. అవి దుస్సాధ్యాలు. అధికమైన ధీశక్తి అవసరం. మానవుడు సుఖజీవి. అన్నీ సులభంగా జరుపుకో గోరుతాడు. వింశోత్తరీ ఆవిర్భావం ఫలిత నిర్ణయాన్ని సులభతరం చేసింది.

కృష్ణమూర్తి పద్ధతి అంటే కృష్ణమూర్తి అయనాంశం తీసుకొని జాతక చక్రం తయారు చేయడం మాత్రమే కాదు. కొందరు ఇలా జాతకచక్రం తయారు చేసో, కంప్యూటర్ ద్వారా కె.పి. అయనాంశతో జాతకచక్రం తయారుచేయించో ఫలితనిర్ణయం చేస్తూ తాము కె.పి. అస్ట్రాలజర్సమని చెప్పుకొంటారు. అది సరి కాదు.

కృష్ణమూర్తి పద్ధతిని సరిగా అర్థం చేసుకొని, అవగాహన చేసుకొని, జీర్ణం చేసుకొని, ఫలిత నిర్ణయం చేసి చెప్పడానికి చాల శ్రమ, పరిశోధన, అధ్యయనం, అధిక కాలవినియోగం అవసరం.

ఇతరవిధానాలద్వారా అమడబిడ్డలకు తయారుచేసిన జాతకాలు ఒకేవిధంగా ఉంటాయి. కాని మనం అట్టి పిల్లల గుణగణాలు, విద్యాభ్యాసం, వివాహం, రోగం, మరణం ఇత్యాదులు పరస్పరం భిన్నంగా ఉండడాన్ని చూస్తున్నాము. కాని కృష్ణమూర్తి పద్ధతి ద్వారా తయారైన జాతకాల్లో ప్రత్యేక వ్యక్తి జాతకంలో పైవిషయాలు భిన్నంగా పరిశీలింప వీలవుతుంది. ఇతర విధానాల్లో కొన్ని ఊహలు అనుమానాలు అవసరమవుతాయి. కాని కృష్ణమూర్తి పద్ధతిలో సూక్ష్మత్వం, ఖచ్చితత్వం ఉంటుంది. ఒక సంఘటన జరుగుతుందా, జరుగదా ఎప్పుడు అనే విషయాలు దృఢంగా చెప్ప వీలవుతుంది.

కృష్ణమూర్తి విధానానికి మూలం మన సంప్రదాయ జ్యోతిషమే. వేరేది కాదు. వైదిక జ్యోతిషంలో వివిధవిధానాలను అధ్యయనం చేసి, అందులోని లోతుపాతులను అర్థం చేసుకొని గ్రంథాల్లో ఉన్న వాటిని వల్లె వేస్తూ ఆ ఫలితాల్ని వ్రాసి యివ్వడం చేయకుండ ఆ విధానంలోని లోపాలను పసిగట్టి, ఎత్తి చూపి, సరిదిద్ది జ్యోతిష శాస్త్రానికే వీరు వన్నె తెచ్చినారు. జ్యోతిషశాస్త్ర ఫలితాలు 60 శాతమే నిజమవుతాయి అనే వాదాన్ని అబద్ధం చేసి ఆ శాస్త్రం 95 శాతం వరకు ఖచ్చితమైన ఫలితాలనివ్వగలదని నిరూపించినారు.

వైదిక జ్యోతిషానికి కృష్ణమూర్తి పద్ధతికి గలభేదాలు

1. కృష్ణమూర్తపద్ధతిలో రాసులకంటే నక్షత్రాలు, వాటి కక్ష్యలకే ప్రాముఖ్యం.
2. ప్రతినక్షత్రం మరల తొమ్మిదిగా విభజింప బడుతుంది. (సమానంగా కాదు) దీనిని సబ్ అని పిలిచారు. ఈ పుస్తకంలో 'కక్ష్య' అంటాము.
3. తమ పద్ధతికంటూ ఒక ప్రత్యేకమైన అయనాంశను ఏర్పరచుకొన్నారు.(ఇది లాహిరి, బి.వి.రామన్ అయనాంశలకంటే భిన్నమైనది)
4. కృష్ణమూర్తిపద్ధతిలో భావ మధ్యమానికే ప్రాధాన్యం.
5. ప్లాసిడాస్ సిద్ధాంతాన్ననుసరించి భావవిభజన జరుగుతుంది.
6. ఏ గ్రహమైనా తానున్న నక్షత్రాన్ని బట్టే తన దశాకాలంలో ఫలితాన్నిస్తుంది.(వైదిక విధానంలో గ్రహస్థితిని వ్రాసే సమయంలో గ్రహమున్న నక్షత్రాన్ని, దాని పాదాన్ని కూడ గుర్తించడం దీనిని సమర్థిస్తుంది.) దీనిని కృష్ణమూర్తిగారు నొక్కి చెప్పడం జరిగింది.
7. ఒక రాశిలో ఒక గ్రహమున్న తావును రాశి,నక్షత్ర,కక్ష్యలుగా విడదీసి వ్రాయడం జరుగుతుంది. ఫలితానుభూతి నిర్ణయం కక్ష్యాధిపతి అధీనంలో ఉంటుంది. నక్షత్రాన్ని కక్ష్యలుగా విడగొట్టడం వింశోత్తరి విధానాన్ని అనుసరించి ఉంటుంది.
8. అన్నిటికన్న ముఖ్యమైనది ఆధికారిక గ్రహ నిర్ణయం. దీనిని ఆంగ్లంలో రూలింగ్ ప్లానెట్ అంటారు. ఫలితనిర్ణయంలో జననకాల జాతకంకంటే ప్రశ్నజాతకం ప్రయోజనకారి అని జ్యోతిర్విదులకు తెలుసు. ప్రశ్నజాతకవిధానంలో ఫలితనిర్ణయసమయంలోని గ్రహస్థితిని తెలుసుకొని దాని ఆధారంగా ఫలితం చెప్పడం ప్రయోజనకారి అని ఈ రూలింగ్ ప్లానెట్స్‌ని తమ పద్ధతిలో ప్రవేశపెట్టారు.
9. శని బాహిర కక్ష్యలోని యురేనస్, నెప్ట్యూన్, ప్లూటో గ్రహాలను కూడ తీసుకోవడం జరిగింది. (పాశ్చాత్య విధానంలో వలె). అయితే గణనం నిరయణం.
10. ఫార్ట్యూనాను ప్రవేశపెట్టినారు. ఇది తాజకవిధానంలో పుణ్యసహమంతో సమానం. అరెబిక్ పార్ట్స్‌లో ఒకటి.

వీక్షణలు

వైదిక జ్యోతిషంలో వీక్షణలకు ప్రాముఖ్యత కలదు. అన్ని గ్రహాలు తామున్న రాశినుండి ఏడవ రాశిని చూస్తాయి. దానితో పాటు శని 3,10 రాసుల్ని, కుజుడు 4,8 రాసుల్ని, గురువు 5,9 రాసుల్ని చూస్తారు, రాహుకేతువులు గురువులా చూస్తారు. 12 వ రాశిని కూడా రాహుకేతువులు చూస్తారని కొందరు చెప్తారు. ఇక్కడ గ్రహాలు రాశిని, రాశిలోని గ్రహాల్ని కూడ చూస్తాయి.

కృష్ణమూర్తిగారు వీక్షణను భావానికి గూడ విస్తరింపజేసినారు. వీటితో బాటు పాశ్చాత్యజ్యోతిషంలో వాడుకలో ఉన్న గ్రహవీక్షణలను తమ పద్ధతిలో ప్రవేశ పెట్టినారు. పాశ్చాత్యవిధానంలో వీక్షణ అనేది గ్రహానికి గ్రహానికి మధ్య ఉన్న దూరాన్ని బట్టి నిర్ణయింప బడుతుంది.

పాశ్చాత్య పద్ధతిలో గ్రహ దృష్టులు

ఏ జ్యోతిష విధానంలోనైనా గ్రహాలకు ఇతర గ్రహాలపై, రాసులపై ఉన్న దృష్టులకు అత్యంత ప్రాముఖ్యత గలదు. ఆ దృష్టుల ఆధారంగా ఫలిత నిర్ణయం జరుగుతుంది. భూగ్రహంపై వేరు వేరు గ్రహాలు వాటి కాంతులను వేర్వేరు దిశల నుండి ప్రసరింప జేస్తుంటాయి. కొన్ని వైపుల నుండి వచ్చే కాంతులు శుభ ఫలితాల్ని, మరి కొన్ని వైపుల నుండి వచ్చే కాంతులు అశుభ ఫలితాల్ని ఇస్తాయి.

వైదిక జ్యోతిషంలో అన్ని గ్రహాలు తామున్న తావు నుండి 7 వ రాశిని, అందులోని గ్రహాల్ని చూస్తాయి. గురు, శని, కుజులకు ప్రత్యేక దృష్టులు కూడ ఉన్నాయి. గురువు 7 దృష్టితో పాటు 5,9 రాసుల్ని, శని 3,10 రాసుల్ని, కుజుడు 4,8 రాసుల్ని చూస్తారు.

పాశ్చాత్య విధానంలో రెండు గ్రహాల మధ్య దూరమే దృష్టి అవుతుంది. ఫలితాన్ని వివరించి చెప్పేటప్పుడు రెండు గ్రహాల మధ్య నిర్ణీత దూరం ( దృష్టి) ఉన్నదా లేదా. అది అనుకూలమా ప్రతి కూలమా, ఎంత పరిధి అవసరమౌతుంది. అనే విషయాల్ని జాగ్రత్తగా పరిశీలించాలి.

తాజక విధానంలో కూడ ఈ ప్రత్యేక దృష్టులు గాన వస్తాయి.

| పేరు | గ్రహానికి గ్రహానికి దూరం | శుభ/అశుభ | పరిధి |
|---|---|---|---|
| ట్రైన్ | 120 డిగ్రి | శు | 8 డిగ్రి |
| సెక్స్టైల్ | 60 డిగ్రి | శు | 8 డిగ్రి |
| సేమిసెక్స్టైటైల్ | 30 డిగ్రి | శు | 4 డిగ్రి |
| స్క్వేర్ | 90 డిగ్రి | అశు | 8 డిగ్రి |

| | | | |
|---|---|---|---|
| సేస్ కి క్వాడ్రేట్ | 135 డిగ్రి | అశు | 2 డిగ్రి |
| క్వింకంక్స్ | 150 డిగ్రి | అశు | 2 డిగ్రి |
| అప్పోసిషన్ | 180 డిగ్రి | అశు | 8 డిగ్రి |

రవి చంద్రులకు మాత్రంపరిధి 12 డిగ్రీలు

ఫలిత నిర్ణయంలో దృక్కులు ఇతర విషయాలు.

వీక్షించే గ్రహం యొక్క బలాబలాన్ని బట్టి ఫలిత తీవ్రత ఉంటుంది. ఆ బలాబలాలు ఆ యా గ్రహాల పాపత్వ శుభత్వాన్నిబట్టి, భావ స్థితిని బట్టి, వీక్షకగ్రహాన్ని బట్టి తీర్మానించాలి. గ్రహానికి గ్రహానికి, గ్రహానికి భావానికి, గ్రహానికి ఫార్చ్యునాకు ఉన్న వీక్షణల్ని పరశీలించాలి. వీక్షించే గ్రహం యొక్క బలాన్ని, గుణాన్ని, సామర్థ్యాన్ని నిర్ణయించుకోవాలి. ఆ వీక్షణ కొంతవరకే ఉన్నదా పూర్తిగా ఉన్నదా చూడాలి. ఆ గ్రహాలు తామున్న భావాన్ని బట్టి, నక్షత్రాన్ని బట్టి, తమతో కలసిన గ్రహాన్ని బట్టి తమ గుణాల్ని, స్వభావాన్ని మార్చుకొంటుందని మనకు తెలుసు. అలాగే వాటి ఉచ్చత్వ నీచత్వాది స్థితులను గమనించాలి. 6,8,12 భావాలు చెడ్డవని వాటి సంబంధాన్ని పొందిన గ్రహాలు శుభఫలితాలనివ్వవని నిర్ణయించుకోవాలి. స్వోచ్ఛ,మిత్ర,మూలత్రికోణ,వర్గోత్తమాలను పొందిన

రాసుల తత్వాల్ని, చర స్థిర ఉభయత్వాల్ని పరిశీలించాలి. వీలైతే షడ్బలాల్ని కూడ చూడ్డం మంచిది.

జాతక చక్రాన్ని పరిశీలించే సమయంలో అగ్రతాంబూలం లగ్నానికి, లగ్నాధిపతికి ఇవ్వాలి. మిగిలిన భావాలతో వాటికున్న సంబంధాన్ని క్షుణ్ణంగా అధ్యయనం చేయాలి. లగ్నాధిపతి బలిష్ఠుడా, మధ్యమ బలుడా, బలహీనుడా, అత్యంత బలహీనుడా అని గుర్తించాలి.

లగ్నాధిపతి 2,3,4,9,10,11 భవాల్లో, 2,10,11 భావాధిపతుల నక్షత్రాల్లో ఉంటే బలిషరుడని చెప్పవచ్చు.

లగ్నాధిపతి 6,8,12 భావాల్లో , 2,10,11 భావాధిపతుల నక్షత్రాల్లో ఉంటే మధ్యమ బలం కలవాడని చెప్పవచ్చు.

లగ్నాధిపతి 2,3,4,9,10,11 భావాల్లో , 6,8,12 భావాధిపతుల నక్షత్రాల్లో ఉంటే బలహీనుడని చెప్పవచ్చు

లగ్నాధిపతి 6,8,12 భావాల్లో , 6,8,12 భావాధిపతుల నక్షత్రాల్లో ఉంటే అత్యం బలహీనుడని చెప్పవచ్చు

## జననకాలసంస్కరణ

ఒక వ్యక్తి తన జీవితకాలంలో ఏ ఏ సమయాల్లో వివిధ అనుభూతుల్ని వివిధ మోతాదుల్లో అనుభవిస్తాడో, వివిధ పరిస్థితుల్ని ఎదుర్కొంటాడో తెలుసుకోవడానికి జాతకచక్రం తోడ్పడుతుంది. ఆ జాతకచక్రాన్ని సరిగా తయారు చేసుకోకుంటే ఆ పని ప్రయోజనశూన్యమవుతుంది. ఖచ్చితమై, దోషరహితమైన జాతకచక్రం తయారీకి సరి అయిన జననకాలం అవసరం. వైద్యులు, నర్సులు తెలిపే జననకాలం జ్యోతిష శాస్త్రరీత్యా నిర్ణయించిన జననసమయం ఒక్కొక్కమారు ఒకటే కావచ్చు. ఒక్కొక్కమారు ఒకటే కాక పోవచ్చు. భిన్నం కావచ్చు. జ్యోతిర్విదుడు జాతకచక్రం తయారుచేసే కాలంలో తప్పక జననకాలసంస్కారం చేసితీరాలి. కృష్ణమూర్తి పద్ధతి ననుసరించి ఫలితాలు చెప్పే జ్యోతిశ్శాస్త్రజ్ఞునికి ఇది తప్పదు. ఎందుకంటే ఇందు కక్ష్య, ఉపకక్ష్యలు ముఖ్య పాత్ర వహిస్తాయి. అవి తారుమారు అయితే ఫలితాలు తప్పవుతాయి.

సంప్రదాయజ్యోతిషంలో అలవాటులో ఉన్న జననకాల సంస్కరణను గురించి ఇచ్చట ప్రస్తావించ దలచుకో లేదు. కె.పి. ఆధారంగా ఫలితనిర్ణయం చేసే జ్యోతిర్విదులలో ప్రముఖులు అనుసరించే సంస్కరణవిధానాన్ని పరిశీలిద్దాము.

కృష్ణమూర్తి పద్ధతిలో ప్రశ్నజాతకం, జన్మజాతకం వీటిపరిశీలనలో ఆధికారికగ్రహాలకున్న పాత్ర మనకందరికి తెలిసినదే. ఈ జననకాల సంస్కరణవిషయంలో కూడ ఆధికారిక గ్రహాలు ప్రముఖ పాత్ర వహిస్తాయి.

మనం ఏ సమయంలో జననకాల సంస్కరణచేయ పూనుకొంటామో ఆ సమయంలో ఆధికారిక గ్రహాల్ని ముందుగా గుర్తించాలి. అవి కొందరి మతంలో 5. మరి కొందరి మతంలో 7. లగ్ననక్షత్రాధిపతి. లగ్నాధిపతి. చంద్రుడున్న నక్షత్రాధిపతి. చంద్రరాశ్యధిపతి. వారాధిపతి. వీరైదుగురు గురువుగారు చెప్పిన ముఖ్యమైన ఆధికారిక గ్రహాలు. తరువాత లగ్న కక్ష్యాధిపతి. చంద్ర కక్ష్యాధిపతి కూడ చోటు చేసుకొన్నారు. పరిశీలనకు తీసుకొన్న వ్యక్తియొక్క(జాతకుని) జననకాలంలోని గ్రహాలతో ఈ ఆధికారికగ్రహాల సంబంధం కానరావాలి. అప్పుడే అది సరియైన జనన సమయం.

కొందరి అభిప్రాయంలో వివిధభావకక్ష్యాధిపతులు సంబంధిత బంధువులజన్మనక్షత్రాలను సూచించాలి. ప్రథమభావ కక్ష్యాధిపతి ఆ వ్యక్తియొక్క జన్మ నక్షత్రాన్ని సూచించాలి. అలాగే 7వ భావ కక్ష్యాధిపతి ఆ వ్యక్తి జీవితభాగస్వామి జన్మ నక్షత్రాన్ని, పంచమభావ కక్ష్యాధిపతి ప్రథమసంతానం యొక్క జన్మ నక్షత్రాన్ని సూచించాలి.

ఉదాహరణకు ప్రథమభావ కక్ష్యాధిపతి రాహువు అనుకొందాము. ఆరుద్ర నక్షత్ర జాతకునకు ఈ రాహువు తన నక్షత్రాలలో దేనిలోనైనా ఉంటే ఆ వ్యక్తి జననకాలం ఖచ్చితమైందని నిశ్చయింపవచ్చు.

వీణావిద్వాంసులు, కీర్తిశేషులు ఐన శ్రీ పప్పు సోమేశ్వరరావు గారి జనన కాలం 5-1-1934. సమయం 2.21.25. స్థలం విజయనగరం. వీరి నక్షత్రం మఖ. వీరి జాతకంలో గ్రహస్థితిని పరిశీలిస్తే ప్రథమ భావ కక్ష్యాధిపతి బుధుడు. అతడు ధనుస్సులో కేతువు

ఆధిపత్యమున్న మూలానక్షత్రంలో ఉన్నాడు. పంచమభావ నక్షత్రాధిపతి గురువు. ప్రథమసంతానం విశాఖ నక్షత్రంలో జన్మించడం జరిగింది. 7వ భావ కక్ష్యాధిపతి శని. రెండవ సంతాన నక్షత్రం పుష్యమి. జీవితభాగస్వామినిది శ్రవణం. ఆ శని శ్రవణ నక్షత్రంలో ఉన్నాడు. ఈవిధంగా ఆయా భావ సంబంధిత బంధువుల నక్షత్రాలతో సరిపోతే జననకాలం సరి అయినదని నిర్ణయించవచ్చు. అయితే వారి నక్షత్రాలు తెలిస్తేనే దీనిని ఆశ్రయింప వీలవుతుంది.

కృష్ణమూర్తి పద్ధతిని అనుసరించే వారిలో కొందరు లింగనిర్ణయం ద్వారా జననకాల సంస్కారం చేస్తారు. అంటే ప్రథమభావకక్ష్యాధిపతి ఉన్న నక్షత్రాధిపతి తెలిపే లింగం ఆవ్యక్తి లింగం ఒకటే అయి ఉండాలి.

శ్రీ అనంత్ టోప్కర్ గారు ఈక్రింది విధంగా జననకాల సంస్కారం చేయవచ్చని తెలిపి యున్నారు. లోకల్ మీన్ టైం తీసుకొని అందులో నిమిషాన్ని మాత్రమే గ్రహించాలి. ఆ విలువను 6తో భాగించాలి. డివిడెండు సరి సంఖ్య అయితే మగ పుట్టుక. బేసి సంఖ్య అయితే స్త్రీ శిశు జననం. ఆ విధంగా లింగ నిర్ధారణ అయిన పిదప లగ్నరాశి,నక్షత్ర,కక్ష్యాధిపతులకు చంద్రరాశి,నక్షత్ర,కక్ష్యాధిపతులతో సంబంధం కలదా అని పరిశీలించాలి. ఆవిధంగా సంబంధం కానవస్తే ఉపకక్ష్యాధిపతి ఉన్న నక్షత్రాధిపతి ఏ రాశిలో ఉన్నాడో పరిశీలించాలి. పుంజననమైతే పుంరాశిలో, స్త్రీ జనన మైతే స్త్రీ రాశిలో ఉండడం జరుగుతుంది. పై తెల్పిన రీతిలో సరిపోని పక్షంలో అందిన సమాచారం లోని జనన సమయాన్ని ముందుకో వెనక్కో జరపాలి.

ఉదాః-ఒక వ్యక్తి మహారాష్ట్రలో జననం. పురుషుడు. ఉదయం గం.07.02ని. ఎల్.ఎం.టి. తెలుసుకోవడానికి ని. 23.40సె. తీసివేయాలి. వచ్చేది 6.38.20. నిమిషాలు 38 ని 6తో భాగిస్తే డివిడెండు 6. భక్తము సరి సంఖ్య. జననం 7వ భాగంలోనికి వచ్చినది. కాబట్టి పుంజననం సరి అయినది.

లగ్న రాశి--నక్షత్ర--కక్ష్య--ఉపకక్ష్యలు చంద్ర రాశి--నక్షత్ర--కక్ష్య--ఉపకక్ష్యలు

శని,చంద్ర, శుక్ర, రాహువులు. చంద్ర,శుక్ర, రాహు, గురువులు.

శుక్రరాహువుల ద్వారా చక్కటి సంబంధం కానవస్తుంది. లగ్న ఉపకక్ష్యాధిపతి రాహువు శుక్ర నక్షత్రంలో ఉన్నాడు. ఆ శుక్రుడు కుంభంలో ఉన్నాడు. అది పుంరాశి. కాబట్టి జననకాలం సరి అయినది.

## సి.కె.వి. రూల్.

శ్రీకదిర్‌వేలుగారు ఈ సూత్రాన్ని ప్రతిపాదించియున్నారు.

కృష్ణమూర్తి పద్ధతిలో సంతానంయొక్క లింగాన్ని నిర్ణయించడానికి కొన్ని సూత్రాలు శ్రీ కె.ఎస్.కె. గారు తమ పుస్తకాలలో తెలిపి యున్నారు. అవి పంచమభావ కక్ష్యాధిపతి పుంరాశిలో ఉంటే పురుషసంతానం. స్త్రీ రాశిలో ఉంటే స్త్రీ సంతానం. మరొక సూత్రం. పంచమభావ కక్ష్యాధిపతి ఉన్న కక్ష్యాపతి ఏ రాశిలో ఉన్నాడో పరిశీలించాలి. అతడున్న

రాశినిబట్టి ఆ శిశువు లింగ నిర్ధారణ చేయాలి. మరొక చోట పంచమ భావ కక్ష్యాధిపతి ఉన్న నక్షత్రాధిపతి ఉన్న రాశిని బట్టి లింగ నిర్ధారణ చేయవచ్చని మూడువిధాలైన సూత్రాలు మనకు కానవస్తాయి. ఈసూత్రాలన్నీ ఒక్కొక్కమారు సరిగా పని చేయకపోవడం మనం గమనిస్తున్నాము.

శిశువే గాక ఇతరబంధువుల లింగనిర్ధారణ చేయడానికి తోడ్పడే రీతిలో శ్రీ కదిర్వేలుగారు రాహుకేతువుల ఆధారంగా కొన్ని సూత్రాలనేర్పరచి యున్నారు.

1. ప్రథమభావ కక్ష్యాధిపతి పుం/స్త్రీ రాసుల్లో ఏ రాశిలో ఉన్నారో గుర్తించాలి. దీనిని మనం 'క' గా పిలుద్దాం.
2. రాహు,కేతు,శనిగ్రహాలు లగ్నంయొక్క రాశి,నక్షత్ర,కక్ష్యా స్థానాల్లో ఎన్ని మార్లు కానవస్తారో చూడాలి. ఆ సంఖ్యను 'గ' గా పిలుద్దాం.
3. లగ్న ఉపకవక్ష్యాధిపతి ఉన్న రాశి,నక్షత్ర,కక్ష్యాపతులుగా రాహు,కేతు,శనులు ఎన్ని మార్లు కానవచ్చారో చూడాలి.
   ఆ సంఖ్యను 'ల'గా పిలుద్దాం.
4. లగ్న ఉపకక్ష్యాధిపతి ఉన్న రాశిలో రాహు,కేతు,శనిగ్రహాలు ఎన్ని మార్లు కానవచ్చారో చూడాలి.
   ఆ సంఖ్యను 'మ'గా పిలుద్దాం.

2,3,4 ఫలితాలను అనగా గ,ల,మ విలువలను కూడాలి. దానిని 'న' గా పిలుద్దాము. ఈ న విలువ సంఖ్య సరి సంఖ్య అయితే 'క' ద్వారా నిర్ణయించిన లింగం ఖచ్చితమైనది. అలా కాని పక్షంలో 'క' తెలిపే లింగం తారుమారు అవుతుంది. అంటే క స్త్రీని సూచిస్తే శిశువు మగశిశువు. క మగను సూచిస్తే స్త్రీ శిశువు. ఇలా ద్వితీయ, తృతీయాది సంతానాల లింగనిర్ణయం చేయవచ్చు. ఇతర బంధువుల లింగనిర్ణయం కూడ దీని వల్ల సాధ్యమవుతుంది. అలా సరి పోని పక్షంలో సమయాన్ని ముందుకు వెనక్కు జరిపి జనన కాలాన్ని ఖచ్చితంగా నిర్ధారింప వచ్చని వీరి అభిప్రాయం.

డా.ఏంద్రూదత్(ఇంద్రజిత్)గారు 'రూల్ ఆఫ్ ఆరిజిన్' పేరిట మరొక విధానాన్ని రూపొందించియున్నారు. ఈ విధానం కృష్ణమూర్తిపద్ధతిలో తయారుచేసిన జాతకం మీద ఆధారపడి మాత్రమే చేయవలసి వస్తుంది. ముఖ్యసారాంశం బీజక్షేత్రాలపై ఆధారపడి ఉంటుంది. పూర్వపుణ్యసూచకమైన 9వభావాన్ని స్వీకరించాలి. అది తండ్రిని సూచించే భావం. తండ్రి బీజదాత. తల్లిక్షేత్రమవుతుంది. జీవమనేది బీజదాత అయిన తండ్రి నుండి వస్తుంది. అందుచే లగ్నభావస్ఫుటస్థిత రాశి,నక్షత్ర,కక్ష్య,ఉపకక్ష్యాధిపతులకు, 9వభావస్ఫుటస్థిత రాశి, నక్షత్ర,కక్ష్య,ఉపకక్ష్యాధిపతులతో సంబంధం ఉంటే ఆ జాతకుని జననసమయం సరియైనదిగా నిర్ణయించవచ్చు.

ఈ క్రింది సూత్రాల ఆధారంగా సరియైన జనన సమయాన్ని నిర్ధారించవచ్చు.

1. లగ్న నక్షత్రాధిపతి ప్రత్యక్షంగా 9వ భావ సంబంధం పొందిఉండడం.

2 లగ్న కక్ష్యాధిపతి ప్రత్యక్షంగా 9వ భావ సంబంధం పొంది ఉండడం.

3. లగ్న నక్షత్రాధిపతి లేదా లగ్న కక్ష్యాధిపతి పరోక్షంగా 9వ భావ సంబంధం పొందడం.

పై మూటిలో ఏ ఒక్కటి కానవచ్చినా ఆ జాతకం సరియైన సమయానికి గణింపబడినదని చెప్పవచ్చు.

అంటే లగ్నభావం యొక్క నక్షత్రాధిపతిగాని, కక్ష్యాధిపతిగాని 9వ భావంయొక్క కక్ష్యాధిపతి, నక్షత్రాధిపతులతో ప్రత్యక్షంగా కాని పరోక్షంగా (మరొక గ్రహం ద్వారా) కాని సంబంధం కలిగి ఉంటే జాతకగణనం ఖచ్చితమైందని లేకుంటే సరియైనది కాదని తెల్పవచ్చు. సరియైన సమయానికి సర్దవచ్చు.

ఉదాహరణకు ఐశ్వర్యా రాయ్ బచన్ గారి జాతకాన్ని తీసుకొన్నారు. జననం 01.11.1973. 4.05 ఎ.ఎం. 12ఉ46 75తూ52. భావస్థితి గ్రహస్థితి క్రింద పొందు పరచబడినది.

| భావ | నక్షత్ర | రా | న | క | ఉ | ఉక | గ్ర | నక్ష | రా | న | క | ఉ | ఉ | క |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | హస్త1 | బు | చం | చం | రా | శు | రవి | స్వాతి | 3 | శు | రా | కే | గు | చం |
| 2 | స్వాతి2 | శు | రా | శని | శని | శు | చం | పూ.ఢ | 2 | గు | శు | రా | శు | బు |
| 3 | అనూ3 | కు | శని | రవి | గు | రా | కు(వ) | అశ్వని | 2 | కు | కే | రా | గు | కే |
| 4 | మూల3 | గు | కే | శని | కే | శు | బుధ | విశాఖ4 | కు | గు | రా | ర | శు | |
| 5 | ఉ.షా4 | శని | ర | శు | శని | గు | గురు | శ్రవణ1 | శని | చం | చం | బు | బు | |
| 6 | శతభి1 | శని | రా | గు | చం | చం | శుక్ర | మూల1 | గు | కే | శు | రా | రా | |
| 7 | ఉ.ద్ర3 | గు | శని | శు | కే | రా | శని(వ) | ఆర్ద్ర2 | బు | రా | శని | కే | గు | |
| 8 | అశ్వని | కు | కే | శని | చం | రా | రాహు | మూల3 | గు | కే | గు | గు | కు | |
| 9 | రోహి1 | శు | చం | చం | శని | గు | కేతు | ఆరుద్ర1 | బు | రా | రా | బు | గు | |
| 10 | ఆరు1 | బు | రా | గు | చం | శని | | | | | | | | |
| 11 | పుష్య2 | చం | శని | శు | గు | రా | | | | | | | | |
| 12 | మఖ3 | ర | కే | శని | బు | శని | | | | | | | | |

ఇచ్చట లగ్నభావ నక్షత్ర,కక్ష్యాధిపతులు ఇద్దరు చంద్రుడే. 9వభావస్ఫుటాన్ని పరిశీలించండి. అచ్చట కూడ నక్షత్ర కక్ష్యాధిపతులిద్దరూ చంద్రుడే. అందుచే ఈ జాతక గణనం సరియైన సమయానికే చేయబడినదని నిర్ణయించవచ్చు. ప్రథమ భావ ఉపకక్ష్యాధిపతి రాహువు. అతడు గురువు ద్వారా నక్షత్రకక్ష్యల్లో చంద్రసంబంధాన్ని పొంది ఉన్నాడనే విషయాన్ని గూడ మనం గమనించవచ్చు.

రఘునాథరావు నేమానిగారు ఆధికారిక గ్రహాల ఆధారంగా జననకాలసంస్కరణను ఈ

క్రింది విధంగా వివరించియున్నారు. వారు మూడు దశలలో పరిశీలించాలని తెలిపి యున్నారు.
ప్రథమదశః- రాశ్యధిపతిని బట్టి. ఆధికారిక గ్రహాల్లో చంద్రుడున్న రాశ్యధిపతి , పరిశీలనకు తీసుకొన్న జాతకం లోని లగ్న రాశ్యధిపతి ఒకరేనా? అని పరిశీలించాలి. అలా కాని సందర్భంలో వారిద్దరి మధ్య వేరే విధంగా సంబంధం కలదా అని పరిశీలించాలి. వేరే విధంగా అంటే చంద్రరాశ్యధిపతి ఉన్న నక్షత్రాధిపతిగాని కక్ష్యాధిపతిగాని జాతకంలోని లగ్నరాశ్యధిపతి సంబంధిత గ్రహాల్లో ఒకరు కావడం.
ద్వితీయదశః-నక్షత్రాధిపతిని బట్టి. ఆధికారిక గ్రహాల్లో చంద్రుడున్న నక్షత్రాధిపతి పరిశీలనకు తీసుకొన్న జాతకం లోని లగ్న నక్షత్రాధిపతి ఒకరేనా అని పరిశీలించాలి. అలా కాని సందర్భంలో వారిద్దరి మధ్య వేరేవిధంగా సంబంధం కలదా అని పరిశీలించాలి. వేరే విధంగా అంటే చంద్రనక్షత్రాధిపతి ఉన్న రాశ్యధిపతి తానున్న రాశి,నక్షత్ర,కక్ష్యల ద్వారా లగ్న నక్షత్రాధిపతి సంబంధాన్ని పొందడం.
తృతీయదశః-కక్ష్యాధిపతిని బట్టి. ఆధికారిక గ్రహాల్లో చంద్రుడున్న కక్ష్యాధిపతి, పరిశీలనకు తీసుకొన్న జాతకం లోని లగ్న కక్ష్యాధిపతి ఒకరేనా అని పరిశీలించాలి. అలా కాని సందర్భంలో వారిద్దరి మధ్య వేరేవిధంగా సంబంధం కలదా అని పరిశీలించాలి. వేరే విధంగా అంటే చంద్రుడున్న కక్ష్యాధిపతి తానున్న రాశి,నక్షత్ర,కక్ష్యల ద్వారా లగ్న కక్ష్యాధిపతి సంబంధాన్ని పొందడం.
తమ పరిశోధనాపత్రంలో 6 జాతకాలను పై చెప్పిన మూడు దశలలో ఉదాహరణగా వివరించి చూపియున్నారు.

మొత్తం మీద జననకాలసంస్కరణకు పూనుకొన్న సమయంలోని ఆధికారికగ్రహాలు, ఆ వ్యక్తియొక్క జన్మసమయంలోని ఆధికారికగ్రహాలు ఒకటవాలి. అలా కాని పక్షంలో ఆ గ్రహాలున్న నక్షత్ర,కక్ష్యా స్థానాల్లోనైనా కాన రావాలి. అంటే పరిశీలనకు తీసుకొన్న సమయంలో లగ్నరాశినక్షత్రకక్ష్యాధిపతులు, చంద్రరాశినక్షత్రకక్ష్యా ధిపతులు జాతకచక్రంలోని లగ్నరాశినక్షత్రకక్ష్యాధిపతులతో, చంద్రరాశినక్షత్రకక్ష్యాధిపతులతో సంబంధితం కావాలి. అలా లేని పక్షంలో లగ్నాన్ని కొద్దికొద్దిగా వెనక్కో ముందుకో జరుపుకొంటూ పోవాలి.

జననం జరిగింది ఉదయమా సాయంత్రమా అనే ప్రశ్న ఉదయించినపుడు పరిశీలనా సమయంలోని ఆధికారిక గ్రహాలద్వారా చంద్రుని స్థితిని నిర్ణయించాలి. ఆ పై లగ్నస్ఫుటనిర్ణయం చేయాలి.
పుట్టిన తేదీకూడ తెలియని సమయంలో ఏ ఏ తేదుల్లో ఆధికారికగ్రహాలకు చంద్రసంబంధం ఉంటుందో గమనించాలి. ఆధికారికగ్రహాల్లో ఏ గ్రహం ఆధిపత్యమున్న

నక్షత్రంతో ఏ తేదీ సంబంధితమవుతుందో ఆ తేదీని నిర్ణయించాలి.
నెల, సంవత్సరం తెలుసుకోవలసి వచ్చినపుడు రవి, గురువు ఉన్న స్థితి ఆధారంగా ఆధికారిక గ్రహాల సంబంధాన్ని పురస్కరించుకొని నిర్ణయించవచ్చు.
కొందరి మతంలో ఆధికారిక గ్రహాలు రెండుగా వర్గీకరింప బడతాయి. ఒకటి లగ్న స్ఫుటం. రెండు చంద్రస్ఫుటం.
లగ్నస్ఫుటంలోని రాశినక్షత్రకక్ష్యాధిపతుల ద్వారా గ్రహాలున్న స్థితిని, చంద్రస్ఫుటంలోని రాశి నక్షత్రకక్ష్యాధిపతుల ద్వారా భావస్ఫుటాల్ని సరిదిద్దవచ్చు.
జననసమయంలోని తేడా నిమిషాల్లో ఉన్నప్పుడు చంద్రస్ఫుటసహాధికారికగ్రహాల ఆధారంగా లగ్నస్ఫుటాన్ని సరిజేస్తూ ఖచ్చితమైన సమయాన్ని నిర్ణయించవచ్చు. ఈ సమయంలో రాశిని నక్షత్రాన్ని సరిజేయవలసిన అవసరం లేదు.
సందేహంలో ఉన్న సమయం దీర్ఘకాలికమైతే నక్షత్రాన్ని కూడ నిర్ణయించాలి. ఎందుకంటే ఈ మధ్య సమయంలో నక్షత్రం మారవచ్చు. లగ్నం తప్పక మారుతుంది. అందుకని లగ్నరాశిని కూడ పరిశీలించాలి.
సమయం తేదీ రెండూ సందేహంగా ఉంటే మొదటగా చంద్రుని ఆధికారికగ్రహాల ఆధారంగా తేదీని నిర్ణయించాలి.
లగ్న సహాధికారిక గ్రహాల ఆధారంగా చంద్రుని స్థితిని సుమారు లగ్నాన్ని కనుగొనాలి. చంద్ర నక్షత్రాన్ని కనుగొన్న తర్వాత లగ్న సహాధికారిక గ్రహాల ఆధారంగా కక్ష్య,ఉపకక్ష్యల్ని నిర్ణయించాలి. ఆపై చంద్రసహాధికారిక గ్రహాల ఆధారంగా లగ్నస్ఫుటాన్ని కనుగొనాలి.
నెలను తెలుసుకోవడానికి పరిశీలనాకాలంలోని లగ్నసహాధికారికగ్రహాలు సందేహాస్పదమైన ఏ నెలల్లోని సూర్యస్ఫుటసహాధికారిక గ్రహాలతో సరిపోతాయో ఆ నెలను స్వీకరించాలి.
నా అభిప్రాయంలో లగ్న,చంద్రస్ఫుట ఆధికారిక గ్రహాలద్వారా నిర్ణయించిన సమయమే సరియైనదని తృప్తి పడరాదు. బంధువుల లింగనిర్ణయం, జాతకుని చదువు, వృత్తి,వివాహం ఇత్యాది విషయాలు సంబంధిత భావాలతో, వాటి కక్ష్యోపకక్ష్యాదులతో సరిపోయినవా? లేదా? అని పరిశీలించి ఆ తర్వాత నిశ్చయింపబడిన సమయం మాత్రమే ఖచ్చితమైందని నిర్ణయించాలి.
ముందుగా కక్ష్యాపరిధిలోనే పరిశీలించి నిర్ణయం చేయడం మంచిది. అలా కాని సమయంలోనే ఉపకక్ష్యపై ఆధారపడాలి. ఆదిలోనే ఉపకక్ష్యకు పోవడం మంచిది కాదని నా ఆభిప్రాయం. కక్ష్యాధారంగానే సరియైన నిర్ణయం జరిగే పక్షంలో ఉపకక్ష్యను స్వీకరిస్తే దారితప్పవచ్చు.
ఈ విధానం ఆధారంగానే గడచిన పాతికేళ్ళుగా జాతకపరిశీలన చేస్తూ, ఖచ్చితమైన ఫలితాల్ని విశదీకరిస్తూ, మహాగణపతిజ్యోతిర్విద్యాపరిశోధనాసంస్థ ప్రసిద్ధికెక్కినది.
మా మిత్రులు శ్రీ ఎం.ఆర్. ప్రసాద్‌గారు ఒక జాతకుని జననకాల సమయాన్ని నిర్ణయించిన తీరును పరిశీలిద్దాము.

ఆర్. మధుసుధన్ రావు అనే వ్యక్తి సరియైన తన జనన సమయాన్ని తెలుసుకోగోరినారు. 16.09.1960 నెల్లూరు జనన కాలం 2.00 ఎ.యం నుండి 7.00 ఎ.యం లోగా ఉండవచ్చని తెలిపినారు. ఈ 2.00 నుండి 7.00 వరకు అనగా 5.గంటల కాలంలో కర్క,సింహ,కన్య లగ్నాలకు అవకాశం కలదు. ఈ విషయ నిర్ధారణకు ఆధికారిక గ్రహాల అవసరం ఏర్పడుతుంది. తే. 25.02.2008 దిన సాయంత్రం 6.38.25 సమయాన పరిశీలన ప్రారంభమయింది. లగ్నం సింహం. నక్షత్రం చిత్త. లగ్నాధిపతి రవి. లగ్న నక్షత్రాధిపతి శుక్రుడు. లగ్న కక్ష్యా
ధిపతి రాహువు. రాశి తుల. దాని అధిపతి శుక్రుడు. నక్షత్రాధిపతి కుజుడు. రాశి కక్ష్యాధిపతి శుక్రుడు. వారాధిపతి చంద్రుడు.

ఈ విధంగా అప్పటి ఆధికారిక గ్రహాలు రాహు, శుక్ర, రవి, కుజ, చంద్రులు. రవి శని కేతువులను చూస్తూ ఉండడం వలన వారు కూడ ఆదికారిక గ్రహాలు అవుతారు. కుజుడు గురువును చూడడం, శుక్రుడు బుధునితో కలవడం వలన వారిద్దరు కూడ చోటు చేసుకొంటారు. ఈ విధంగా రవి చంద్ర కుజ బుధ గురు శుక్ర రాహు కేతువులు ఆధికారిక గ్రహాలు అయినారు. అందుచే వీరిలో బలిష్టులైనవారిని ఎన్నుకోవాలి.

చంద్రుడు దినాధిపతి అయినందున బలహీనుడు. బుధుడు అనుషంగికంగానే ఆధికారిక గ్రహం అయినాడు. చంద్రాధిపత్యమున్న కర్కాటక రాశి, బుధాధిపత్యమున్న కన్య రాశి లగ్నాలు కాజాలవు. సింహ లగ్నమే సరి అయినదని నిశ్చయింపవచ్చు.

పరిశీలనకు తీసుకొనిన సమయం కూడా సింహలగ్నమే. రవి కుంభంలో ఉండి లగ్నాన్ని చూస్తున్నాడు. కక్ష్యాధిపతి అయిన రాహువు కుంభంలో లగ్నాధిపతితో కలసి లగ్నాన్ని చూస్తున్నాడు. రవి స్థితిని చూస్తాము. శని రాశిలో, రాహు నక్షత్రంలో, శని కక్ష్యలో రవి ఉన్నాడు. శని సింహంలో ఉండి లగ్నాధిపతిని చూస్తున్నాడు. ఇక్కడ ఫార్చ్యూనాను పరిశీలిస్తాము. అది మేషరాశిలో పడినది. దాని రాశి నక్షత్ర కక్ష్యలు కుజ కేతు శనులు. శని కేతువులు సింహ రాశితో సంబంధితులై ఉన్నారు. కేతువు స్థితిని చూస్తాము. అతడు రవి రాశి కేతువు నక్షత్రం రవి కక్ష్యలో ఉన్నాడు. పై విషయాలను పురస్కరించుకొని ఈ వ్యక్తి జన్మ లగ్నం ఖచ్చితంగా సింహమే అయి ఉండాలని నిశ్చయించినాము.

ఇక లగ్న నక్షత్రాధిపతిని కనుగొందాము. ఆధికారిక గ్రహాల్లో శుక్రుడు లగ్న నక్షత్రాధిపతి అయినాడు. అలాగే చంద్ర రాశి అధిపతి, చంద్ర కక్ష్యాధిపతియై మూడు మార్లు కానవచ్చినాడు. ఆ కారణంగా జనన కాలంలో కూడా లగ్న నక్షత్రాధిపతి శుక్రుడే (పుబ్బ). ఇక కక్ష్యాధిపతి ఎవరో చూస్తాము. కుజ బుధ రాహువుల్లో ఒకరికే ఈ అవకాశం కలదు. రవితో రాహువు, శుక్రునితో బుధుడు కలసి ఉన్నారు. బుధుని కక్ష్యాధిపతిగా రాహువును ఉప కక్ష్యాధిపతిగా కుజుని ఉపోపకక్ష్యాధిపతిగా స్వీకరించాము. రవి-శుక్ర-బుధ-రాహు-కుజ.

వీరి జనన కాలాన్ని 16.09.1960 5.43.26 ఎ.యమ్. నెల్లూరు గా నిర్ణయించడంమైనది. మనం నిర్ణయించిన సమయంలోనే లగ్న భావంలో రవి బుధ శుక్రులు ఉన్నారు. ఉపకక్ష్యాధిపతి రాహువు రవి రాశిలో శుక్ర నక్షత్రంలో రాహు కక్ష్యలో ఉన్నాడు. రాహువు రవికి ప్రతినిధి. నక్షత్రాధిపతి శని లగ్న నక్షత్రాధిపతి అయిన శుక్రుని చూస్తున్నాడు. ఇలాగే కక్ష్యోపకక్ష్యల సంబంధం కూడా ఆధికారిక గ్రహాలకు మరియు జననకాల గ్రహాలకు కానవస్తుంది. ముఖ్యమైన జీవిత సంఘటనలను పరిశీలిస్తాము.

వివాహం జరిగిన రోజునకు ఈ జాతకంలోని 2,7,11 భావాలకు సంబంధం ఉంటే జాతకం ఖచ్చితమైనది అని చెప్పవచ్చు. ఈ జాతకునకు 15.02.1984 న వివాహం జరిగింది. అప్పుడు దశలు బుధ-శుక్ర-రాహు-శుక్ర సూక్ష్మ దశలు. ఈ జాతకంలో 2,7,11 భావాల కారకుడు బుధ,శుక్ర,చంద్ర, శని. రవి,గురు,కుజులు, వీరి సంబంధంతో రాహు కేతు శనులకు కూడా కారకత్వం ఏర్పడింది. అందుచే మరల 09.03.2008 న సాయంత్రం 4.21.55 సమయానికి ఆధికారిక గ్రహాలను తయారు చేయడం జరిగింది. లగ్న రాశి నక్షత్ర కక్ష్యాధిపతులు చంద్ర బుధ శనులు. చంద్రరాశి నక్షత్ర కక్ష్యాధిపతులు గురు బుధ బుధులు వారాధిపతి రవి. ఈ విధంగా అప్పటి ఆధికారిక గ్రహాలు చంద్ర బుధ శని గురు రవి అవుతారు. వీరిలో శని వక్రి. అందుచే పనికి రాడు. శుక్ర రాహువులుబుధునితో కలసి ఉండడం వల్ల వారు కూడ అధికారులే. బుధుడు 7 వ భావ కక్ష్యాధిపతి అయి ఉన్నాడు. వివాహం జరిగిన సమయంలో బుధ దశ శుక్ర భుక్తి రాహు అంతరం శుక్ర సూక్ష్మం జరుగుతున్నది.

ఇక సంతాన విషయం పరిశీలిస్తాము. 14.11.1987 న ప్రథమ సంతాన జననం జరిగింది. 2,5,11 భావాల పరిశీలన ద్వారా దీనిని గుర్తించవచ్చు. 9 ఆధికారిక గ్రహాలలో చంద్ర బుధ గురు రవి శుక్ర రాహు కుజులు తప్ప మిగిలిన వారు తొలగింపబడినారు. ప్రథమ శిశువు జనన కాలమపుప్పుడు బుధ దశ చంద్ర భుక్తి రవి అంతరం చంద్ర సూక్ష్మం నడుస్తుంది. దశాధిపతి బుధుడు 11 వ భావ కక్ష్యాధిపతి. భుక్తి అధిపతి సూక్ష్మ దశాధిపతి చంద్రుడు గురు రాశిలో ఉన్నాడు. అంతర్ దశాధిపతి రవి గురువు నక్షత్రం లోఉన్నాడు. ఈ విధంగా సంతాన ప్రశ్న మూలకంగా కూడా మనం నిర్ణయించిన సమయమే సరియైనది.

సాయనము-నిరయణము

సూర్యుడు ఆకాశంలో సంచరిస్తున్నట్లుగా కానవస్తాడు. భూమధ్యరేఖకు ఉత్తరాన ఆరు నెలలు, దక్షిణాన ఆరు నెలలు సూర్యుడు సంచరించడం మనం చూస్తుంటాము. దక్షిణం నుండి ఉత్తరానికి జరుగుతూపోయే సమయంలో భూమధ్యరేఖను స్పృశించే సమయాన్ని ఉత్తరవిషువంగా పిలవడం జరుగుతుంది. ఉత్తరవిషువత్తు బిందువును ప్రారంభబిందువుగా నిశ్చయించి రాశిచక్రాన్ని 12 భాగాలు చేస్తారు. దానిని సాయన

రాశిచక్రం అంటారు.  పై చెప్పిన ఊహాబిందువు స్థిరంగా ఉండదు.
అశ్విని నుండి రేవతి వరకున్న నక్షత్రాల ఆధారంగా ఏర్పడడిన రాశి చక్రాన్ని నిరయణ చక్రం అని వ్యవహరిస్తారు.
సాయన చక్రానికి, నిరయణ చక్రానికి గల భేదం అయనాంశమే. వైదిక జ్యోతిషంలో నిరయణవిధానానికే పెద్ద పీట. సాయన విధానాన్ని పాశ్చాత్యులు అనుసరిస్తారు. అయనాంశ కలిసినది సాయనం. అయనాంశ లేనిది నిరయణం. భూ కక్ష్య సూర్యుని తలానికి 231/2°,చంద్ర కక్ష్య భూ కక్ష్యకు 5 డిగ్రీలు వాలి ఉండి, పరస్పరాకర్షణ మూలంగా ఏర్పడే విషుచలన ఆధారంగా అయనగతిలో మార్పు వస్తుంది. ఈ అయనబిందువు ఒక సంవత్సరానికి  సుమారు 50.23 సెకనులు కదులుతుంది. కొన్ని సంవత్సరాల  తరువాత సాయన, నిరయణ ప్రారంభ బిందువు ఒకే చోట లీనమవుతాయి. అంటే సాయన, నిరయణ రాశిచక్రాలు ఒకే బిందువులో ప్రారంభమవుతాయి.

సాయన చక్రానికి చరరాశి చక్రమని, నిరయణ చక్రానికి స్థిరరాశిచక్రమని పేరు. ఈ రెండు ఏకీభవించినకాలాన్ని వివిధ ఖగోళ, జ్యోతిశ్శాస్త్రజ్ఞులు వేర్వేరుగా నిర్ణయించినారు. ఈ కాలాన్ని అయనాంశశూన్యసంవత్సరమని పిలుస్తారు. ఈ శూన్యసంవత్సరాన్ని నిర్దేశించడంలో జ్యోతిర్విదుల నడుమ భిన్నతలున్నాయి.
లాహిరి మతం ప్రకారం క్రీ.శ. 285, కృష్ణమూర్తి మతం క్రీ. శ. 291, బి.వి. రామన్ మతం క్రీ.శ. 397. ఈ విభిన్నతల మూలంగా అయనగతులలో భేదాలేర్పడినాయి. దీని వల్ల నిరయణ ఎఫిమరీస్‌లో కూడ భేదావకాశాలున్నాయి. అయన గతులలో లహరి కన్న కృష్ణమూర్తి అయనాంశలో 6 నిమిషాలు తక్కువ కాగా  బివి. రామన్ అయనాంశలో 1 డిగ్రీ 27 నిమిషాలు తక్కువ.

అయనాంశం

సాయన నిరయణాంశాలు సమానమయ్యే లేదా సున్న అయనాంశ కానవచ్చే సంవత్సరం క్రీ.శ.291 గా నిశ్చయించి, ప్రతి సంవత్సరానికి న్యూకోంబ్ విధానాన్ననుసరించి 50.2388575 సెకనులు ముందుకు జరిగే విధానాధారంగా, కృష్ణమూర్తిపద్ధతి ప్రదాత శ్రీ కె.ఎస్.కె. గారు తమ కె.పి. మొదటి రీడరులో 1840-2001 వరకు ప్రతి సంవత్సరారంభంలో అయనాంశవిలువల్ని ప్రచురించియున్నారు.
1961-70 ఎపిమరీస్‌లో శ్రీమహాబలగారు 1900-2040 వరకు ఈ అయనాంశవివలువలను వెలువరించియున్నారు. దీనిని మనం ప్రాచీన కె.పి. అయనాంశ అని పిలువ వచ్చు.
కృష్ణమూర్తి పద్ధతిలో మరొక అయనాంశ ఉన్నది.  దీనికి కె.పి. స్ట్రైట్ లైన్ అయనాంశ అని పేరు.  దీనికి అంత ఆదరణ లభించలేదు.

కొత్త కె.పి. అయనాంశ 2003 నుండి అమలులోనికి వచ్చినది. ఈ విధానంలో 23 మార్చి 291లో '0' అయనాంశగా తీసుకోవడం జరిగింది. ప్రొ.బాలచంద్రన్‌గారు దీనిని సరి అయినదిగా నిర్ణయించినారు. కె.ఎస్.కె. గారి కుమారుడు శ్రీ కె.సుబ్రహ్మణ్యంగారు కూడ పాతవాటిని వదలి న్యూ కెపి అయనాంశనే వాడవచ్చని తెలిపినారు. పాత అయనాంశకు కొత్త అయనాంశకు సెకనులలో మాత్రమే తేడా.

| సంవత్సరం | కె.పి.ప్రాచీనం | కె.పి.నూతనం |
|---|---|---|
| 1800 | 20-58 | 20-58-33 |
| 1850 | 21-40 | 21-40-24 |
| 1900 | 22-22 | 22-22-16 |
| 1950 | 23-04 | 23-04-08 |
| 2000 | 23-46 | 23-46-01 |
| 2050 | 24-28 | 24-27-54 |
| 2100 | 25-10 | 25-09-48 |

ఫలితనిర్ణయంలో కె.పి. అయనాంశకు ఏదీ సాటిరాదు. పలువురు కె.పి.ప్రాచీన అయనాంశ మీద ఆధార పడగా శ్రీ కనకబోస్మియా, శ్రీ రంగరాజన్ కృష్ణమూర్తి మొదలైనవారు న్యూ కె.పి. అయనాంశకే ప్రాధాన్యత నిస్తున్నారు.

ఎస్.పి. కుల్లర్‌గారు లీనియర్ కె.పి. అయనాంశను ప్రవేశపెట్టి వాడుతున్నారు. వారి అయనాంశకు లాహిరి అయనాంశకు చాల తక్కువ భేదం. వారు సబ్ సబ్ (ఉపకక్ష్యకు) కు ఎక్కువ ప్రాధాన్యత నిస్తారు.

| | |
|---|---|
| కె.పి. పాతది | **23:50:47** |
| కె.పి. కొత్తది | **23:51:02** |
| కుల్లర్ గారి లీనియర్ | **23:55:45** |
| లాహిరి | **23:56:27** **(2006** వ సంవత్సరం జనవరి) |

ి ఎఫిమరీస్ అధారంగా జాతకం తయారు చేయడం.

ఒక వ్యక్తి 2007 అక్టోబరు 16వ తేది ఉదయం 11.30 గం లకు జన్మించాడనుకొందాము. 17వ తేదినాటి గ్రహస్థితిని పైన 16వ తేది గ్రహస్థితిని క్రింద వ్రాసి తీసివేయాలి. ఒకవేళ గ్రహం వక్రమైతే తిరగత్రిప్పి వేయాలి. రాహువు ఎప్పుడూ అప్రదక్షిణంగా సంచరిస్తుంది. తిరగత్రిప్పి వేయాలి. తీసివేయగా వచ్చేది ఆయా గ్రహాలు ఒకరోజుకు జరిగే దూరం. ఎఫిమరీస్‌లో ఇచ్చే వివరం ఉదయం 5.30 గం.లకు. జనన సమయానికి

ఈ సమయానికి భేదం గుర్తించాలి.

24 గంల సమయానికి కొంతదూరం జరిగితే ఈ భేద సమయానికి ఆ గ్రహం ఎంతదూరం జరుగగలదో లెక్కగట్టాలి. అప్పుడే ఆ సమయానికి ఆ గ్రహం యొక్క రాశి స్థితి మనకు తెలుస్తుంది.

| | రవి | చంద్ర | కుజ | బుధ(వ) | గురు | శుక్ర | శని | రాహు |
|---|---|---|---|---|---|---|---|---|
| 17 | 179.23 | 242.30 | 73.20 | ((16)194.18 | 232.58 | 133.28 | 131.17 | 321.33 |
| 16 | 178.24 | 230.30 | 72.59 | 193.44 | 232.47 | 132.34 | 131.11 | 321.32 |
| | 0.59 | 12.00 | 0.21 | 0.34 | 0.11 | 0.54 | 0.06 | 0.01 |

24 గంటలకాలానికి ప్రతి గ్రహం ఇంతింతదూరం జరిగితే ఉదయం 5.30 కి, జననసమయానికి ఉన్న భేదకాలానికి ఎంతదూరం జరిగేది 'అస్ట్రాలాజికల్ టేబ్ల్స్ ఫార్ ఆల్' అనే పుస్తకంలోని నిదానంగా చరించే
మరియు చంద్రుని రోజువారీ గమన వివరాలను తెలిపే సారిణి ఆధారంగా కనుగొనవచ్చు.

| | |
|---|---|
| రవి ఆ భేదకాలానికి అనగా 6గంటల సమయానికి | ని.14.45 |
| చంద్రుడు | డి 3.00.00 |
| కుజుడు | ని.05.25 |
| బుధుడు | ని.08.5 |
| గురువు | ని.02.15 |
| శుక్రుడు | ని.13.5 |
| శని | ని.01.5 |
| రాహు | సె.00.25 |

జరుగుతారు. 16వ తేదీన ఉన్న స్థితికి కలపాలి. వక్రగ్రహ విషయంలో తీసివేయాలి. ఈ విలువల్ని 16వ తేది నాటి విలువలకు కలపాలి.

| 16 | 178.24 | 230.30 | 72.59 | (వ)193.44 | 232.47 | 132.34 | 131.11 | 321.32 |
|---|---|---|---|---|---|---|---|---|
| | 14.45 | 3.00 | 5.25 | 8.5 | 2.45 | 13.5 | 1.5 | .25 |
| | 178.38.15 | 233.30 | 73.04.25 | 193.35.5 | 232.49.15 | 132.47.5 | 131.12.5 | 321.31.35 |

(వక్రి గ్రహాలకు తీసివేత)

ఎఫిమెరీస్ ఆధారంగా లగ్నం కట్టడం

పుట్టిన సమయానికి ఐ.ఎస్.టి. స్వీకరించాలి. ఆ తర్వాత ఎల్.ఎమ్.టి. కనుగొనాలి. విభిన్న స్థలాలకు ప్రత్యేకంగా నిర్ణయించిన రీతిలో సమయాన్ని ఐ.ఎస్.టి నుండి కూడడమో, తీసివేయడమో చేయాలి.

1. ఆ వచ్చిన విలువకు ఆ నాటి ఉదయం 5.30 నిమిషాలకు ఉన్న భేదాన్ని గుర్తించాలి.
2. ఆ భేదాన్ని ఎఫిమెరీస్‌లోని ఆ నాటి సైడెరియల్ టైమ్ నకు కూడాలి. దానిని క్రొత్త సైడెరియల్ టైమ్ అని పిలవాలి.
3. రాఫిల్ టేబుల్ ఆఫ్ హౌసెస్ లో మనకు కావలసిన స్థలానికి నిర్ణయించిన అక్షాంశ గల పేజీలో ఈ క్రొత్త సైడెరియల్ టైమ్ ఎక్కడ ఉందో గుర్తించాలి. దానికి నేరుగా అసెండెంటు కాలంలో ఏ డిగ్రీ, ఏ నిమిషం కలదో వ్రాసుకోవాలి.
4. ఆ నాటికి సరిపోయే అయనాంశాన్ని తయారు చేసుకొని ఇంతకు ముందు వ్రాసి ఉంచుకొన్న అసెండెంటు డిగ్రీ,నిమిషాలనుండి తీసివేయాలి.(నిరయణం చేయడానికి). కొన్ని సందర్భాలలో లగ్న డిగ్రీ కన్న అయనాంశ విలువ ఎక్కువగా ఉండవచ్చు. అప్పుడు వెనుకరాశి అప్పుగా తెచ్చుకోవాలి. (30 డిగ్రీలు.)
5. రాఫిల్ టేబుల్ ఆఫ్ హౌసెస్ లో ఆ అసెండెంటు విలువకు రెండు వైపులా 10,11,12మరియు 1,2 భావాల స్ఫుటాలు కూడ ఉంటాయి. ఆ విలువల నుండి అయనాంశ తీసివేసి ఆ భావాల నిరయణ స్థితిని కూడ తయారు చేసుకొనవచ్చు.
6. ఈ విధంగా ఆరు భావ స్ఫుటాలు తయారవుతాయి. ప్రతి భావానికి 180 డిగ్రీలు కలుపుకోగా మిగిలిన ఆరు భావాల స్ఫుటాలు తయారవుతాయి.

పై సమయానికి లగ్నం, ఇతరభావాలను నిర్ణయిస్తాము.

జనన కాలం ఉదయం 11.30. ఎల్.ఎం.టి. కనుగొనడానికి నెల్లూరు పట్టణానికి సుమారు 10 నిమిషాలు తీసివేయాలి. 11.30 లో 10 ని. తీసివేయగా 11.20 అవుతుంది. 5.30 కు దీనికి భేదం 11.20-5.30 గం.5.50ని.

దీనిని సైడెరియల్ సమయానికి కూడాలి. ఎఫిమెరీస్‌లో ఆనాడు 7.06.22. కలుపగా 12.56.22. ఇది క్రొత్త సైడెరియల్ టైం అవుతుంది. రాఫిల్ టేబల్ ఆఫ్ హౌసెస్ లో 14వ అక్షాంశ ఉన్న పేజీలో 12.58.57 కు నేరుగా చూస్తే 16,16,12,7.54,9,13 కానవస్తుంది. 7.54 లగ్నం మకరం. 16 10వ భావం తుల. 16 11వ భావం వృశ్చికం. 12 12వ భావం ధనుస్సు. 9 2వభావం కుంభం. 13 3వభావం మీనం. ఈవిధంగా ఆరు భావాల సాయనభాగలు తెలియ వచ్చాయి. వాటిని నిరయణం

చేయాలి.  అనగా ఆ నాటి ఆయనాంశ తెలుసుకొని ప్రతిభావం నుండి తీసివేయాలి. 23.52.10  అయనాంశ. ప్రతిభావంనుండి తీసివేద్దాము.

| 10 భావం | తుల 16.00.00 | 11వ భావం వృశ్చికం16.00.00 | 12వ భావంధనుస్సు12.00.00 |
|---|---|---|---|
| అయనాంశ | 23.52.10 | 23.52.10 | 23.52.10 |
| | --------- | ---------- | ---------- |
| | కన్య 22.07.50 | తుల 22.07.50 | వృశ్చికం 18.07.50 |
| 1వ భావంమకరం | 7.54.00 | రెండవభావంకుంభం9.00.00 | 3వ భావంమీనం 13.00.00 |
| అయనాంశ | 23.52.10 | 23.52.10 | 23.52.10 |
| | --------- | ---------- | ---------- |
| | ధనుస్సు 13.02.50 | మకరం 16.07.50 | కుంభం 19.07.50 |
| | --------- | ---------- | --------- |

పైవిధంగా 6 భావస్ఫుటాలు వచ్చాయి. ప్రతిదానికి  డి.180 కలుపగా మిగిలిన భావాలు ఏర్పడతాయి.

| | | | |
|---|---|---|---|
| ధనుస్సు | 13.02.50 | మిథునం | 13.02.50 |
| మకరం | 16.07.50 | కర్కాటకం | 16.07.50 |
| కుంభం | 19.07.50 | సింహం | 19.07.50 |
| మీనం | 22.07.50 | కన్య | 22.07.50 |
| మేషం | 22.07.50 | తుల | 22.07.50 |
| వృషభం | 18.07.50 | వృశ్చికం | 18.07.50 |

ఈ విధంగా ద్వాదశ భావాలు ఏర్పడ్డాయి. రాశి చక్రంలో ఈ 12 భావస్ఫుటాలను, గ్రహస్ఫుటాలను ఆ యా రాసులలో వేసిన జాతకచక్రం తయారవుతుంది.
ఆ తర్వాత గ్రహస్థితిని, స్ఫుట,రాశి,నక్షత్ర,కక్ష్య,ఉపకక్ష్యాదుల పట్టికను, ద్వాదశభావస్ఫుట,రాశి,నక్షత్ర,కక్ష్య,
ఉపకక్ష్యాదులను తయారు చేసుకొని, భావకారకుల, గ్రహకారకుల పట్టికను ఏర్పరచుకొని ఫలితనిర్ణయానికి పూనుకోవాలి.

## ఆధికారిక గ్రహాలు

కృష్ణమూర్తి పద్ధతిని ఆశ్రయించి జాతక ఫలితాల్ని చెప్పే జ్యోతిర్విదులకు ఫలనిర్ణయంలో ఆధికారిక గ్రహాలు తోడ్పడతాయి.  ఖచ్చితంగా ఫలితాల్ని నిర్దేశించడంలో వీటికి ఇవే సాటి.  ఇది శ్రీ కృష్ణమూర్తి గారి స్వోపజ్ఞ.
దీనికి అధారాలు సంప్రదాయజ్యోతిషంలో ఎక్కడా లేదు.  వీరి పరిశోధనాఫలితాల్లో ఇది ఒక జాతిరత్నం.

ఖచ్చితమైన జన్మ సమయాన్ని తెలుసుకొనడానికి, ఒక విషయాన్ని పరిశీలించే సమయంలో పలుగ్రహాలు కారకాలుగా పోటీపడే సమయంలో నిజానికి ప్రయోజనవంతమైన కారకాలేవో నిర్ణయించడానికి ఈ ఆధికారిక గ్రహాలు చక్కగా తోడ్పడతాయి.

ప్రతిరోజు ఒక వారాధిపతి ఉంటాడు. ఆదివారానికి రవి, సోమవారానికి చంద్రుడు ఇలా ఏడు వారాలకు ఏడు
గురు వారాధిపతులు.
చంద్రుడు రెండుంబాతిక రోజులకాలంలో 12 రాసుల్లో ఏదో ఒక రాశిలో ఉంటాడు. దాని అధిపతి రాశ్యధిపతి.
చంద్రుడు ప్రతిరోజు ఏదో ఒక నక్షత్రంలో ఉంటాడు. ఆ నక్షత్రాధిపతి.
జాతక పరిశీలనారంభ సమయంలో ఏదో ఒక రాశి తూర్పున ఉదయిస్తుంది. ఆ రాశిపేరిట లగ్నంగా వ్యహరిస్తాము. దాని అధిపతి.
ఆ లగ్నం కూడ ఏదో ఒక నక్షత్రంపై నడుస్తుంది. ఆ లగ్న నక్షత్రాధిపతి.
ఇవి మఖ్యమైన ఐదు ఆధికారిక గ్రహాలు. వీటితో బాటు ఆధునికులు లగ్న కక్ష్యాధిపతి, చంద్రకక్ష్యాధిపతిని కూడ స్వీకరిసుస్తున్నారు.
అంటే మనం జాతకాన్ని పరిశీలించేసమయంలో సందేహనివృత్తికి గాను ఆధికారిక గ్రహాలను ఈ క్రిందివిధంగా గుర్తించవచ్చు. ఉదాహరణకు సమయం 2-12-2007 రాత్రి 10:00 అనుకొందాము.
ఆ నాడు ఆదివారం కావున వారాధిపతి రవి. చంద్రుడు సింహరాశిలో ఉండడం వలన ఆ రాశ్యధిపతి రవి.
అప్పటి నక్షత్రం ఉత్తర దాని అధిపతి రవి. ఆసమయంలో లగ్నం కర్కాటకం దాని అధిపతి చంద్రుడు.
లగ్నారంభం 8:36. లగ్నాంతం 10:49. లగ్నప్రమాణం 2:13 గం.ని. 10 గంటల సమయంలో లగ్న నక్షత్రం ఆశ్లేష. దాని అధిపతి బుధుడు.
ఈ విధంగా రవి,చంద్ర, బుధులు ఆ సమయంలో ఆధికారిక గ్రహాలు. కక్ష్యాపట్టిక ఆధారంగా లగ్న, చంద్ర కక్ష్యాధిపతులను కూడ స్వీకరించవచ్చు. పైవీరు ఉత్తరోత్తరం బలీయులు.
ఒక వ్యక్తి వివాహవిషయం పరిశీలనకు తీసుకొన్నామనుకొందాము. అప్పుడు వివాహచోదకాలైన 2,7,11 భావాలను రవి,శుక్ర,బుధ, శని గ్రహాలు కారకులై సూచిస్తే వారిలో ఎవరు ఫలితాన్నిస్తారో ఈ ఆధికారిక గ్రహాలసాయంతో నిర్ణయించవచ్చు. 2,7,11 భావాల్ని సూచించే ఐదు గ్రహాల్లో ఆధికారిక గ్రహాలుగా శని శుక్రులు లేరు

గాబట్టి వారిని నిరాకరించి మిగిలిన రవి బుధులనే స్వీకరించి వారి దశ,విదశ,అంతర్విదశలలో వివాహం జరుగవచ్చని చెప్పవచ్చు.

జనన కాలం ఖచ్చితంగా తెలియనప్పుడు ఫలితనిర్ణయం సక్రమంగా ఉండదు. అందుకని అధికారికగ్రహాలను జన్మసమయాన్ని నిర్ణయించడానికి ఉపయోగించవచ్చు. కృష్ణమూర్తిపద్ధతి ప్రకారం ఒక గ్రహం కాని ఒక భావం కాని ఏదో ఒక రాశిలో, ఆ రాశిలోని ఏదో ఒక నక్షత్రంలో, ఆ నక్షత్రం (నవమభాగం)లో ఏదో ఒక కక్ష్యలో ఉండి తీరుతుంది.

గణించే సమయంలోని ఆధికారిక గ్రహాలు జననకాలంలోని ఆధికారిక గ్రహాలు సమానం కావాలి. అప్పుడే ఆ జనన కాలం సరి అయినది అని చెప్పవచ్చు. జననకాల లగ్నాధిపతి ఉన్న రాశ్యధిపతి, నక్షత్రాధిపతి, కక్ష్యాధిపతి (కొన్ని సమయాల్లో ) ఉపకక్ష్యాధిపతి పరిశీలన సమయంలోని ఆధికారికగ్రహాల్లో ఏదో ఒకరి నక్షత్ర,కక్ష్య స్థానాల్లో కనబడాలి.

జననసమయనిర్ణాయకవిధానం (రెక్టిఫికేషన్ ఆఫ్ బర్త్ టైం) అనే శీర్షికలో విపులంగా చర్చించాము.

పై ఆధికారిక గ్రహాల్లో ఏదైనా రాహు, కేతువులతో కలసిగాని, చూడబడిగాని సంబంధాన్ని పొందినా, ఆధికారిక గ్రహాల క్షేత్రాల్లో రాహుకేతువులుండినా వారు కూడ ఆధికారిక గ్రహాలవుతారు.

## ఫార్చ్యూనా

ఫార్చ్యూనా ను ఈ జ్యోతిషవిధానంలో ప్రవేశపెట్టడం వల్ల ఫలిత నిర్ణయంలో సులువు అధికమైంది. దీనికి పార్స్ ఫార్చ్యూనా అని మారు పేరు. ఇది సూర్య, చంద్ర, లగ్నాలకున్న దూరసంబంధాన్ని బట్టి నిర్ణయింపబడుతుంది. ఒక విధంగా తాచక విధానంలోని పుణ్యసహమమని చెప్ప వచ్చు. కాని పగలు రాత్రి జననాలకు పుణ్యసహమగణనం భిన్నంగా ఉంటుంది.

గణనావిధానంః- లగ్నస్ఫుటాన్ని చంద్రస్ఫుటాన్ని కూడి ఆ మొత్తం విలువ నుండి రవిస్ఫుటాన్ని తీసివేస్తే వచ్చే విలువ ఫార్చునా స్ఫుటమవుతుంది. 295.24 నకు 73.26 కలిపిన 368.50 అగును. అందుండి రవి స్ఫుటం 216.35ను తీసివేయగా 152.15 ఫార్చునా విలువ అగును. ఆ డిగ్రీ కన్యలో ఉన్నది కావున ఫార్చునాను కన్యారాశిలో వేయాలి.

భ చక్రం లో ఆ భాగలు, లిప్తలు, విలిప్తలు ఉన్న భాగం ఫార్చ్యూనా అవుతుంది. అది అదృష్టాన్ని నిర్ణయించే ఒక సెన్సిటివ్ జోన్ (సున్నితప్రతిఫలద స్థానం). ఆ స్థానం మీదికి శుభకరాలైన గ్రహాల సంబంధం ఏర్పడినపుడు అదృష్టం కలసివస్తుంది. దానిని

వివిధవిషయాలకు, వివిధరంగాలకు కూడ అన్వయించుకోవచ్చు. ఈ ఫార్చ్యూనా లగ్న, చంద్రులకంటే కూడ వేగంగా జరుగుతుంది.

లగ్న, దశమ, ఫార్చ్యూనా స్ఫుటాలు ఫలిత నిర్ణయంలో ప్రముఖ స్థానం వహిస్తాయి. ఈ ఫార్చ్యూనా ఏ భావంలో పడుతుందో ఆ భావఫలితం విస్తృత రూపంలో అనుభూతిలోనికి వస్తుంది. శుభగ్రహాల సంబంధం వల్ల శుభఫలితాలు, అశుభగ్రహాల సంబంధం వల్ల అశుభ ఫలితాలు ఉంటాయి. పాశ్చాత్య విధానంలోని దృక్కులను తీసుకొన్నప్పుడు శుభగ్రహాల చెడు దృక్కులు చెడు ఫలితాల్ని, పాపగ్రహాల చెడుదృక్కులు సత్ఫలితాలను ఇస్తాయి. ఇవి ఐహిక సుఖ సంపదలకు సంబంధించి ఉంటుంది. ఫార్చ్యూనాకు కూడ రాశి నక్షత్ర కక్ష్య ఉపకక్ష్య అధిపతులను కక్ష్యా పట్టిక ద్వారా నిర్ణయించాలి. ఫార్చునాకక్ష్యాధిపతి మంచి యోగదాయకుడని చెప్పాలి. ఆ గ్రహానికి చెందిన రంగు, సంఖ్య, వారం, నక్షత్రాలు(3), రాశి, యోగాన్నిస్తాయి. ఆ గ్రహం ఉన్న రాశిలో రవి సంచరించే నెల, గురువు సంచరించే సంవత్సరం, ఆ గ్రహంతో సంబంధించి ప్రవర్తించే లగ్నం సత్ఫలితాలనిస్తాయి. ఆ గ్రహం ప్రాతినిధ్యం వహించే దైవం అనుకూలంగా ఉంటుంది. అలాగే ఆ గ్రహానిక చెందిన రత్నం యోగాన్నిస్తుంది. ఉదాహరణకు ఒక వ్యక్తి జాతకంలో ఫార్చునా ఉన్న కక్ష్యాధిపతి గురువు అనుకొందాము. ఆ గ్రహానికి ప్రసిద్ధమైన రంగు పసుపు. గ్రహాల వరుసలో వచ్చే సంఖ్య 7. ఆ 3గహాధిపత్యం ఉన్న పునర్వసు, విశాఖ,పూర్వాభాద్ర అనే నక్షత్రాలు. అతని ఆధిపత్యమన్న ధనుర్మీనాలు ఆ వ్యకికి యోగాన్నిస్తాయి. ఆలాగే ఆ గురువు ఉన్న రాశిలో రవిగురువులు సంచరించే నెల, సంవత్సరాలు యోగవంతమౌతాయి. ఆ గురువు రాశ్యధిపతిగా ఉన్నలగ్నం, నక్షత్రాధిపతిగా ఉన్న లగ్నం, కక్ష్యాధిపతిగా ఉన్న లగ్నం సత్ఫలితానుభూతికి అవకాశమిస్తాయి. ఆ గురువునకు చెందిన దైవం దక్షిణామూర్తి, శివుడు,గురువాయూరప్పన్,బాబా మొదలైన రూపాలు అనుగ్రహాన్నిస్తాయి. అలాగే ఆ గురువునకు చెందిన పుష్యరాగం యోగాన్నిచ్చే రత్నం.

వివిధ భావాల్లో ఫార్చ్యూనా స్థితి ఫలితాలు.

ఒక వ్యక్తి జాతకంలో ప్రథమభావంలో ఫార్చ్యూనా ఉంటే ఆ వ్యక్తి మిక్కిలి అదృష్టవంతుడని చెప్పాలి. అతనికి సుఖమయమైన జీవితం సులభంగా లభిస్తుంది. వ్యాపారాదుల్లో చక్కని లాభావకాశాలుంటాయి. స్వయం నిర్ణయం, స్వీయ సామర్థ్యం, స్వయంకృషితో పైకి వస్తారు. దృఢనిశ్చయంతో పనులు సాధించి విజయపరంపరలను అందుకొంటారు.

ద్వితీయభావంలో ఫార్చ్యూనా ఉనికి ఆ వ్యక్తి మంచి అదృష్టవంతుణ్ణి చేస్తుంది. ధనాదాయం బాగా ఉంటుంది. సులువుగా ధనార్జన చేస్తారు. బ్యాంకు నిల్వలు

వృత్తిలో మంచి రాణింపు ఉంటుంది. తన పరిధిలో ఉన్నత స్థితికి ఎదుగుతారు. కాని అశుభగ్రహసంబంధం పతనాన్ని కూడ ఇస్తుంది.
ఏకాదశ భావంలో ఫార్చ్యూనా ఉంటే స్నేహితులు, సోదరులు సాయం అందిస్తారు. సన్మిత్రులు లభిస్తారు. వ్యాపారంలో లాభాలు బాగా ఉంటాయి. అనుకొన్నవన్నీ సాధిస్తారు. సమాజంలో గొప్పవారితో సత్సంబంధాలుంటాయి.
ద్వాదశ భావంలో ఫార్చ్యూనా ఉండడం వల్ల కొనుగోలు, అమ్మకాలు చక్కగా జరుపుతారు. పెట్టుబడులు లాభిస్తాయి. రహస్య, చట్టవిరోధకార్యాలు కూడ లాభిస్తాయి. ఊహించని దారుల గుండా సంపద పెరుగుతుంది. శయన సుఖం బాగా ఉంటుంది. పాపగ్రహసంబంధం ఇబ్బంది పెడుతుంది.

# గుల్‌బర్గా తీయరీ

ఏదైన ఒక పని జరుగుతుందా జరుగదా అనే విషయం సూక్ష్మంగా తెలుసుకోవడానికి ఈ గుల్బర్గా థియరీ తోడ్పడుతుంది. ప్రశ్నను మనసులో తలచుకొని 1-249 లోగా ఒక సంఖ్యను ఎన్నుకోవాలి. కృష్ణమూర్తి పద్ధతి కక్ష్యాపట్టిక ఆధారంగా దాని రాశి నక్షత్ర కక్ష్య అధిపతులను గుర్తించాలి. అదే సమయంలో ఆధికారిక గ్రహాలను పరిశీలించాలి. లగ్నాధిపతి లగ్న నక్షత్రాధిపతి రాశి అధిపతి చంద్ర నక్షత్రాధిపతి దినాధిపతి ---వీరు ఆధికారిక గ్రహాలు. పై కక్ష్యాధిపతి ఈ ఆధికారిక గ్రహాలలో చంద్ర నక్షత్రాధిపతిగా గాని లగ్న నక్షత్రాధిపతిగా గాని కాన వస్తే ఆ పని విజయవంతమౌతుందని నిర్ణయించవచ్చు.

కొన్ని సందర్భాలలో కె.పి. సంఖ్య కక్ష్యాధిపతికి బదులు నక్షత్రాధిపతి, పై విధంగా ఈ ఆధికారిక గ్రహాలలో చంద్ర నక్షత్రాధిపతిగా గాని లగ్న నక్షత్రాధిపతిగా గాని కాన వస్తే ఆ పని విజయవంతమౌతుందని నిర్ణయించవచ్చు.

కొందరు సంఖ్య కక్ష్యాధిపతి, ఆధికారిక గ్రహాలలో లగ్న నక్షత్రాధిపతి లేదా ఫార్చునా నక్షత్రాధిపతి ఒకరే అవడం కాన వస్తే పనిజరిగి తీరుతుందని చెప్తారు.

ఉదాః- 60 వ సంఖ్య తీసుకొందాము. దాని రాశి నక్షత్ర కక్ష్యాధిపతులు బుధ,గురు,శుక్రులు. 10.09.2006 నాడు 15.15.30 సమయంలో లగ్నం గురు,కేతు,శుక్ర చంద్ర కుజ,కేతు,రాహు వీరు ఆధికారిక గ్రహాలు. సంఖ్య కక్ష్యాధిపతి శుక్రుడు ఆధికారిక గ్రహాలలో కానరాలేదు. అయినా ఆ శుక్రుడు ఉన్న నక్షత్రాధిపతి కేతువు. కేతువు ఆధికారిక గ్రహాలలో లగ్న చంద్ర నక్షత్రాధిపతులుగా ఉండడం వలన ఆ పని తప్పక జరుగితీరుతుందని నిశ్చయించవచ్చు.

ఒరిస్సాకు చెందిన కేశబ్ ఆర్ కర్ గారి మల్టిస్టెల్లర్ థియరీ, కె.బి. థియరీ, ఎస్.బి. కుల్లర్ థియరీ, కస్పల్ ఇంటర్ లింక్ థియరీ, టి.ఎస్.పి థియరీ ఇత్యాది అడ్వాన్స్‌డ్ విధానాలు తర్వాత రాబోయే పుస్తకంలో చోటుచేసుకొంటాయి.

కె.ఎస్.కె. గారి తనయులు శ్రీ కె. సుబ్రహ్మణ్యం గారు, శ్రీ కె. హరిహరన్ గారు, శ్రీ వైఖరి రామమూర్తిగారు, శ్రీ కె.ఎం. సుబ్రహ్మణ్యం గారు, శ్రీ కె. బాలచంద్రన్ గారు, శ్రీ అంబరీష్‌గారు బాలశేఖర్ గారు, భాస్కరన్ గారు మొదలైన పెద్దలు 'ఆస్ట్రాలజి అండ్ అదృష్ట' అనే మాస పత్రికలో, కె.పి యియర్ బుక్‌లో పరిశోధనావ్యాసాలు ప్రచురించి ఈ పద్ధతికి ఎంతో ప్రాచుర్యం తెచ్చినారు.

# కారకగ్రహాలను కనుగొనడం

ఒక రాశియొక్క అధిపతికన్న రాశిలోని గ్రహమే బలిష్ఠము. ఒక నక్షత్రాధిపతికన్న ఆ నక్షత్రంలోని గ్రహమే బలిష్ఠము. గ్రహమేదైనా తానున్న రాశి(భావ) ఫలితాన్నిస్తుందని మనకు తెలుసు.

సంప్రదాయజ్యోతిషంలో ఒక భావవిషయాన్ని ఆ భావంలోని గ్రహం, ఆ భావాధిపతి, ఆ భావాన్ని చూస్తున్న గ్రహం సూచిస్తాయి. అంటే ఆ భావ కారకులవుతారు. ఉదాహరణకు సంతానవిషయాన్ని పరిశీలించడానికి లగ్నం నుండి ఐదవరాశి అధిపతి, ఐదవరాశిలోని గ్రహం, ఐదవ రాశిని వీక్షించే గ్రహం ఈ మూడున్ను ఆ భావ కారకులని చెప్పవచ్చు.

కృష్ణమూర్తి పద్ధతిలో కారకులను ఈ క్రిందివిధంగా నిర్ణయించాలి.

ఒకగ్రహం ఒక రాశిలో ఉందనుకొందాము. అది ఆ రాశి ఫలితాలనిస్తుంది. కాని ఆ గ్రహం మొత్తం రాశిచక్రంలో ఏదో ఒక మూడు నక్షత్రాల పై ఆధిపత్యాన్ని వహిస్తుందని మనకు తెలుసు. ( రవి కృత్తిక, ఉత్తర, ఉత్తరాషాఢ లకు అధిపతి). ఆ నక్షత్రాల్లో ఉన్న గ్రహాలు బలిష్ఠాలు. అంటే ఆ భావఫలితాల్ని ఆ గ్రహాలు ఇస్తాయి. అంటే ఆగ్రహాలు ఆ భావ కారకాలు అనవచ్చు.

ఒక జాతకంలో గురువు పంచమభావమైన కర్కాటకరాశిలో ఉన్నాడనుకొందాము. సాధారణంగా ఆ భావఫలితా న్ని ఆ భావంలో ఉన్న కారణంగా గురువే ఇస్తాడని తీర్మానిస్తాము. కాని కృష్ణమూర్తిపద్ధతి ప్రకారం గురువు ఆధిపత్యం గల పునర్వసు,

విశాఖ, పూర్వాభాద్ర నక్షత్రాలలో ఉన్న ఏ గ్రహమైనా ఆ పంచమభావ ఫలితాన్నివ్వడంలో బలిష్ఠమై ముందుగా నిలుస్తుంది.

ఆ తర్వాత బలిష్ఠమైనది ఆ రాశిలో (భావంలో) ఉన్న గ్రహం. ఇచ్చట గురువు.

ఆ పిదప రాశ్యధిపతి నక్షత్రాల్లో ఉన్న గ్రహాలు ప్రాముఖ్యం వహిస్తాయి. కర్కాటకరాశి పంచమభావం అనుకొన్నాము గదా. దాని అధిపతి చంద్రుడు. చంద్రుని నక్షత్రాలైన రోహిణి, హస్త, శ్రవణం నక్షత్రాలలో ఉన్న గ్రహాలు చంద్రునికన్న ముందుగా ఆ భావఫలితాల్నివ్వడంలో ప్రముఖమౌతాయి. అనంతరం ఆ రాశ్యధిపతి ఆ ఫలితాల్నిస్తాడు.

ఈవిధంగా రాశ్యాశ్రిత గ్రహనక్షత్రస్థిత గ్రహం, రాశ్యాశ్రిత గ్రహం, రాశ్యధిపతి నక్షత్రస్థితగ్రహం, రాశ్యధిపతి గ్రహం అనే నాలుగు గ్రహాలు ఆ భావఫలితాలనివ్వడంలో బలిష్ఠకారకాలౌతాయి.

ఈ పై తెల్పిన నాలుగు కారకులతో కలసిగాని దృక్సంబంధంగాని పొందిన గ్రహాలు ఆ భావకారకులవుతాయి.

మరల వివరంగా

ఒక రాశిలో (భావంలో) ఆశ్రిత(ఉన్న) గ్రహం యొక్క నక్షత్రంలోని గ్రహం ప్రథమ బలిష్ఠకారకుడౌతాడు.

ఆ తర్వాతి క్రమంలో ఆ ఆశ్రిత గ్రహం ద్వితీయ బలిష్ఠకారకుడౌతాడు.

ఆ పిదప ఆ భావాధిపతి యొక్క నక్షత్రంలో ఉన్న గ్రహం మూడవ బలిష్ఠకారకుడౌతాడు.

చివరగా భావాధిపతి నాల్గవ బలిష్ఠకారకుడౌతాడు.

ఈ నాలుగు బలిష్ఠకారకులతో కలసిన, ఆ కారకులను చూచే గ్రహాలు కూడ ఆ భావకారకులవుతాయి.

ఆ భావంలో గ్రహాలు లేక పోయినా ఆ భావాన్ని చూచే గ్రహం ఆ భావకారకం అవుతుంది.

చూచే గ్రహం యొక్క నక్షత్రంలో ఉన్న గ్రహం కూడ ఆ భావ కారక మౌతుంది

ఇంతకుముందు తయారైన జాతకమాధారంగా వివిధభావకారకాలను ఈ క్రింది విధంగా తయారుచేసుకోవచ్చు. 45

| గ్రహస్థితి | | | | | భావస్ఫుటం | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| గ్రహ | డి. ని | రాశి | నక్ష | కక్ష్య | భావ | డి ని సె రాశి | నక్ష | కక్ష్య |
| రవి | 178.38 | బుధ | కుజ | శని | 1 | 253.02.50 గురు | కేతు | బుధ |
| చం | 233.30 | కుజ | బుధ | కుజ | 2 | 286.07.50 శని | చం | శని |
| కుజ | 73.04 | బుధ | రాహు | బుధ | 3 | 319.07.50 శని | రాహు | చం |
| బుధ | 193.35 | శుక్ర | రాహు | బుధ | 4 | 352.07.50 గురు | బుధ | చం |
| గురు | 232.49 | కుజ | బుధ | చం | 5 | 22.07.50 కుజ | శుక్ర | శని |

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| శుక్ర | 132.47 | రవి | కేతు | బుధ | 6 | 48.07.50 | శుక్ర | చంద్ర బుధ |
| శని | 131.12 | రవి | కేతు | శని | 7 | 73.02.50 | బుధ | రాహు బుధ |
| రాహు | 321.31 | శని | గురు | గురు | 8 | 106.07.50 | చం | శని గురు |
| ఖాతు | 141.31 | రవి | శుక్ర | గురు | 9 | 139.07.50 | రవి | శుక్ర రాహు |
| | | | | | 10 | 172.07.50 | బుధ | చం శుక్ర |
| | | | | | 11 | 202.07.50 | శుక్ర | గురు శని |
| | | | | | 12 | 228.07.50 | కుజ | బుధ బుధ |

| భావాలు | ఆశ్రితగ్రహ నక్షత్రస్థిత గ్రహం | ఆశ్రితగ్రహం | భావాధిపతిగ్రహ నక్షత్రస్థిత గ్రహం | భావాధిపతి గ్రహం | వీక్షక,సంయుక్తగ్రహం |
|---|---|---|---|---|---|
| 1 | ------ | -------- | రాహు | గురు | చం,కు |
| 2 | ------ | ------- | ---- | శని | కే,శు,రా |
| 3 | కు,బు | రా | ----- | శని | కేతు,శు, రా |
| 4 | ------ | ------ | రా | గు | చం, కు |
| 5 | ---- | ----- | ర | కు | బు,రా |
| 6 | ----- | ----- | కే | శు | శ,కే,రా,గు |
| 7 | ర | కు | చం,గు | బు | ర |
| 8 | కే | శ,శు | ----- | చం | గు,కు |
| 9 | శు,శ | కే | ----- | ర | రా,బు,కు |
| 10 | చం,గు | బు,ర | చం,గు | బు | ర,కు |
| 11 | ----- | ----- | కే | శు | శ,రా |
| 12 | రా | గు,చం | ర | కు | రా |

| | భావకారకాలు | గ్రహకారకాలు | |
|---|---|---|---|
| 1 | రాహు,గురు,చం,కుజ | రవి | 5,7,9,10,12 |
| 2 | శని,కేతు,శుక్ర,రాహు | చం | 1,4,7,8,10,12 |
| 3 | కుజ,రాహు,శని,కేతు,శుక్ర,రాహు | కుజ | 1,3,4,5,7,8,9,10,12 |
| 4 | రాహు,గురు,చం,కుజ | బుధ | 3,5,7,9,10 |
| 5 | రవి,కుజ,బుధ,రాహు | గురు | 1,4,6,7,8,10,12 |
| 6 | కేతు,శుక్ర,శని,రాహు,గురు | శుక్ర | 2,3,6,8,9,11 |
| 7 | రవి,కుజ,చం,గురు,బుధ,రవి | శని | 2,3,6,8,9,11 |
| 8 | కేతు,శని,శుక్ర,చం,గురు,కుజ | రాహు | 1,2,3,4,5,9,11,12 |
| 9 | శుక్ర,శని,కేతు,రవి,రాహు,బుధ,కుజ | కేతు | 2,3,6,8,9,11 |

10 చంద్ర,గురు,బుధ,రవి,కుజ
11 కేతు,శుక్ర,శని,రాహు
12 రాహు,గరు,చం,రవి,కుజ,రాహు

కృష్ణమూర్తి పద్ధతిలో ఈ భావ కారక నిర్ణయమే కష్టము. ఆ తర్వాత ఫలితం చాల సులువుగా చెప్పవపచ్చు.

ఒక భావవిషయఫలితానుభవం ఏ గ్రహం ద్వారా జరుగుతుందో ఆ గ్రహం ఆ విషయానికి కారకమవుతుంది. ఆ విషయం ఆ గ్రహాధిపత్యమున్న రెండు మూడు భావాలకు సంబంధించి కూడ ఉండవచ్చు.
అయితే ఆ గ్రహం తాను నేరుగా గాకుండ తానున్న నక్షత్రాధిపతి ఇచ్చే ఫలితాల్నిస్తుంది. కాబట్టి ఆ గ్రహం ఆశ్రయించిన నక్షత్రాధిపతికే ప్రాముఖ్యం. ఆ నక్షత్రాధిపతి తానున్న రాశి, తన ఆధిపత్యమున్న రాశి, తాను చూచే రాశి ఫలితాలనిస్తుంది.
నక్షత్రాధిపతి సూచించే విషయాలు జరిగేది, జరుగనిది, దాని ప్రమాణాలను కక్ష్యాధిపతి నిర్ణయిస్తుంది. కక్ష్యాధిపతి నక్షత్రాధిపతి సూచించే విషయాలకు సాధకుడైతే (మైత్రి, కారకత్వం) ఆ విషయం చక్కగా అనుభూతిలోనికి వస్తుంది.
ఆ కక్ష్యాధిపతి నక్షత్రాధిపతి సూచించే విషయాలకు విరుద్ధస్థితిలో (వ్యతిరేకత) ఉంటే ఆ విషయ ఫలం అనుభూతిలోనికి రాక పోవచ్చు. ఆ కారకుడు తానున్న రాశి,నక్షత్ర,కక్ష్యాధిపతుల దశ,విదశ,అంతర్విదశాకాలాల్లో ఫలితాల్ని అనుభూతిలోనికి తెస్తాడు. నక్షత్రాధిపతి ఇచ్చేఫలితాల్ని ఎప్పుడు ఇస్తాడో ఆ కారకుడు తెలియజేస్తాడు.
ప్రతిభావం ఎన్నోవిషయాల్ని వ్యక్తీకరిస్తుంది. ఉదాహరణకు నాల్గవభావం తల్లి, గృహం, వాహనం,సుఖం,
చదువు,విదేశవాసావకాశం -- ఇలా పలు విషయాల పరిశీలనకు తోడ్పడుతుంది. కక్ష్యాధిపతి ఉన్న నక్షత్రాధిపతి నిర్ణీతవిషయానికి సంబంధితమైతే ఆ విషయం సఫలమౌతుంది.
ఆ యా భావకక్ష్యాధిపతులు ఆ యా భావాలకు కారకులైతే ఆ యా భావాల ఫలం అనుభూతిలోనికి వస్తుంది.
లేనప్పుడు ఆ యా కక్ష్యాధిపతులున్న నక్షత్రాధిపతులు ఆ భావాల్ని సూచిస్తే ఆ యా భావఫలాలు అనుభూతిలోనికి వస్తాయి.
వివాహవిషయాలను తెలుసుకోవడానికి 2,7,11 భావాలు అవసరం. వాటికి విరుద్ధమైనవి 1,6,10 భావాలు. కుజగ్రహం 2,7,11 భావాలకు కారకుడైనాడనుకొందాము. ఆ గ్రహం వివాహాన్ని జరిపించాలి. అయినా వివాహం కాలేదు. ఎందుకా? అని ప్రశ్నించుకొని పరిశీలిస్తే ఆ కుజగ్రహం ఉన్న కక్ష్యాధిపతి శుక్రుడు కళత్రకారకుడైనా

వివాహ భావాలకు వ్యతిరిక్తమైన 1,6,10 స్థానాలకు కారకుడైనందున వివాహం జరుగలేదని తీర్మానించాలి.
కక్ష్యాధిపతి, నక్షత్రాధిపతి బలహీనులైతే కారకగ్రహం కూడ బలహీనమవుతుంది.(ఉచ్ఛ,మూలత్రికోణాది బలాలున్నా)
ద్వాదశభావాలు
ప్రథమభావం
లగ్నభావ కక్ష్యాధిపతి జీవితమనే వృక్షంయొక్క విత్తనం వంటిది. దీని శక్తిపైనే మొత్తం జీవితలక్ష్యాలు, ప్రయోజనాలు, అనుభూతులు, ఆధారపడి ఉంటాయి. లగ్నభావ కక్ష్యాధిపతి అతడున్న నక్షత్రాధిపతి లేదా అతడున్న కక్ష్యాధిపతి 1,10 భావాల సంబంధం పొందినా, కారకుడైనా సమాజంలో ప్రతిష్ఠ గలవాడౌతాడు. 10వ భావ కక్ష్యాధిపతి ప్రథమభావ కారకుడైతే స్వయంగా ప్రతిభావంతుడై తన కృషిమూలంగా పేరు ప్రతిష్ఠలు సంపాదిస్తారు. ప్రథమభావ కక్ష్యాధిపతి పదవభావాన్ని సూచిస్తే పితరులమూలంగా ప్రతిష్ఠావంతులవుతారు. ప్రథమదశమభావాలు పరస్పర కారకాలైతే గొప్ప పరు ప్రతిష్ఠగల వ్యక్తి సంతానమై తన చేతలవల్ల కూడా గొప్పవాడవుతాడు.
ప్రథమభావకక్ష్యాధిపతి ద్వారా ఆరోగ్యం, ఆయుస్సు, నిర్ణయించాలి. మిగిలిన భావాలతోటి అతని సంబంధాన్ని బట్టి ఏ ఏ రంగాల్లో విజయం, అనుకొన్నవి సాధించడం, చదువు, వృత్తి, సంపద, ఆస్తి సమకూర్చుకోవడం, మొదలైనవాటిని పరిశీలించాలి. భౌతిక మానసిక స్వభావాలు తెలుస్తాయి. గుణగణాలు, ప్రథమభావ రాశి, నక్షత్ర, కకక్ష్యాధిపతులను బట్టి వారున్న రాసులను బట్టి నిర్ణయించాలి. అనగా ఆ రాసులకు నిర్ణయించిన సత్వ,రజ,స్తమో గుణాలు, తత్వాలు మొదలైన వాటి ఆధారంగా నిర్ణయించాలి.
ఆరోగ్య పరిశీలనకు ప్రథమ భావ కక్ష్యాధిపతి 6,8,12 భావాల కారకుడైతే అనారోగ్య సూచనలెక్కువ. ప్రథమభావ కక్ష్యాధిపతి, అతడున్న నక్షత్రాధిపతి వారున్న రాశిని బట్టి రోగస్థాన నిర్ణయం, రోగనిర్ణయం చేయాలి. ఆయుర్నిర్ణయం ఆయుర్దాయం అనే శీర్షికలో చెప్పిన రీతిలో పరిశీలించాలి.

ద్వితీయభావం
రెండవ భావ కక్ష్యాధిపతి తననుండి 1,3,5,9,11 భావాల కారకుడైతే ధనయోగం బాగా ఉంటుంది. ప్రథమ భావ కక్ష్యాధిపతి స్థితిని బట్టి ధన ప్రాప్తి మోతాదు తెలుస్తుంది. లగ్నం నుండి 9,8 భావాల సంబంధం ద్వితీయ కక్ష్యాధిపతికి ఉంటే ధన హీనతకు అవకాశాలున్నాయి. మంచి లేదా లోపభూయిష్ఠమైన వాక్పటిమ 2వ భావ కక్ష్యాధిపతి, అతడున్న నక్షత్రాధిపతి ఉన్న రాశి అధిపతి స్వభావాన్ని బట్టి ఉంటుంది. రవి శుక్రులు రెండవ కక్ష్యాధిపతులై 6,8,12 భావాల సంబంధం కంటి జబ్బులనిస్తుంది.

మూడవభావం

మూడవభావ కక్ష్యాధిపతి తననుండి 1,3,5,9,11 భావాల కారకుడైనా, లగ్న కక్ష్యాధిపతితో మంచిసంబంధం పొందినా తృతీయ భావఫలాలు చక్కగా ఉంటాయి. తన సహజస్వభావం, మరియు సంబంధాన్ని పొందిన స్వభావాన్ని బట్టి ధైర్య సాహసాల ప్రదర్శన, ఉత్సాహం, జయసాధన, కోర్టు కేసుల్లో విజయం ఉంటుంది. 6,8,12 భావాల సంబంధం చెవి అనారోగ్యాలను సూచిస్తుంది. రచనలు,కవిత్వం ఇత్యాదులు ఈ భావాన్ని బట్టి పరిశీలించవచ్చు.

చతుర్థభావం

చతుర్థభావ కక్ష్యాధిపతి తననుండి ప్రయోజనకరమైన 1,3,5,9,11 స్థానాల్ని అలాగే ప్రథమ భావం నుండి మంచి స్థానాల కారకుడైతే సుఖం, విద్య, ప్రయాణం, భూ,భవన వస్త్రాభరణ లాభాలనిస్తాడు. 4వ భావ కక్ష్యాధిపతి 9,11 భావాల సంబంధం పొందితే ఉన్నత విద్యావకాశాలున్నాయి. 3,8 భావాల సంబంధం విద్యాభంగావకాశాల్ని సూచిస్తుంది.

పంచమభావం

పంచమభావ కక్ష్యాధిపతి స్థితిని బట్టి ఒక వ్యక్తి యొక్క తెలివి తేటలు, చాతుర్యం, ఊహాశక్తి, సృజనాత్మకత,ప్రేమ వ్యవహారాలు, సంతతి, కళాత్మకత, ఇత్యాదులను నిర్ణయింప వీలవుతుంది. 5వ భావ కక్ష్యాధిపతి 2,11 భావాల్ని సూచిస్తే సంతాన యోగ్యత. 5,7,11 భావాల్ని సూచిస్తే ప్రేమ వ్యవహారాల్లో సఫలత ఉంటుంది. పంచమ భావ కక్ష్యాధిపతిని బట్టి పుం/స్త్రీ సంతానాన్ని నిర్ణయించవచ్చు.

ఆరవభావం

1,6 భావాల సూచకాలైన ఏ గ్రహమైనా తమ దశ,విదశ, అంతర్దశా కాలాల్లో అనారోగ్యాన్ని సూచిస్తాయి.

8 లేక 12 కక్ష్యల అధిపతులు, 6 లేదా 8 లేదా 12 భావాల కారకులై ప్రథమభావ సంబంధాన్ని పొందితే జబ్బు సీరియస్ గా ఉంటుంది. శరీరంలో ఏదో లోపాన్నిస్తుంది.

అటు జాతక చక్రంలో, గోచార చక్రంలో 1,6 భావాల కారకులైన గ్రహాల వివిధ దశా కాలాల్లో రోగ బాధ ఉంటుంది. 1,5,11 భావాల సమయాల్లో రోగనివృత్తి ఏర్పడుతుంది. జరిగే భుక్తి తర్వాత వచ్చే భుక్తి 1,5,11 భావాల సూచకాలవాలి.

సప్తమ భావం

సాధారణంగా సప్తమ భావాధారంగా వివాహ విషయాలు పరిశీలిస్తాము. వివాహ పరిశీలనకు 2,5,7,11 భావాలు తోడ్పడతాయి. ప్రథమ భావ కక్ష్యాధిపతి లేదా సప్తమభావ

కక్ష్యాధిపతి 5,7,11 స్థానాల కారకులైతే వివాహం ఖాయం. లగ్న, 7వ భావ కక్ష్యాధిపతులు 4,6,10,12 భావాల కారకులై 5,7,11 భావాల సూచించకుంటే వివాహావకాశాలు లేవు.

ఆలస్యవివాహం

శని 1,3,5,7,10 స్థానాల్లో ఉంటే ఆలస్యవివాహం. శని చంద్రుల సంబంధం ఆలస్యాన్ని సూచిస్తుంది. చంద్రుడు శనియొక్క రాశి, నక్షత్ర, కక్ష్యల్లో ఉండినా, శని చంద్రుని రాశి,నక్షత్ర,కక్ష్యల్లో ఉండినా, సప్తమభావాధిపతితో, శుక్రునితో సంబంధం పొందిన శని వల్ల ఆలస్య వివాహ సూచన.

కుజుడు 3,8 రాసుల్లో ఉండినా, సప్తమ కక్ష్యాధిపతి 2,4,6,10,12 భావాల కారకుడైనా 5,7,11 భావాలకు కూడ కారకుడైతే వివాహం ఆలస్యం.

వివాహకాలం

2,5,7,11 భావాల కారకుల దశాభుక్తి అంతర్భుక్తి కాలాల్లో వివాహం జరుగుతుంది.

వివాహేతర సంబంధాలు

ప్రథమ కక్ష్యాధిపతి కుజ,శని, వివాహవ్యతిరిక్తభావ సంబంధితులైన చంద్రశుక్ర ప్రభావితులై 7,9 భావాల సంబంధం పొందితే వివాహేతర సంబంధాలుండవచ్చు. సప్తమభావ కక్ష్యాధిపతి 7,9 భావాల సంబంధం పొందితే వివాహేతర సంబంధాలుండవచ్చు.

జీవితభాగస్వామి స్వభావాలు

7వ భావాన్ని జీవితభాగస్వామి లగ్నంగా భావించాలి. ఆ రాశినాథుడు, నక్షత్రనాథుడు, కక్ష్యానాథుడు, అతడు ఆశ్రయించిన రాశి, నక్షత్ర అధిపతులను బట్టి జీవితభాగస్వామి యొక్క గుణగణాలు, స్వభావాలు నిర్ణయించాలి.

2,6,10 స్థానాలు వృత్తిని సూచిస్తాయి. 7వ భావం నుండి ఈ స్థానాలు అనగా 8,4,12 స్థానాల ద్వారా జీవితభాగస్వామియొక్క వృత్తి హోదా తెలుసుకో వచ్చు.

వయోభేదం

7వ కక్ష్యాధిపతి, దాని నక్షత్రాధిపతిని బట్టి వయస్సు తేడా తెలియ వస్తుంది. గురు,రవి, శుక్రులైతే యోగ్యమైన వయోభేదం. చంద్ర,కుజ,బుధులైతే తక్కువ వయోభేదం. శని అయితే తేడా ఎక్కువ. కొన్ని సందర్భాల్లో ఆ గ్రహమున్న రాశిని బట్టి నిర్ణయించాలి.

దిశ దేశం

7వ కక్ష్యాధిపతి దాని నక్షత్రాధిపతి ఉన్న రాశిని బట్టి దిశ దేశములు నిర్ణయించవచ్చు. 10వ భావం దక్షిణంఃః లగ్నం తూర్పుఃః 3వ భావం ఈశాన్యంఃః 5వ భావం వాయవ్యం దీనిని బట్టి వీటి ఎదురు దిశలను నిర్ణయించాలి. మిగిలిన రాసులను పరిశీలించి దిక్కులు నిర్ణయించాలి.

7వ భావ కక్ష్యాధిపతి 4వ భావ సంబంధం పొందితే ఆ జాతకుని స్వ స్థలం. 9వ భావ

సంబంధం దూర దేశాన్ని, 12వ భావ సంబంధం బహుదూర, విదేశస్థానాల్ని, 2వ భావ సంబంధం స్వ వంశీకలతో, బంధువర్గంతో వివాహాన్ని సూచిస్తుంది.

అష్టమ భావం

8వ భావ ఫల సామర్థ్యం దాని కక్ష్యాధిపతి పై ఆధార పడి ఉంటుంది. 8వ భావ కక్ష్యాధిపతి 1,5,9,11 (బాధకస్థానాలు గాకుంటే) భావాల సూచకుడైతే దీర్ఘాయుస్సు నిచ్చేవాడౌతాడు. మారక బాధక స్థానాల సూచకుడైతే అల్పాయుష్కుడు. ఈ కక్ష్యాధిపతి మరణవిధానాన్ని కూడ తెలియ జేస్తాడు. ఈ భావం ఆకస్మిక ధనలాభాన్ని కూడ సూచిస్తుంది. 8వ భావ కక్ష్యాధిపతి 2,6,11 భావాల కారకుడైతే ఆకస్మిక ధనలాభాలు. ఈ కక్ష్యాధిపతి 1,6 భావాల సూచకుడైతే రోగపీడ ఉంటుంది. ఈ కక్ష్యాధిపతి 2,4,8 భావాలను సూచించడం వల్ల ఆస్తుల మూలంగా తగాదాలు గొడవలుండవచ్చు. ఈ కక్ష్యాధిపతి 1,8,12 భావాల సూచననిస్తే అజ్ఞాతంలో ఉండవలసి వస్తుంది

నవమ భావం

4వ భావం సాధారణ విద్యను సూచిస్తే 9వ భావం ఉన్నత విద్యను సూచిస్తుంది. 4వ భావ కక్ష్యాధిపతి లగ్నాధిపతితో మరియు ఇతర శుభభావ సంబంధం పొంది విద్యా కారకుడైతే సాధారణ విద్య బాగా అబ్బుతుంది. 4వ భావ కక్ష్యాధిపతి 9వ భావంతో సంబంధితమై యుండి, 9వ భావ కక్ష్యాధిపతి శుభభావాలతో, లగ్నభావంతో సంబంధితమై యుండి, 11వ భావ కక్ష్యాధిపతి 9వ భావ సంబంధాన్ని పొంది ఉంటే ఉన్నత విద్యా ప్రాప్తి.

విభిన్న గ్రహాలు 9వ భావ సంబంధం పొందినపుడు వివిధ విషయాల్లో ( సబ్జెట్స్) కలసి వస్తుంది. విభిన్న భావాల కక్ష్యాధిపతులు 9వ భావ సంబంధాన్ని పొందినపుడు వివిదవిషయాల్లో రాణింపు ఉంటుంది.

దశమ భావం

వృత్తి విషయాలను పరిశీలించడానికి 1,2,6,10 భావాలు ముఖ్య పాత్రను వహిస్తాయి. 7వ భావం వ్యాపారం, ప్రజాబాహుళ్య సంబంధం. వృత్తి కి కావలసిన విద్య 4,9 భావాలు తెలుపుతాయి. 11వ భావం ద్వారా పై చెప్పినవి ఎంతగా కలసి వస్తాయో తెలుపుతుంది.

ముఖ్యంగా ఒక వ్యక్తికి గొప్ప ఆర్థిక లాభాలున్నాయా లేదా, నిర్వహణ, పరిపాలనా దక్షత కలదా లేదా పరిశీలించాలి. అలాగే జాతకంలో వృత్తిరీత్యా అభివృద్ధి, శాఖాచంక్రమణం, మార్పు కలదా లేదా చూడాలి. గౌరవమర్యాదలు, అవమానాలు, శిక్షలు కలవా లేవా చూడాలి.

మొదటగా ప్రథమభావ సామర్థ్యాన్ని పరిశీలించాలి. విద్యావిషయాల్ని పరిశీలించాలి. దశమభావ రాశి,నక్షత్ర,కక్ష్యాధిపతుల్ని పరిశీలించాలి.

దశమభావకక్ష్యాధిపతి 6వ భావ కారకుడైతే ఉద్యోగిగా ఉంటాడు. దశమభావ కారకుడు 7వ భావ కారకుడైతే వ్యాపారి అవుతాడు. ప్రథమ దశమ భావ కారకుడైతే సొంత సంస్థ, ఉపాధి ఉంటుంది. 2,6,7,11 స్థానాల్ని బట్టి సంపాదన విస్తరణ ఉంటుంది. రాజకీయాల్లో విజయం సాధించి పదవులు పొందడానికి 11వ భావ కక్ష్యాధిపతి 9,10,11 భావకారకుల నక్ష3తాల్లో ఉండి కుజగురువులతో సంబంధం పొంది ఉండాలి.

ఏకాదశ భావం

వివిధ లాభాల్ని, విజయాల్ని ఈ భావం తెలుపుతుంది. ఈ భావ కక్ష్యాధిపతి ఉన్న రాశి,నక్షత్ర అధిపతులు, ఆ నక్షత్రాధిపతి ఉన్న రాశ్యధిపతులను బట్టి వివరాలు తెలుసుకోవచ్చు. ఏకాదశ కక్ష్యాధిపతి 11వ భావాన్ని మాత్రమే

సూచిస్తే చాల బలిష్ఠమైనదని చెప్పాలి. అంటే అనుకొన్నవన్నీ సాధిస్తాడు. ప్రథమ దశమ భావాలకు కూడ కారకుడైతే విజయం, కీర్తిప్రతిష్ఠలు లభిస్తాయి. ముఖ్యంగా ప్రథమ మరియు సంబంధిత భావాలను బట్టి, సంబంధిత విషయాలను బట్టి మాత్రమే ఆ లాభాలు ఎంతపాటివి అని నిర్ణయించాలి.

వ్యయభావం

పన్నెండవ భావము. ఖర్చులు, కష్టాలు, నిరాశ నిస్పృహలు, ధ్వంసాలు, పెట్టుబడులు, నష్టపోవడము, కోర్టు వ్యవహారాల్లో శిక్ష, శయ్యాసుఖము, ఆత్మ పరిశీలన, చాటుమాటు శత్రువులు, బహిరంగము గాని వ్యాపారాలు, స్త్రీలతో విరోధాలు, చెడు గ్రహాల వల్ల అర్థంకాని జబ్బులు, బాధలు, నేరారోపణలు, కారాగారవాసము, ఇత్యాది విషయాల పరిశీలనకు ఈ భావం తోడ్పడుతుంది. విదేశగమనం కూడా దీని ద్వారా తెలుసుకోవచ్చు.

వివిధవిషయాల్లో విజయసాధనకు చూడవలసిన భావాలు

| | |
|---|---|
| ఆకస్మిక ధనలాభం | 2,5,6,11 |
| గృహవాహన లాభం | 2,4,11 |
| విద్యలో విజయం | 4,11 |
| ఉపకారవేతనంతో విద్యాభ్యాసం | 6,9,11 |
| విదేశంలో విద్యాభ్యాసం | 6,,11,12 |
| వివాహం | 2,7,11 |
| సంతాన ప్రాప్తి | 2,5,11 |
| పదోన్నతి | 2,6,10,11 |

| | |
|---|---|
| వ్యవహారాల్లో గెలుపు | 6,11 |
| విదేశగమనం | 3,9,12 |

కారకులుగా వివిధభావకక్ష్యాధిపతులు ఇచ్చే ఫలితాలు

ప్రథమభావ కక్ష్యాధిపతి

| | | |
|---|---|---|
| 1,3,5 | భావాల కారకుడైతే | అనారోగ్యం నుండి త్వరగా కోలుకోవడం |
| 1,3,5,8,10 | " | దీర్ఘాయుస్సు |
| 1,3,10,11 | " | సమాజంలో పేరు ప్రతిష్ఠలు |
| 1,6,10,11 | " | నాయకత్వం సిద్ధిస్తుంది |
| 2,7 & బాధక స్థానం | " | అల్పాయుస్సు |
| 2,7,8 & " | " | ఆత్మహత్యాప్రయత్నం |
| 3,5,11 | " | ఆటల్లో, వివిధ క్రీడల్లో సామర్థ్యం |
| 3,10,12 & శనిసంబంధం | | ఐహిక విషయాల్లో అనాసక్తత |
| 6,7,8,12 | " | ప్రమాదాల్లో చిక్కుకోవడం |

ద్వితీయ భావ కక్ష్యాధిపతి

| | | |
|---|---|---|
| 1,2,6,10,11 బు/గు | " | వాక్సిద్ధి |
| 2,3,6,8,10,11 | " | ధన,కనక,వస్తు వాహనాలు |
| 2,6,11 | " | అధిక లాభాలు, ధననష్టాల నుండి విడుదల |
| 2,6,10,11 | " | ధనాదాయం తృప్తికరం |
| 2,7 & బుధ | " | ద్వితీయవివాహం |
| 4,11,12 | " | గృహోపకరణాలు కొనడం |
| 5,8,12 | " | లావాదేవీల్లో నష్టాలు |

తృతీయ భావ కక్ష్యాధిపతి

| | | |
|---|---|---|
| 1,3,5,12 | భావాల కారకుడైతే | వస్తుజాతాల కొనుగోలు |
| 1,3,12 | " | దగ్గరి ప్రయాణాలు |
| 1,3,7,11 | " | ఒప్పందాలు, కంట్రాక్టు పనుల సూచన |
| 2,3,10,11 | " | ఉన్నత మైన పదవి |
| 3,6,10,11 | " | మధ్యవర్తిగా, బ్రోకరుగా సంపాదన |
| 3,6,11 | " | విజయవంతంగా పనులు సాధించడం |
| 3,9,11 | " | లాభకరమైన వార్తా ప్రసారాలు |

| | | |
|---|---|---|
| 3,11 బు/గు | ” | విజయవంతమైన లావాదేవీలు |

చతుర్థ భావ కక్ష్యాధిపతి

| | | |
|---|---|---|
| 1,4,6,9,11 | భావాల కారకుడైతే | పూర్వీకుల ఆస్తి సంక్రమణ |
| 1,4,6,9,12 | ” | నిర్మిత గృహాల కొనుగోలు |
| 1,4,12 కుజ | ” | గృహ నిర్మాణం |
| 2,4,10,11 | ” | బ్యాంకు నిల్వలు పెంచడం |
| 2,6,11 శని | ” | నిధి ప్రాప్తి |
| 3,4,5,8,12 | ” | ప్రాథమికవిద్య |
| 3,4,5,10 | ” | స్థిరాస్తుల, వాహనాల అమ్మకం |
| 3,5,8,12 | ” | సాంప్రదాయ విద్యాధ్యయనం |
| 4,5,11 | ” | కళాభినివేశం, కళామూలక సంపాదన |
| 4,6,10,11,12 | ” | గృహమూలకంగా సంపాదన (బాడగ ఇళ్ళ నిర్మాణం) |
| 4,9,10,11 | ” | వాహనం కొనుగోలు |
| 4,9,11 | ” | ఉన్నత విద్యా ప్రాప్తి |
| 4,10 | ” | స్థిరమైన వృత్తి |
| 4,11 | ” | ప్రాథమిక విద్య |
| 4,11,12 | ” | భూరూప ఆస్తి కొనడం |
| 8,12 | ” | చదువు అబ్బక పోవడం |

పంచమ భావ కక్ష్యాధిపతి

| | | |
|---|---|---|
| 1,2,3,4,6 | భావకారకుడైతే | మద్యాది సేవన వ్యసనం |
| 1,3,5,9,10,11 | ” | మంచి తెలివి తేటలు, వివేకము |
| 1,5,6,10,12 | ” | విఫల ప్రేమ వ్యవహారాలు |
| 2,5,7,11 | ” | ప్రేమ వివాహం |
| 2,5,6,8,10,11 | ” | జూదాలు మొదలైన వాటిలో ప్రవేశం |
| 2,5,7,9,10,11 శ,బు,గు | ” | జ్యోతిశ్శాస్త్రాది పరిజ్ఞానం |
| 2,5,11 | ” | సంతాన విషయాలు |
| 3,4,5,11 | ” | మంత్రశాస్త్ర అధ్యయనం |
| 4,6,12 | ” | సంతాన రాహిత్యం |
| 5,7,10,11 | ” | కళాభిని వేశం, అందు విజయం |

షష్ఠ భావ కక్ష్యాధిపతి

| | | |
|---|---|---|
| 1,5,6,11 | ” | పశు సంపద చేరుతుంది |
| 1,6 | ” | అనారోగ్యం |
| 1,6,11 | ” | విజయ సాధన |
| 2,6,10,11 | ” | పదోన్నతి |
| 2,6,11 | ” | విజయ సాధన ధనప్రాప్తి |
| 3,10,12 | ” | వృ త్తిలో మార్పు(చోటు) |
| 5,7,8,12 | ” | సంపదలో నష్టము |
| 6,8,12 | ” | అప్పుల బాధ |
| 6,12 | ” | కళత్రంతో విభేదము, విడిపోవడము |

సప్తమ భావ కక్ష్యాధిపతి

| | | |
|---|---|---|
| 2,5,7,11 | భావాల కారకుడైతే | సుఖమయమైన జీవితం, ప్రేమ వివాహం |
| 2,6,7,12 | ” | వివాహానంతరం విడి పోవడం |
| 2,7,8,11 రా,శ | ” | ద్వితీయవివాహం, విధవా/విధుర వివాహం |
| 2,7,11 | ” | వివాహం |
| 2,7,11 గు/బు | ” | పలు వివాహాలు |
| 5,6,7,12 | ” | వివాహానంతరం విడిపోవడం |
| 6,10,12 | ” | వివాహ రాహిత్యం |
| 7,11 | ” | భాగ స్వామ్యం చక్కగా ఉంటుంది |
| 2,3,5,7,8,11 | ” | పలు వివాహాలు |

అష్టమ భావ కక్ష్యాధిపతి

| | | |
|---|---|---|
| 1,2,10,11 | భావాల కారకుడైతే | పరుల సంపద ప్రాప్తి |
| 1,3,5,8,10 | ” | దీర్ఘాయుస్సు |
| 1,6,7,8,8,10,12, కు,శ | ” | ఆత్మహత్యావకాశాలు |
| 2,3,7,11 | ” | భార్యామూలక ఆస్తి లాభం |
| 2,3,5,6,11 | ” | జూదాల ద్వారా లాభప్రాప్తి |
| 2,5,6,8,11 | ” | మృతుల/దీర్ఘరోగ బాధితుల సంబంధిత ధనప్రాప్తి |
| 2,5,7,8 | ” | విధుర/విధవా వివాహం |

| | | |
|---|---|---|
| 2,6,7,8,11 | ” | భార్యామూలక సంపద ప్రాప్తి |
| 2,7,బాధక | ” | అల్పాయుస్సు |
| 2,8,10,11 | ” | దొంగతనం, దోపిడి ద్వారా ధనాదాయం |
| 3,6,8,10,11 | ” | వీలునామా ద్వారా ఆస్తి, ధనప్రాప్తి |

నవమ కక్ష్యాధిపతి

| | | |
|---|---|---|
| 1,5,8,11,12 గు/శ | భావాల కారకుడైతే | ఆధ్యాత్మిక, దైవకార్యాల్లో పాలు పంచుకోవడం |
| 2,3,9,10,11 శు/బు | ” | విజ్ఞాన శాస్త్రంలో ప్రావీణ్యత |
| 2,6,9,10,11 కు/ర | ” | రాజకీయాల్లో లబ్ధ ప్రతిష్ఠుడు |
| 2,9,10,11 బు/గు | ” | జ్యోతిషశాస్త్ర నిష్ణాతుడు |
| 3,9,12 | ” | విదేశవాసం |
| 6,9,11,12 శ | ” | నూత్న వస్తు దిదృక్షువు, పరిశోధకుడు |

దశమ భావ కక్ష్యాధిపతి

| | | |
|---|---|---|
| 1,3,9,10 | భావాల కారకుడైతే | గౌరవప్రతిష్ఠలున్నా ధనాదాయ లోపం |
| 2,3,10,11 | ” | విస్తృత ఆదాయాలు |
| 2,6,10 | ” | పోగొట్టుకొన్న వృత్తిలో తిరుగ అమరడం |
| 2,9,10,11 | ” | నూతన వృత్తి అవకాశాలు |
| 2,10,11 | ” | వృత్తి ఆరంభం |
| 3,5,9 | ” | నూతన వృత్తి అవకాశాలు |
| 3,5,10 | ” | ఆస్తి అమ్మకం |
| 6,10 | ,, | ఉద్యోగిత్వం |
| 5,8,12 | ” | వ్యాపారంలో నష్టం |
| 7,8,12 | ” | గౌరవ భంగం |
| 7,10 | ” | వ్యాపారం |
| 9,10,11 బు/గు | ” | రాజకీయాల్లో రాణింపు వృద్ధి |

ఏకాదశ కక్ష్యాధిపతి

| | | |
|---|---|---|
| 2,3,5,6,10,11 బు/చం/శ | భావాల కారకుడైతే | తంత్రీవాద్య ప్రతిభావంతుడు |
| 2,3,5,6,10,11 శు | ” | డిండిమాది వాద్య నిష్ణాతుడు |
| 2,5,7,11 | ” | కోరిన వ్యక్తితో వివాహం |
| 2,6,10,11 | ” | వ్యాపారమూలంగా అధికలాభాలు |

| | | |
|---|---|---|
| 2,6,11 గు | " | ఆస్తి పెంపుదల |
| 3,5,11 | " | సాధారణ ప్రసవం |
| 3,6,10,11 | " | గొప్ప లారి, టిప్పరు లాంటి వాహనాలు కలిగి ఉంటారు |
| 4,9,11 | " | విద్యలో మంచి రాణింపు |
| 4,6,9,11 | " | నిర్మిత గృహం కొనుగోలు |
| 4.11.12 | " | పలు గృహాలు నిర్మిస్తారు |
| 5.10 | " | మంత్రశాస్త్ర అధ్యయనం. ఫలప్రాప్తి |
| 5.11 శు/బు/చ | " | ప్రేమవ్యవహారాల్లో విజయం |
| 6,11 | " | రోగ విముక్తి |
| 5.11 చ/శు/కు | " | నటనలో రాణింపు |

ద్వాదశభావకక్ష్యాధిపతి భావాల కారకుడైతే

| | | |
|---|---|---|
| 1,3,9,10,12 | " | విదేశగమనం |
| 1,4,12 శ/కే | " | ప్రాపంచిక సుఖవైరాగ్యం |
| 1,5,7,12 శు | " | దాంపత్య శయ్యా సుఖం |
| 1,5,7,9,12 శ/గు | " | కొత్త పరిశోధనలు |
| 1,6,8,12 మార,చం,కు,రా | " | ఆత్మ హత్య |
| 1,10,12 శ | " | ఆధ్యాత్మిక విషయాసక్తి |
| 3,9,12 | " | దూరదేశప్రయాణం |
| 3,12 | " | దేశ సంచారిత్వం |
| 4,6,9,12 | " | నిర్మితగృహం కొనుగోలు |
| 4,11,12 | " | గృహనిర్మాణం |
| 5,6,8,12 కు | " | అతిచారం |
| 5,8,12 | " | వృత్తి నష్టం |
| 6,8,10,12 శ | " | చోరవృత్తి |
| 6,8,12 మార,బాధ, | " | ప్రమాదాలలో చిక్కుకోవడం |

# ఆయుర్నిర్ణయం

ఆయుస్సు అనే పదాన్ని వయస్సు అనే పదానికి పర్యాయంగా వాడడం జరుగుతుంది. దీర్ఘాయుస్సు అంటే చాల సంవత్సరాలు జీవించడం. దీనిని బట్టి జీవితకాలం 33 సంవత్సరాలు అయితే అల్పాయుస్సు అని, 33 నుండి 66 సంవత్సరాలయితే మధ్యాయుస్సు అని, 66 కు పైబడితే దీర్ఘాయుస్సు అని స్థూలంగా ఈ శాస్త్రం లో వ్యవహరిస్తున్నారు.

సాధారణంగా శుభగ్రహాలు కేంద్రంలో ఉండినా లగ్నాధిపతి, అష్టమాధిపతి బలిష్ఠులై శుభగ్రహ సంబంధం పొందినా దీర్ఘాయుస్సు నిర్ణయింప బడుతుంది. వివిధ జ్యోతిష గ్రంథాలలో ఈ మూడు విధాలైన ఆయుస్సులకు సంబంధించి వివిధ యోగాలు చెప్పబడి ఉన్నాయి. ఆకస్మిక, హఠాత్, తీవ్ర క్రూర ఆత్మహత్యాది మరణాలకు కారణాలను కూడ విడమరచి చెప్పి ఉన్నారు. అయినా అవి సులభావగాహనకు దూరం.

కృష్ణమూర్తి పద్ధతిలో ఇది కొంత సులభ సాధ్యమవుతుంది. అయినా త్వరపడి ఆయుర్నిర్ణయం చేయడం దుస్సాహసం.
ఆయుర్దాయ నిర్ణయానికి 1,3,8,2,7,12 స్థానాలను, చర,స్థిర,ఉభయరాసుల ననుసరించి బాధక స్థానాలను పరిశీలించాలి.
1,3,8 కక్ష్యాధి పతులు 2,7 మరియు బాధకస్థానాలను సూచిస్తే అల్పాయుర్దాయం.
1,3,8 కక్ష్యాధిపతులు మారక మరియు దీర్ఘాయుర్దాయక భావాలను సూచిస్తే మధ్యాయుస్సు.
1,3,8 కక్ష్యాధిపతులు 1,3,5,8 (9,11 బాధక వర్జితంగా) భావాలను సూచిస్తే దీర్ఘాయుష్కులవుతారు.

మరణ సూచక గ్రహం రవి అయితే అగ్నిప్రమాదాలు, వాహనప్రమాదాల మూలంగా మరణావకాశాలు.
మరణ సూచక గ్రహం చంద్రుడు అయితే ప్రకృతివైపరీత్యం,జనసమ్మర్దం,నీటిలో మునక ఇత్యాదులవల్ల మరణం.
మరణ సూచక గ్రహం కుజుడు అయితే హఠాత్, హింసాత్మక, ఆయుధాలవల్ల మరణ ప్రాప్తి.
మరణ సూచక గ్రహం బుధుడు అయితే పైనుండి పడడం, వాతాది ప్రకోపం
మరణ సూచక గ్రహం గురువు అయితే జ్వరం, జీర్ణకోశవ్యాధులు, ప్రశాంత అనాయాస

మరణం, శరీరంలో కొవ్వు పెరగడం వీటి వల్ల మరణ ప్రాప్తి.
మరణ సూచక గ్రహం శుక్రుడు  అయితే అజీర్ణం, మూత్రకోశవ్యాధి, స్త్రీ సంబంధిత వ్యాధుల మూలంగా మరణావకాశాలు.
మరణ సూచక గ్రహం శని  అయితే ఎముకలకు సంబందించిన దీర్ఘకాలిక రోగాలు, ప్రభుత్వ దండనాదుల మూలంగా మరణం.
మరణ సూచక గ్రహం రాహువు  అయితే విషప్రయోగం, అంతు తెలియని జబ్బు వల్ల, కారాగార మరణం

ఎనిమదవ భావ కక్ష్యాధిపతి ఆశ్రయించిన రాశి అగ్ని తత్వం అయితే హింసాత్మక మరణం.
ఎనిమదవ భావ కక్ష్యాధిపతి ఆశ్రయించిన రాశి భూ తత్వం అయితే భవనాలు కూలడం, యంత్రాలమూలంగా, భూకంపం ఇత్యాదుల వల్ల మరణం.
ఎనిమదవ భావ కక్ష్యాధిపతి ఆశ్రయించిన రాశి వాయుతత్వం ఆకాశయానం, వాయురూప మారకావకాశాలు.
ఎనిమదవ భావ కక్ష్యాధిపతి ఆశ్రయించిన రాశి  జలతత్వం  అయితే జలసంబంధరోగాలు, నీటిలో మునక, పారబోవడం వీటిద్వారా మరణం.

ఎనిమదవ భావ కక్ష్యాధిపతి ఉన్న నక్షత్రాధిపతి చోటు చేసుకొన్న రాశి,భావాలను అనుసరించి

| | | |
|---|---|---|
| 1,4,10 | భావాలయితే | నివాస స్థలంలో, ఉద్యోగం చేసే చోట, స్వప్రయత్నంతో |
| 3 | భావం అయితే | నివాసానికి దరిదాపుల్లో, లేదా ప్రయాణాల్లో |
| 6,8,12 | భావాలయితే | అనారోగ్యం, ప్రమాదాలు, విషప్రయోగం, శస్త్ర ప్రయోగం, వైద్యశాల, నివాసస్థలానికి దూరంగా |
| 9 | భావం అయితే | దూరప్రయాణాలు, అపరిచిత ప్రదేశాలు |
| 5, 11 | భావాలయితే | శుభకార్య నిర్వహణా సమయాల్లో |
| 2,7 | మరియు బాధక స్థానాల్లో | సాధారణ మరణం. |

అసహజమరణం
ఎనిమిదవ కక్ష్యాధిపతి 8,12 స్థానాలను సూచించాలి.
ఎనిమిదవ కక్ష్యాధిపతి, దాని నక్షత్రాధిపతి చర, తీవ్ర రాసుల్లో ఉండాలి.(మేష,వృషభ,సింహ,వృశ్చిక,ధనుర్మకరాలు)
ప్రథమభావ కక్ష్యాధిపతి 8,12 స్థానాల సంబంధం పొంది ఉండాలి.

మరణకాలం

లగ్న అష్టమాధిపతుల సంబంధితమైన గ్రహాల దశ, విదశ, అంతర్విదశల కాలంలో మరణావకాశాలున్నాయి.
విదశ, అంతర్విదశ కాలాలు మారక బాధక స్థానాధిపతులవైయుండాలి.
వీరు 8వ భావ రాశి, నక్షత్ర, కక్ష్యాధిపతులై యుండాలి. లేదా 8వ కక్ష్యాధిపతి ఉన్న నక్షత్రాధిపతి అయి ఉండాలి.
లగ్న,రాశి, నక్షత్ర, కక్ష్యాధిపతులు లేదా అష్టమ భావ రాశి నక్షత్ర కక్ష్యాధిపతులు మారక బాధక స్థానాల సూచకులైతే మరణం తప్పదు.

లగ్న, అష్టమ భావాల రాశి, నక్షత్ర, కక్ష్యాధిపతులు మారక బాధక స్థాన కారకులైతే ఆ గ్రహాల దశ, విదశ, అంతర్విదశా కాలాలు ఆందోళన కరాలు.

శని ఆయుష్కారకుడు. 1,3,8 ఆయుష స్థానాలు. వీటికి 12 వ భావాలు అనగా 12,2 7 మారక స్థానాలు.

| | | | |
|---|---|---|---|
| చర రాసులు | (మేష,కర్క,తుల,మకరాలు) | వీటికి 11 వ రాశి | బాధక స్థానము |
| స్థిర రాసులు | (వృష,సింహ,వృశ్చిక,కుంభాలు) | వీటికి 9 వ రాశి | ” |
| ఉభయ రాసులు | (మిథున,కన్య,ధనుర్మీనాలు) | వీటికి 7 వ రాశి | ” |

పేరుకు మారక స్థానాలు మరణాన్నిచ్చేవిగా కనబడ్డా ఆయర్నిర్ణాయకాలు బాధక స్థానాలే.

రవి,చంద్రుడు,లగ్నం,లగ్నాధిపతి, షష్ఠాధిపతి, ఆరవభావంలోని గ్రహాలు ఒకవ్యక్తియొక్క ఆరోగ్యవిషయాల్ని తెలుసుకోవడానికి తోడ్పతాయి. శరీరతత్వం, జీవశక్తి, ఆత్మశక్తి వంశపరంపరసంక్రాంతమైన విషయాల్ని రవి సూచిస్తాడు.
వివిధవాతావరణాల్లోని అలవాట్లు, శారీరకజీవక్రియావిధానాలు, రక్తప్రసరణ ఇత్యాదులు చంద్రుని ద్వారా తెలుసుకోవచ్చు.
భచక్రంలోని 360 భాగలలో ఒక్కొక్కభాగం ఒక్కొక్కవిధమైన గుణాలకు, శారీరక శక్తులకు చెడును ఎదుర్కొనే శక్తిసామర్థ్యాలకు ప్రతీకలవుతాయి. జననకాలం ఏ భాగతో లగ్నం అయిందో ఆ భాగకు చెందిన ప్రవర్తన విధానాలు ఆ జీవికి సంక్రమిస్తాయి.
ఆరవరాశిని వైద్యశాలగా గుర్తించవచ్చు. లగ్నాత్ ఆరవభావం అనారోగ్యాన్ని, జబ్బుల్ని, రోగాల్ని సూచిస్తుంది. దాని అధిపతి, ఆ రాశిలో ఉన్న గ్రహం ఆరోగ్యవిషయాలను తెలుసుకోవడానికి మంచిసూచకాలవుతాయి.
జాతకచక్రంలో లగ్నాదిగా ప్రతిభావం ఒక్కొక్కశరీరభాగాన్ని సూచిస్తుంది. అలాగే భచక్రంలో మేషాదిగా ఒక్కొక్క రాశి ఒక్కొక్క శరీరభాగాన్ని సూచిస్తుంది. రవి,చంద్ర,లగ్నాధిపతి, షష్ఠాధిపతి, ఆరవభావం ఏ రాసుల్లో చోటుచేసుకొంటాయో ఆ

రాశి సూచించే శరీరావయవభాగాలు రుగ్నాలవుతాయి.
ఏ ఏ రాసుల్లో కుజ,శని,యురేనస్, నెప్ట్యూన్, గ్రహాలుండి రవి చంద్రులపై అశుభవీక్షణ కలిగి వుంటాయో ఆ శరీరభాగాలు రుగ్నాలవుతాయి.
4 సుఖస్థానం, 8 ఆయుస్థానం, 12 మోక్షస్థానం. ఈ భావాలు కూడ సున్నితమైన స్థానాలు. అశుభ, పాపగ్రహాల సంబంధం ఈ రాసులు చెప్పే శరీరభాగాలు రుగ్నాలవుతాయి.
ఆరోగ్యసూచకాలు, ఆరోగ్యదీపకాలైన గ్రహాలు అశుభసంబంధం లేకుండ ఈ పైచెప్పబడిన సున్నితభాగాలతో సంబంధం పొందితే చక్కని ఆరోగ్యం సూచితమౌతుంది.
ఎప్పుడూ ఏదో ఒక జబ్బుతో బాధపడుతుండేవారిని కొందరిని మనం చూస్తుంటాము. వారిజాతకాల్లో రవి,చంద్రుడు, లగ్నాధిపతి, ఆరవ అధిపతి 4,6,8,12 భావాల సంబంధం పొంది ఉంటారు. 4,6,8,12 అధిపతులతో పైవారు కలసి ఉంటే ఆ బాధ అధికంగా ఉంటుంది.
రవికుజులకు శుభసంబంధం ఉంటే తేజస్సు, జవం, వేగం అధికమవుతుంది. కుజచంద్రుల సంబంధం అంత మంచిదికాదు. శనిసంబంధం దీర్ఘకాలికతను సూచిస్తుంది.
6,8,12 అధిపతుల, మారక బాధక అధిపతుల దశ, విదశ,అంతర్విదశల కాలంలో ఆయుర్భంగావకాశాలు.
1 మరియు 6, 1 మరియు 8, 1 మరియు 12 భావ రాశి,నక్షత్ర,కక్ష్యాధిపతుల దశ,విదశ,అంతర్విదశాకాలంలో ఆరోగ్యభంగం.
ఆరవభావకక్ష్యాధిపతి శని సంబంధం పొందితే ఆ అనారోగ్యం దీర్ఘకాలికమౌతుంది.
" కుజ సంబంధం పొందితే ఆ అనారోగ్యం ఆగంతుకం, అల్పకాలికం, తీవ్రబాధాదాయకం
శస్త్ర చికిత్సకు అవసరం ఏర్పడవచ్చు.
" బుధ సంబంధం పొందితే ఆ అనారోగ్యం సంశ్లిష్టతను, పరిస్థితి విషమించడాన్ని సూచిస్తుంది.
" రాహుకేతు సంబంధం అవగాహనకు అందని అనారోగ్యం
ప్రతి రాశి, ప్రతిభావం, ప్రతిగ్రహం మన ఒక్కొక్క శరీరభాగంపై ప్రభావాన్ని కలిగి ఉంటుంది. ఆ రాశి, ఆ భావం, ఆ గ్రహం 1,6,8,12 సంబంధితమైతే ఆ గ్రహం పాపగ్రహం అయితే తీవ్ర ఆరోగ్య భంగం.
8 వ భావ కక్ష్యాధిపతి మారక, బాధక స్థానాధిపతుల నక్షత్రాల్లో ఉండి 8 వ భావానికి కుజ సంబంధం ఉంటే ఆత్మహత్యాప్రేరకమవుతుంది.
ఏడవకక్ష్యాధిపతి ఉభయరాశిలో ఉండి అది మారకబాధకస్థానాల కారకుడైతే కళత్రానికి తొలుత మరణమేర్పడుతుంది.

2 వ భావ కక్ష్యాధిపతి ఉభయరాశి లో ఉండి మారక బాధక స్థానాల కారకుడైతే ద్వితీయ కళత్ర మరణం తొలుత ఏర్పడతుంది.
చర రాసుల్లోని గ్రహాలు అనారోగ్యాన్ని సూచిస్తే శిరస్సు, కిడ్నీసు, ఉదరం, చర్మం వీటికి సంబంధించిన రోగబాధ ఉంటుంది.
స్థిరరాసుల్లోని గ్రహాలు అనారోగ్యాన్ని సూచిస్తే గొంతు, గుండె, మూత్రకోశం, రక్తం వీటికి సంబంధించిన బాధలుంటాయి.
ఉభయరాసుల్లోని గ్రహాలు ఊపిరితిత్తులు, ప్రేగులు, నరాలు, జీర్ణకోశం వీటికి సంబంధించిన వ్యాధి బాధలుంటాయి.
నెప్ట్యూన్ గ్రహసంబంధం వల్ల రోగ నిర్ధారణ, రోగవిముక్తి అలభ్యం. మానసిక, వ్యసన, విషగ్రహణ రూపమైన బాధలుండవచ్చు.
యురేనస్ గ్రహ సంబంధం నివారణలేని నరాలకు సంబంధించిన రోగాలు, ప్రమాదాలు, గాయాలు, పక్షవాతం మొదలైన వాటిని సూచిస్తుంది.

రోగము
పంచభూతాలు, త్రిదోషాలు సమస్థితిలో ఉంటే ఆరోగ్యం చక్కగా ఉంటుంది. అనారోగ్యసూచన వీటి విషమ స్థితి ద్వారా తెలుస్తుంది.
భూతత్వ విషమ స్థితి వల్ల కేశము, చర్మము, మాంసము, కీళ్ళు....వీటికి సంబంధించిన రోగాలు.
జలతత్వవిషమస్థితి వల్ల జొల్లు, వీర్యం, మూత్రము, రక్తము...వీటికి సంబంధించిన రోగాలు.
అగ్నితత్వ విషమస్థితి వల్ల నిద్రాభంగము, దాహం,ఊపిరితిత్తుల్లో బాధలు, శరీరసాధారణస్థితిలో మార్పులు వుంటాయి.
వాయుతత్వ విషమ స్థితివల్ల కీళ్ళకు సంబంధించిన రోగాలు, జీర్ణకోశ, ఆంత్రములకు సంబంధించిన రోగాలు.
వీటి అసమతౌల్యత కోపావేశాన్ని, భయాన్ని, శారీరకసుఖ రాహిత్యం లేదా ఆధిక్యాన్ని, వార్ధక్యాన్ని కలుగజేస్తుంది.
జ్యోతిష శాస్త్రరీత్యా ప్రతి రాశి ఏదో ఒక తత్వానికి చెంది ఉంటుంది. అలాగే ప్రతి గ్రహం ఏదో ఒక తత్వానికి చెంది ఉంటుంది. వీటి కలయిక విభిన్న శరీర తత్వాల్ని సృజిస్తుంది.

| తత్వములు | గ్రహం | రాశి | భావాలు |
|---|---|---|---|
| భూ | బుధ | వృష,కన్య,మకర | 2,6,10 |
| అగ్ని | రవి,కుజ | మేష,సింహ,ధనుస్సు | 1,5,9 |
| వాయు | శని | మిథున,తుల,కుంభ | 3,7,11 |

| జల | శుక్ర,చంద్ర | కర్క,వృశ్చిక,మీన | 4,8,12 |
|---|---|---|---|
| ఆకాశ | గురు | అన్ని | అన్ని |

దోషాలు

మన శరీరంలో వాతపిత్తకఫాలనే మూడుదోషాలు సమస్థితిలో ఉంటాయి. అవి ప్రకోపించినపుడు అనారోగ్య పరిస్థితులేర్పడుతాయి. స్వస్థత దెబ్బతింటుంది. మన శరీరంలో వక్షస్సు, ఉదరం, పొత్తికడుపు ముఖ్యయంత్రభాగం అవుతుంది. బొడ్డుక్రింది భాగం వాతఅధీనంలో, హృదయకోశానికి బొడ్డుకు పైన పిత్తము అధీనంలో, వక్షస్సు, ఊపిరితిత్తుల భాగం కఫం అధీనంలో ఉంటుంది.

ఈ దోషాల రూపాలైన సత్వ,రజ,స్తమస్సుల ఆధారంగా గ్రహాలకు, రాసులకు ఈ క్రింది రీతిలో త్రిదోష నిర్ణయం జరిగింది.

| | |
|---|---|
| వాత | చంద్ర, బుధ,శుక్ర, శనులు |
| పిత్త | రవి,కుజ |
| కఫ | గురు |

ఆ యా రాసుల్లో చేరిన పై గ్రహాలు విషమ స్థితిని చెంది విభిన్న అనారోగ్యాలకు దారి తీస్తుంది.

జ్యోతిషశాస్త్రానుసారంగా కృష్ణమూర్తి పద్ధతిలో రోగనిర్ణయం

1. మొదటగా జాతకచక్రంలో లగ్నాన్నను సరించి ఏ ఏ శరీరభాగాల్లో లోపావకాశాలున్నాయన్నది నిర్ణయించాలి.
2. ఆరవ భావ రాశి,నక్షత్ర,కక్ష్యాధిపతుల్ని చూచి ఏ ఏ రోగాలు వచ్చే అవకాశాలున్నాయో పరిశీలించాలి.
3. ఆరవకక్ష్యాధిపతి ఉన్న రాశి, నక్షత్ర, కక్ష్యల్ని గమనించాలి. కక్ష్యాధిపతి, అది ఉన్న రాశి రెండున్ను రోగస్వభావ్ని చెప్తే నక్షత్రాధిపతి అది ఉన్న రాశి, భావం ఏ శరీరభాగం దెబ్బతింటుందో చెప్తుంది.
4. ఆరవకక్ష్యాధిపతి 6,8,12 భావాల కారకుడైనా, వాటిసంబంధాన్ని పొందినా, ప్రథమభావ సంబంధం పొందినా ఆ కక్ష్యాధిపతి దశా,విదశ,అంతర్విదశల్లో అనారోగ్య సూచన.
5. 1,6 భావాల సూచకాలైన ఏ గ్రహమైనా తమ దశ,విదశ, అంతర్దశా కాలాల్లో అనారోగ్యాన్ని సూచిస్తాయి.

   8 లేక 12 కక్ష్యల అధిపతులు, 6 లేదా 8 లేదా 12 భావాల కారకులై ప్రథమభావ సంబంధాన్ని పొందితే జబ్బు సీరియస్ గా ఉంటుంది. శరీరంలో ఏదో లోపాన్నిస్తుంది.

అటు జాతక చక్రంలో, గోచార చక్రంలో 1,6 భావాల కారకులైన గ్రహాల వివిధ దశా కాలాల్లో రోగ బాధ ఉంటుంది. 1,5,11 భావాల సమయాల్లో రోగనివృత్తి ఏర్పడుతుంది. జరిగే భుక్తి తర్వాత వచ్చే భుక్తి 1,5,11 భావాల సూచకాలవాలి.

# ప్రశ్న జాతకం

ఇది జనన కాల సమయాన్ని బట్టి తయారు చేసే జాతకం కాదు. జీవితంలో ఎన్నో విషయాలు అనుభూతిలోనికి వస్తాయి. కొందరికి కొన్ని అనుభవయోగ్యాలు కాక పోవచ్చు. కొన్ని అనుకొన్న సమయానికి గాక కాలయాపన జరుగవచ్చు. అలాగే విలువైన వస్తువులు, మనుష్యులను పోగొట్టుకోవడం, ఆరోగ్యభంగం జరగడం, పోటీలలో గెలుపు--- ఇలాంటి వాటికి సంబంధించిన ప్రశ్నలకు సమాధానాల్ని జ్యోతిషశాస్త్రరీత్యా తెలుసుకోవాలంటే ప్రశ్నజాతకం అవసరం. సంప్రదాయ రీతిలో పలువిధాలైన ప్రశ్నజాతకవిధానాలున్నాయి.
కృష్ణమూర్తి పద్ధతి ప్రకారం
ప్రశ్నించే వ్యక్తి దేనిని ఉద్దేశించి ప్రశ్నించదలచినాడో మనస్సులో అనుకొని 1 నుండి 249 లోగా ఏదేని సంఖ్యను ఎన్నుకొని జ్యోతిర్విదునకు తెలపాలి. ఈ సమయంలో అదృష్టసంఖ్యను స్వీకరించరాదు. అదే విధంగా ఒకమారు సత్ఫలితాలనిచ్చిన సంఖ్యల్నే మరల మరల ఎన్నుకోరాదు. అలాగే ఈ పద్ధతిని పరీక్షించే రీతిలో ప్రశ్నించరాదు. నిజానికి అది అత్యంత ముఖ్యమైన ప్రశ్న అవసరమైయుండాలి. 249 సంఖ్యల్ని ముద్రించిన టోకన్లలో ఏదో ఒకటి తీసియివ్వవచ్చు. లేదా ఒక పుస్తకంలో 1 నుండి 249 పేజీలవరకు గుర్తించుకొని ఒక పుల్లతో/పిన్నుతో ఒక పేజీ సంఖ్యను ఎన్నుకొంటే సమస్యే ఉండదు.
ఆవిధంగా గుర్తించిన సంఖ్య రాశిచక్రంలో ప్రశ్న లగ్నాన్ని తెలియజేస్తుంది. కృష్ణమూర్తి కక్ష్యాపట్టికలో ఆ సంఖ్యకు నేరుగా ఉన్న రాశి నక్షత్ర సంఖ్యలను గుర్తించాలి. అదే లగ్నభావం అవుతుంది. ఆ లగ్నభావాన్ని మూలంగా చేసుకొని మిగిలిన భావాల్ని తయారు చేసుకోవాలి.
ఆ పైన ఆ సమయంలో రవి ఇత్యాది గ్రహాలు ఏ ఏ స్థానాల్లో ఉన్నాయో తెలుసుకోవాలి. కృష్ణమూర్తి పద్ధతి కక్ష్యా పట్టికలో నుండి అవి ఏ ఏ రాశి, నక్షత్ర,కక్ష్యల్లోః ఏ ఏ డిగ్రీ,నిమిష,సెకనుల్లో ఉన్నాయో నిర్ణయించాలి. దాని ఆధారంగా తొలుత భావచక్రం తయారు చేసుకోవాలి.
ఆ పిదప గ్రహస్థితి ఆధారంగా అవి ఏ ఏ భావాలకు బలిష్ఠ,మధ్యమబల,బలహీన కారకులైనాయో గుర్తించాలి. భావకారకనిర్ణయ పట్టికను తయారు చేసుకోవాలి. ఈ పట్టిక ఆధారంగా విభిన్న భావకారకగ్రహాలను తయారుచేసుకోవాలి. ఆ పైన ఈ

ప్రశ్నజాతక చక్రం తయారు చేయడానికి పూనుకొన్న సమయంలోని ఆధికారిక గ్రహాల్ని గుర్తించాలి. అవి లగ్న నక్షత్రాధిపతి, లగ్నాధిపతి, నక్షత్రాధిపతి, రాశ్యధిపతి, వారాధిపతి కక్ష్యాధిపతులను కూడ తీసుకోవచ్చు. ఆతర్వాత ప్రశ్న విషయానికి సంబంధించిన భావకారకులను తీసుకోవాలి. వివాహవిషయానికి 2,7,11 భావకారకాలు, ఉద్యోగవిషయానికి 2,6,10,11 భావకారకాలు. ఆరోగ్యవిషయానికి 1,6,11 భావకారకాలు--ఇలా గుర్తించాలి.

ఆ పిదప చంద్రుని ఆధారంగా అపుడు జరిగే దశ,విదశ,అంతర్విదశలు గణించాలి. పైన తీసుకొన్న కారకాల దశవిదశఅంతర్విదశల కాలంలో ఆ పని జరుగుతుందని నిర్ణయించాలి. అసలా పని జరుగుతుందా జరుగదా అనే విషయం ఆ భావ కక్ష్యాధిపతిని బట్టి నిర్ణయించాలి. ఆ కక్ష్యాపతి తానుగాని, తానున్న నక్షత్రాధిపతిద్వారా గాని ఆ భావ కారకుడు కాగలిగితే ఆ పని ఫలవంతమవుతుంది.

ఒకవేళ కారకగ్రహాలు పలువురై ఫలితనిర్ణయం సంశ్లిష్టంగా ఉంటే అప్పుడు ఆధికారిక గ్రహాలు తోడు వస్తాయి. లగ్న,చంద్రుల రాశి, నక్షత్ర,కక్ష్యాధిపతులు ఆర్గురు, వారాధిపతి వెరసి ఏడుగురు వీరితో సంబంధాన్ని పొందిన రాహు కేతువులు మహా బలిష్ఠ కారకులవుతారు. వారే ఫలిత నిర్ణయం చేస్తారు. వీరిలో వక్రిగ్రహ నక్షత్రాల్లో, కక్ష్యలక్షున్న గ్రహాలు ఫలితాన్నివ్వ లేవు. వాటిని వదలి వేయవచ్చు. అలాగే 12వ భావాన్ని బలంగా సూచించే గ్రహం ఫలితాన్నివ్వ జాలదు. అధికంగా ఆవృత్తమైన (వాటిలోఎక్కువమార్లు కనబడే) గ్రహం ఫలితాన్నివ్వ సమర్థమవుతుంది.

కారక గ్రహాల్లో ఏ గ్రహం యొక్క నక్షత్రంలో వేరే గ్రహాలుండవో (అనాశ్రితగ్రహం) అది అత్యంత బలిష్ఠమైన ఆ భావకారకమవుతుంది. ప్రథమ, లాభ భావ కక్ష్యాధిపతుల్ని పరిశీలించాలి. ఆ గ్రహాల స్వభావాన్ని బట్టి ఆ ఫలితం త్వరిత గతిన లేదా ఆలస్యంగా అనుభూతిలోనికి వస్తుందా--అని నిర్ణయించవచ్చు.

స్వ నక్షత్రంలో వేరు గ్రహాలు లేని బలిష్ఠకారకులైన గ్రహాలను గుర్తించి వాటిలో మన ప్రశ్నకు సంబంధితమైన గ్రహాలు పనులు చేసిపెడతాయని నిర్ణయించాలి.

ప్రశ్న సంబంధితవిషయకారకులై, కక్ష్యాధిపతిత్వాన్ని పొంది స్వనక్షత్రంలో ఏ గ్రహాలు లేని ఈ గ్రహాలు తప్పక ఆ విషయాల్ని విజయవంతంగా నిర్వహిస్తాయి.

వక్రిగా నున్న గ్రహాలు ఆలస్యాన్ని, అడ్డంకుల్ని ప్రసాదించి వక్రత్వాన్ని విడచిన తర్వాత సత్ఫలితాన్నిస్తాయి. శని చంద్ర సంబంధం కొంత ఆలస్యాన్నిస్తుంది.

ఈ విధంగా పరిశీలించి ఎన్ను కొన్న కారకాల దశ,విదశ, అంతర్దశల కాలంలో విషయం ఫలవంతమవుతుంది.

గోచారం కూడ తోడ్పాటు గావాలి. అంటే ఈ దశ,విదశ,అంతర్విదశాధిపతులు గోచారవశంగా ఫలితనిర్ణయం చేసిన గ్రహాల రాశి, నక్షత్ర, కక్ష్యల్లో సంచరించే సమయంలో

ఆ పనులు సక్రమంగా నెరవేరుతాయి.
ఏతావతా తొలుత సంబంధిత విషయకారకులను నిర్ణయించాలి. వారిలో బలహీనులను నిరాకరించాలి. బలిష్ఠకారకులను గుర్తించాలి. ఆధికారికగ్రహాలతో పోల్చుకోవాలి. మరల ముఖ్యులను ఎన్నుకోవాలి. వారిలో స్వ నక్షత్రంలో ఏ గ్రహాలు లేనివాటిని పసిగట్టాలి. వక్రి గ్రహ సంబంధం ఉందా లేదా చూడాలి. ఆ పిదప దశ,విదశ,అంతర్విదశా సమయాన్ని ఏర్పరచాలి. ముఖ్య కారక గ్రహాల కాలంలో ఫలితం ఎదురు చూడవచ్చు. గో చారం లో కూడ ఈ గ్రహాలు తమ క్షేత్రాల్లో ముఖ్య పాత్ర వహించాలి. కార్య నిర్వహణలో సునిశితఫలదాయక క్షేత్రాలను (సెన్సిటివ్ జోన్స్) అవి స్పృశించే సమయంలో కోరిన పనులు జరుగుతాయి ఇక్కడ కూడ కాలం, దేశం ప్రముఖ పాత్ర వహిస్తుంది.

కె.ఎస్.కె. గారి అభిమతాన్ని అనుసరించి
మనం పరిశీలనకు తీసుకొన్న విషయం కొన్ని గంటల్లో జరిగేదిగా అనుకొన్నప్పుడు లగ్నాన్ని జరుపుకొంటూ పోవాలి. ఎచ్చటైతే ఆ సెన్సిటివ్ పాయింట్ ను అది స్పృశిస్తుందో ఆ సమయంలో ఫలానుభూతి ఉంటుందని చెప్పాలి.
అదే విషయం కొన్నాళ్ళకు జరుగవచ్చని అనుకొన్నప్పుడు చంద్రుని కదల్చుకొంటూ వెళ్లి ఎప్పుడు చంద్రుడు ఆ సెన్సిటివ్ పాయింట్‌ను స్పృశిస్తాడో అప్పుడు జరుగవచ్చు. నెలలు నిరీక్షించవలసి వచ్చినపుడు రవిగమనాన్ని, సంవత్సరాలయితే గురువు గమనాన్ని పరిశీలించాలి.
పని త్వరగా అవుతుందా? ఆలస్యమవుతుందా ? అనే విషయాన్ని 11వ భావాధిపతి లేదా తద్భావాశ్రితగ్రహం
నిర్ణయిస్తుంది.
ఆధికారిక గ్రహాల ద్వారా పరిశీలించే సమయంలో ప్రథమభావకక్ష్యాధిపతి ఈ విషయాన్ని నిర్ణయిస్తాడు. త్వరితగమనం గల గ్రహాలయితే పని త్వరలోనే అవుతుందని, నిదానంగా నడిచే గ్రహాలయితే పని నిదానంగా ఆలస్యంగా అవుతుందని నిర్ణయించాలి. రవి,చంద్ర,కుజ, శుక్రులు త్వరిత గమనం గల గ్రహాలు. గురు, రాహు,కేతు, శనులు నిదానంగా చరించే గ్రహాలు.

ఫలిత నిర్ణయంలో దృక్కులు ఇతర విషయాలు.
వీక్షించే గ్రహం యొక్క బలాబలాన్ని బట్టి ఫలిత తీవ్రత ఉంటుంది. ఆ బలాబలాలు ఆ యా గ్రహాల పాపత్వ శుభత్వాన్నిబట్టి, భావ స్థితిని బట్టి, వీక్షకగ్రహాన్ని బట్టి తీర్మానించాలి. గ్రహానికి గ్రహానికి, గ్రహానికి భావానికి, గ్రహానికి ఫార్చ్యూనాకు ఉన్న వీక్షణల్ని పరిశీలించాలి. వీక్షించే గ్రహం యొక్క బలాన్ని, గుణాన్ని, సామర్థ్యాన్ని

నిర్ణయించుకోవాలి. ఆ వీక్షణ కొంతవరకే ఉన్నదా పూర్తిగా ఉన్నదా చూడాలి. ఆ గ్రహాలు తామున్న భావాన్ని బట్టి, నక్షత్రాన్ని బట్టి, తమతో కలసిన గ్రహాన్ని బట్టి తమ గుణాల్ని, స్వభావాన్ని మార్చుకొంటుందని మనకు తెలుసు. అలాగే వాటి ఉచ్చత్వ నీచత్వాది స్థితులను గమనించాలి. 6,8,12 భావాలు చెడ్డవని వాటి సంబంధాన్ని పొందిన గ్రహాలు శుభఫలితాలనివ్వవని నిర్ణయించుకోవాలి. ఆ పై గ్రహాల, అవి ఉన్న రాసుల తత్వాల్ని, చర స్థిర ఉభయత్వాల్ని పరిశీలించాలి.

జాతక చక్రాన్ని పరిశీలించే సమయంలో అగ్రతాంబూలం లగ్నానికి, లగ్నాధిపతికి ఇవ్వాలి. మిగిలిన భావాలతో వాటికున్న సంబంధాన్ని క్షుణ్ణంగా అధ్యయనం చేయాలి. లగ్నాధిపతి బలిష్ఠుడా, మధ్యమ బలుడా, బలహీనుడా, అత్యంత బలహీనుడా అని గుర్తించాలి.

లగ్నాధిపతి 2,3,4,9,10,11 భావాల్లో, 2,10,11 భావాధిపతుల నక్షత్రాల్లో ఉంటే బలిష్ఠుడని చెప్పవచ్చు.

లగ్నాధిపతి 6,8,12 భావాల్లో , 2,10,11 భావాధిపతుల నక్షత్రాల్లో ఉంటే మధ్యమ బలం కలవాడని చెప్పవచ్చు.

లగ్నాధిపతి 2,3,4,9,10,11 భావాల్లో, 6,8,12 భావాధిపతుల నక్షత్రాల్లో ఉంటే బలహీనుడని చెప్పవచ్చు.

లగ్నాధిపతి 6,8,12 భావాల్లో, 6,8,12 భావాధిపతుల నక్షత్రాల్లో ఉంటే అత్యంత బలహీనుడని చెప్పవచ్చు

## ప్రశ్నజాతకం-వివిధభావాలు

లగ్న భావానికి తను భావమని మారు పేరు. ఒక వ్యక్తి జన్మించినప్పుడు తూర్పు దిక్కున ఏ రాశి లగ్న మౌతుందో ( సంబంధిత మౌతుంది ) ఆ రాశి పేరిట ఆ వ్యక్తి జన్మ లగ్నం చలామణి అవుతుంది. ఆరోగ్యము రంగు, శరీర ఔన్నత్యము, భౌతిక స్వరూపము, ఈ లగ్నం ద్వారా తెలుసుకోవచ్చు.

లగ్నం చరరాశి అయితే దాని నుండి 11వ రాశి బాధకస్థానం. స్థిరరాశి అయితే దానినుండి 9వ రాశి బాధకస్థానం. ఉభయరాశి అయితే దానినుండి ఏడవరాశి బాధకస్థానం.

లగ్నం, మారక, బాధకస్థానాల్ని, ఆయుర్దాయక కారకాలను, జరిగే దశ విదశ అంతర్విదశలను ముందుగా గుర్తించాలి.

ప్రథమభావ కక్ష్యాధిపతి మారక బాధక స్థానాల కారకుల నక్షత్రాల్లో ఉంటే ఆయుర్దాయం తక్కువ అని చెప్పాలి.

ప్రథమభావ కక్ష్యాధిపతి ఆరవభావకారకుల నక్షత్రాల్లో ఉంటే అనారోగ్య బాధ ఉంటుంది. మరణం ఏర్పడకపోవచ్చు.

ప్రథమభావ కక్ష్యాధిపతి 8వ భావకారకగ్రహాల నక్షత్రాల్లో ఉంటే ప్రమాదాలకు గురి అయ్యే అవకాశాలుంటాయి.

ప్రథమభావ కక్ష్యాధిపతి 12వ భావకారకగ్రహాలనక్షత్రాల్లో ఉంటే చాలదినాలు అనారోగ్య బాధ ఉంటుంది. ఆసుపత్రి పాలవవలసి వస్తుంది. అధిక బలంతో మారక బాధక స్థానాలు పని చేస్తేనే మరణం ఆసన్నమవుతుంది. దశ,భుక్తి,అంతర్భుక్తి కాలాలు ఆ కారకులకు చెంది ఉండి కలసి పని చేయాలి. ఆధికారిక గ్రహాలను కూడ పరిశీలించాలి.

ప్రథమభావ కక్ష్యాధిపతి ప్రథమ, ఏకాదశ స్థానాల్లోని గ్రహాల నక్షత్ర సంబంధం పొందితే ఆరోగ్యలోపం ఉండదు.

ప్రథమభావ కక్ష్యాధిపతి ప్రథమ,షష్ఠ కారకుల నక్షత్రాల్లో ఉండి ఏకాదశభావ సంబంధం పొందకుంటే ఆ గ్రహాల విదశ, అంతర్విదశల్లో, అనారోగ్య బాధ ఉంటుంది. శని సంబంధ రోగ దీర్ఘకాలికత్వాన్ని, కుజసంబం ధం ఆగంతుకాన్ని బుధుని సంబంధం సంశ్లిష్టతను సూచిస్తుంది.

ప్రథమ, షష్ఠ సంబంధం పొందిన గ్రహాల దశ, విదశ, అంతర్విదశల్లో అనారోగ్యం ప్రారంభమవగా, ప్రథమ, పంచమ, ఏకాదశ గ్రహాల దశ,విదశ,అంతర్విదశల కాలాల్లో రోగనివృత్తి ఏర్పడుతుంది.

ప్రమాదాలు

8వ భావ కక్ష్యాధిపతి అష్టమభావకారకుల నక్షత్రాల్లో ఉంటే ప్రమాదాలకు లోనుగావచ్చు. ఆరవభావకారకత్వం కూడ ఉంటే ప్రమాదాల ద్వారా జ్వరాది ప్రాప్తి ఉంటుంది. ద్వాదశభావకారకత్వం వల్ల ఆసుపత్రి పాలవవలసి వస్తుంది. మారక బాధక సంబంధం మరణాన్ని సూచిస్తుంది. చతుర్ధ భావం జీవితాంతాన్ని సూచిస్తుంది.

ద్వితీయ భావానికి ధన స్థానమని, కుటుంబస్థానమని కూడ పేరు. ధన విషయాలు, ఆర్థికవిషయాలు వారసత్వాలు కూడ బెట్టిన డబ్బు ఎదురు చూచిన డబ్బు ఈ భావం ద్వారా అవగతమౌతాయి. కుటుంబ సభ్యుల సంఖ్య అభివృద్ధి, మనోగత భావాలను వాక్కు ద్వారా వివరించగలగడం, ఆహార పదార్థాల స్వీకార విషయాలు ఈ భావం ద్వారా తెలుసుకోవచ్చు.

ధనార్జన వివిధ రూపాల్లో ఉంటుంది. వస్తువుల అమ్మకం ద్వారా ధనార్జన సూచన ఈ క్రింది విధంగా ఉంటుంది. 3,11 భావాల కారకుల మూలంగా వస్తువిక్రయం ద్వారా ధనార్జన. దానితోబాటు 12 వ భావ సంబంధం ఏర్పడితే నష్టానికి తక్కువ ధరకు విక్రయింపవలసి వస్తుంది.

మూడవభావకక్ష్యాధిపతి బుధుడు కావడం, మూడవభావకక్ష్యాధిపతి లేదా అతడున్న

నక్షత్రాధిపతి ఉభయరాశిలో ఉంటే పలుమార్లు విక్రయం చేస్తారు. (వ్యాపారానికి దీనికి సంబంధం లేదు.)

2,10,11 భావకారకుల సమయమైతే ధనార్జన బాగా ఉంటుంది.

మూడవ భావానికి సోదర స్థానమని పరాక్రమ స్థానమని పేరు. దీని ద్వారా సోదరులకు సంబంధించిన విషయాలు, సాహసము దూకుడు, ధీరత్వము. ఇత్యాది గుణాలు తెలుసుకో వీలౌతుంది. చదువు మీద శ్రద్ధ వ్రాతలో నేర్పిరితనము, దగ్గర ప్రయాణాలు, ప్రచురణలు, ఉద్యోగంలో మార్పు, కుడి చెవి, గొంతు, భుజాలు, ఇత్యాది స్థానాలకు సంబంధించిన విషయాలను ఈ భావం ద్వారా వివరించవచ్చు.

6,11 భావాల కారకులైన గ్రహాల నక్షత్రాల్లో 3వ భావ కక్ష్యధిపతి ఉంటే తన విన్నపం, అర్జీ, అప్పీలు విజయవంతం అవుతాయి.

5,12 భావాల కారకులైన గ్రహాల నక్షత్రాల్లో 3వ భావ కక్ష్యధిపతి ఉంటే తన విన్నపం, అర్జీ, అప్పీలు విజయవంతం కాదు.

సంప్రతింపులకు 3,9 భావాల్ని పరిశీలించాలి. ఈ భావాలతో బాటు వివాహసంప్రతింపులకు 7వ భావం, వ్యాపారాదులకు 6,10 భావాలు, సంతానానికి సంబంధించి అయితే 5వ భావం--వీటిని కూడ స్వీకరించాలి.

ఈ భావకారకులు పరస్పర పోషకాలై, వీరి దశ,విదశాంతర్విదశలు జరుగుతున్న కాలాల్లో పైవిషయాలు చక్కగా ఫలిస్తాయి.

మూడవభావకక్ష్యాధిపతి, అతడున్న నక్షత్రాధిపతి వక్రిగాకుండ 3,11 భావాల్లో ఉంటే తప్పక విజయం లభిస్తుంది.

ఇంటర్వ్యూ, మౌఖిక పరీక్షలు ఇత్యాదుల్లో గెలుపు సాధించాలంటే 3,9,11 సంబంధం చక్కగా ఉండాలి.

అందిన వర్తమానం సత్యమా, అసత్యమా తెలుసుకోవాలంటే మూడవకక్ష్యాధిపతి సంబంధం చూడాలి. మూడవభావ కక్ష్యాధిపతి ఉన్న నక్షత్రం శనిదైనా ఆనక్షత్రాధిపతి శని సంబంధం పొందినా ఆ విషయం వాస్తవం కాదు. మూడవ భావకక్ష్యాధిపతి ఉన్న నక్షత్రాధిపతి కుజ నక్షత్రంలో ఉన్నా, ఆ విషయం అసత్యం, ద్రోహచింతనతో కూడినది. మూడవభావ కక్ష్యాధిపతి గురువు నక్షత్రంలో ఉన్నా, ఆనక్షత్రాధిపతి గురువు సంబంధం పొందినా అది వాస్తవం, సత్యం.

నాల్గవ భావమునకు సుఖ స్థానమని పేరు. దీనికి మాతృ స్థానమని కూడా పేరు. మాతృ సుఖము, మాతృ దేశంలో సుఖము. అనారోగ్యము ఇతర బంధువుల తోటి సంబంధాలు. భూమి, భవనాలు,వస్తు, వాహనాలు, చివరి రోజుల్లో స్థితి గతులు, ఈ భావం ద్వార వ్యక్తమౌతాయి. సుఖాసుఖ అను భూతులు తెలుసుకో వీలవుతుంది. నాల్గవభావ కక్ష్యాధిపతి కుజుడైనా, మూడవభావ కక్ష్యాధిపతి ఉన్న నక్షత్రాధిపతి

కుజసంబంధం పొంది నాల్గవభావ కారకుడైనా, నాల్గవభావసంబంధం పొందినా గృహసంబంధిత విషయాలు పరిశీలించాలి. నాల్గవభావ కక్ష్యాధిపతి చంద్రుడైనా, ఆ కక్ష్యాధిపతి ఉన్న నక్షత్రాధిపతి చతుర్థభావకారకుడై చంద్రగ్రహ సంబంధం పొందినా తల్లికి సంబంధించిన విషయపరిశీలన చేయాలి. నాల్గవభావ కక్ష్యాధిపతి గురువు కాని, బుధుడు కాని అయినా, ఆ కక్ష్యాధిపతి ఉన్న నక్షత్రాధిపతి చతుర్థభావకారకుడై గురు లేక బుధగ్రహ సంబంధం పొందినా విద్యా సంబందిత విషయపరిశీలన చేయాలి. నాల్గవభావ కక్ష్యాధిపతి శని అయినా, ఆ కక్ష్యాధిపతి ఉన్న నక్షత్రాధిపతి చతుర్థభావకారకుడై శనిగ్రహ సంబంధం పొందినా గనులు, భూమికి సంబంధించిన విషయపరిశీలన చేయాలి.

గృహనిర్మాణవిషయపరశీలనకు 4,11,12 భావాల్ని పరిశీలించాలి. నిర్మిత గృహాన్ని కొనడానికి 6,9 కూడ కలుపుకోవాలి.

నాల్గవభావ కక్ష్యాధిపతి వక్రి ఐనా, వక్రి గ్రహ నక్షత్రంలో ఉన్నా గృహం కొనడం కష్టం. ఆ గ్రహాలు వక్రత్వాన్ని పోగొట్టుకొన్నప్పుడే ఆ పనులు అమలు అవుతాయి. (ఆ కక్ష్యాధిపతి 4,11,12 వ భావ కారకుడై యుంటేనే.)

స్థిరాస్తి అమ్ముడు పోవాలంటే 3,5,10 భావాల్ని పరిశీలించాలి. ఇక్కడ కూడ 4వ భావ కక్ష్యాధిపతి, అతడున్న నక్షత్రాధిపతి వక్రత్వం పొందకుండాలి. 4వ భావ కక్ష్యాధిపతి, తన్నక్షత్రాధిపతి 3,10 భావాల కారకుడై యుంటే వక్రత్వం వీడిన తర్వాత ఫలవంతమౌతుంది.

అమ్మకం మంచి లాభానికా కాదా అనేది దశాధిపతిని బట్టి నిర్ణయించాలి. దశాధిపతి ఉన్న నక్షత్రాధిపతి 8వ భావంలో ఉండి 12 వ భావాధిపత్యం పొందితే నష్టానికే అమ్ముడు పోతుంది.

చతుర్థభావ కక్ష్యాధిపతి శుక్రుడై నాల్గవ భావకారకుడైనా, నాల్గవభావకారకుని నక్షత్రంలో ఉండి శుక్ర సంబంధం పొందినా వాహనం, లేదా సౌకర్యదాయకమైన వస్తుజాతం (ఫర్నిచర్) పరిశీలనకు వస్తుంది.

కక్ష్యాధిపతి, కక్ష్యాధిపతి ఉన్న నక్షత్రాధిపతి చతుర్థభావ కారకుడై శుక్ర సంబంధం పొంది చర రాశిలో ఉంటే వాహనాన్ని సూచిస్తుంది. స్థిర రాశిలో ఉంటే ఫర్నిచర్‌ని సూచిస్తుంది. ఉభయరాశిలో ఉంటే రెంటిని సూచిస్తుంది.

శని ప్రముఖ పాత్ర వహిస్తే సైకిలును సూచించగా కుజ,చంద్ర,శుక్ర ప్రాముఖ్యం పెట్రోలుతో నడిచే బండిని సూచిస్తుంది. చతుష్పాదరాశి సంబంధం ఉంటే కారు అవకాశాలు.

కారు మొదలైనవి కొని తద్వారా సంపాదనకు 4తో బాటు 2,6,10 కారకత్వాలు కూడా ఉండాలి. బుధుడు ఉభయరాశి సంబంధం పొందితే వివిధవాహనాలనిస్తాడు.

వాహనం కొనుగోలుకు 4,9,10,11 భావాలు : వాహనం అమ్మకాలకు 3,4,5,10 భావాలు

చూడాలి. అధికారిక గ్రహాల ఆధారంతో దశాభుక్తి అంతర్భుక్తుల కాలంలో, గోచారం తోడుగా ఇవి అనుభూతిలోనికి వస్తాయి.

విద్యాసంబంధిత పరీక్షలలో విజయసాధనను పరిశీలించడానికి 4,9,11 భావాల్ని పరిశీలించాలి. పోటీని ఎదర్కొని పాల్గొనే ధైర్యస్థితి 3వ భావం ద్వారా తెలుస్తుంది. 3వ భావ కక్ష్యాధిపతి చంద్రుడైతే ధైర్యం తక్కువ. శని అయితే ఆత్మవిశ్వాసం తక్కువ. బుధుడైతే ద్వైధీభావ మనసునిస్తాడు. కాబట్టి 3వ భావ కక్ష్యాధిపతి రవి,కుజ,గురు, శుక్రులలో ఎవరైనా సత్ఫలితాలనిస్తారు. అన్నీ మంచిగ్రహాలు తోడ్పడినప్పటికీ ప్రథమభావం 6,8,12 స్థానాల సంబంధం పొందినా, పాపగ్రహ సంబంధం పొందినా అసలు పాల్గొనే అవకాశాలే లోపిస్తాయి.

నడిచే దశ,విదశ, అంతర్విదశల ఆధారంగా విజయావకాశాల్ని నిర్ణయించాలి. విద్యా సంస్థల్లో ప్రవేశం లభ్యమవడానికి నాల్గవ భావ కక్ష్యాధిపతి 4,11 భావ కారకుల నక్షత్రాల్లో ఉండాలి.

పంచమభావం. దీనికి మంత్ర స్థానమని, సుత స్థానమనిపేరు. కళలు, నాట్యము, నాటకము, పోటీలు, జూదము, ప్రేమ వ్యవహారాలు, సంతానము, దైవ ప్రేరణ, దైవ ధ్యానము, ఇత్యాదులన్ని ఈ భావం ద్వారా తెలుసుకోవచ్చు. ఆటలు మొదలైన వాటిలో విజయము, రాజకీయాల అభివృద్ధి కూడా ఈ భావం ద్వారా తెలియవస్తుంది. పంచమభావ కక్ష్యాధిపతి 7,11 భావకారకులైన గ్రహాల నక్షత్రాల్లోఉంటే ప్రేమవ్యవహారాలు విజయవంతమవు

తాయి. 6,12 భావాల కారకులైన వారి నక్షత్రాల్లో ఉంటే ఫలవంతమవవు. ఆ నక్షత్రాధిపతి 6వ భావ కారకుడైతే అవతలి వ్యక్తి జారిపోతాడు. 12వ భావ కారకుడైతే తనే దూరమౌతాడు. సంతాన ఆరోగ్య విషయ పరిశీలనలో పంచమభావ కక్ష్యాధిపతి ముఖ్యపాత్ర వహిస్తాడు. 5వ భావ కక్ష్యాధిపతి ఉన్న నక్షత్రాధిపతి 3,5 భావాల కారకుడైతే తప్పక కోలుకుంటాడు. అలా కాక 10 భావ సంబంధం పొంది శని ప్రముఖ పాత్ర వహిస్తే పరిస్థితి విషమిస్తుంది.

వ్యాపార భాగస్వామ్య పరిశీలనకు 8వ భావ కక్ష్యాధిపతిని తీసుకోవాలి. 8వ భావ కక్ష్యాధిపతి ఉన్న నక్షత్రాధిపతి 6,11 భావాల కారకులైతే వ్యాపారంలో భాగస్వామ్య అవకాశాలుంటాయి. 5,12 భావాల కారకులైతే భాగస్వామ్యం పనికి రాదు.

కళారంగంలో ప్రసిద్ధి చెందడానికి కూడ పంచమ కక్ష్యాధిపతిని స్వీకరించాలి. ఆ గ్రహం 5,6,10 భావాల కారకుడైతే ప్రసిద్ధి చెందిన కళాకారుడవుతారు. 11వ భావ కారకుడైతే ధనాదాయ అవకాశాలు కూడ ఉంటుంది. కుజ సంబంధం ఉండడం ఇంకా ప్రసిద్ధినిస్తుంది.

సంతాన విషయాలు

సంతాన విషయప్రశ్నలో ఫలితం విజయం కావడానికి ఐదవ భావ కక్ష్యాధిపతి వక్రి గారాదు. వక్రి గ్రహ నక్షత్రంలో పడరాదు. అతడు 2,5,11 భావాల కారకుడవాలి. 2,5,11 భావాల కారకులైన గ్రహాల దశ,విదశ, అంతర్విదశలకాలంలో సంతాన ప్రాప్తి అవకాశాలు.

ఐదవ భావం సంతానాన్ని సూచిస్తుంది. 11 వ భావం జీవితభాగస్వామికి 5వ భావం. పంచమభావం సంతానాన్ని సూచించి ఏకాదశభావం సంతాన విషయాన్ని సూచించకుంటే పృచ్ఛకుడు సంతానాన్నివ్వడానికి శక్తివంతుడవుతాడు. ఏకాదశభావం సంతానకారకుడై పంచమభావం సూచించకుంటే జీవితభాగస్వామి సంతానోత్పత్తికి శక్తివంతమవుతుంది. 5,11 భావాలు సంతానవిషయాల కారకులు గాకుంటే సంతానవిషయంలో నిరాశే ఎదురవుతుంది.

ప్రశ్నించే వ్యక్తి పురుషుడైతే 11వ భావ కక్ష్యాధిపతి, ప్రశ్నించేది గర్భవతి అయితే 5వ భావ కక్ష్యాధిపతి ఉన్న నక్షత్రాధిపతి బుధుడైనా, ఆగ్రహం ఉభయరాశిలో ఉండినా అమడబిడ్డల కవకాశమని చెప్పాలి. అసలు గర్భవతియా కాదా అని తెలుసుకోవడానికి పంచమభావ కక్ష్యాధిపతి 2,5,11 భావ కారకులైన గ్రహాల నక్షత్రాల్లో ఉండాలి. దానితో బాటు వంధ్యారాసుల్లో ఉండరాదు. ఇట్లు గాకున్న సంతానరాహిత్యం కలుగుతుంది.

దత్తత ప్రశ్న

దంపతుల్లో ఏ ఒక్కరికి సంతాన అవకాశాలు లేనప్పుడు దత్తత ప్రశ్న ఉదయిస్తుంది. దత్తత స్వీకరింపవలసి వచ్చినపుడు ఆ బిడ్డకు దత్తతకు వెళ్ళే అవకాశం ఉందా లేదా అని పరిశీలించాలి. నాల్గవభావ కక్ష్యాధిపతిని పరిశీలించాలి. ఆ కక్ష్యాధిపతి ఉభయరాశిలో ఉండడం లేదా బుధుడు కావడం, లేదా ఆ కక్ష్యాధిపతి 8వ భావ కారకుడవడం జరిగితే ఆ బిడ్డకు దత్తతకు పోయే అవకాశం ఉంది.

లాటరీ మొదలైన వాటిద్వారా లాభం తెలుసుకోవడానికి 11వ భావాన్ని పరిశీలించాలి. లాభ భావ కక్ష్యాధిపతి వక్రి అయినా, వక్రి గ్రహ నక్షత్రంలో ఉన్నా లాభావకాశాలు లేవనే చెప్పాలి. వక్రి గాకుంటే మంచి అవకాశాలుంటాయి. అదే సమయంలో ఆ గ్రహం 2,6,11 భావాలకు కారకుడవాలి.

శనికి లాభభావ సంబంధం ఉంటే ఆలస్యం. రవి చంద్ర లాంటి శీఘ్రగ్రహసంబంధం ఉంటే త్వరితకాలం, మిగిలిన గ్రహాలు మధ్యమార్గాన్ని సూచిస్తాయి. రాహు కేతువులు తాము ఏ గ్రహంతో కలసి ఉంటారో ఆ గ్రహం లేదా ఏ నక్షత్రంలో ఉంటారో ఆగ్రహం, తమను చూచే గ్రహం, తామున్న రాశ్యధిపతి తెలిపే గ్రహం తెలిపే సమయాన్ని సూచిస్తారు.

2,6,11 భావాల కారకత్వంతో బాటు 5,8,12 భావాన్ని సూచించే గ్రహాల్ని తిరస్కరించి మిగిలిన గ్రహాలను స్వీకరించాలి. వాటిలో ఆధికారిక గ్రహాలేవో పరిశీలించి వాటి

దశావిదశా అంతర్విదశాకాలాల్లో ఈ లాభావకాశా లుంటాయని చెప్పాలి. 3వ, 5వ భావసంబంధం ఉన్న కాలాల్లో ఇలాంటి పోటీ, లాటరీ ఇత్యాదుల్లో పాల్గొనడం లాభదాయకం.
ఆరవ భావము. దీనికి శత్రు స్థానమని రోగ స్థానమని మారు పేరు. ఉద్యోగము పనివాండ్రు, మేనమామ అనారోగ్యము, అప్పులు ఇత్యాది విషయాలు ఈ భావం ద్వారా తెలియవస్తాయి. ఎన్నికలలో కోర్టు కేసులలో గెలుపు, కష్టపడి పనిచేయడం వ్యాపారం ఇత్యాదులు కూడ దీని ద్వారా తెలుసుకోవచ్చు. కట్నము, బ్యాంక్ ఓవర్ డ్రాఫ్ట్, ఇతర ఆధారాల మూలంగా ధన ప్రాప్తి ఈ భావం ద్వారా తెలుస్తుంది.
ఆరవ భావం ఋణ,రోగ,శ్రమ,చోర విషయాల్ని సూచిస్తుంది. అందు ఋణప్రాప్తి పలు విధాలుగా ఉంటుంది.
ఆరవ భావ కక్ష్యాధిపతి వక్రి అయినా వక్రిగ్రహ నక్షత్రంలో ఉన్నా ఋణప్రాప్తి అవకాశాలు లేవని నిర్ణయించాలి.
ఆరవ భావ కక్ష్యాధిపతి రవి అయితే ప్రభుత్వ, బ్యాంకు మూలంగా ఋణప్రాప్తి, చంద్రుడయితే సత్వర ఫలితం, కుజుడైతే కొంత అడ్డంకులు, గొడవలు ఉండవచ్చు, బుధుడైతే ప్రతినిధి ద్వారా, కంతుల్లో ఋణప్రాప్తి, గురువైతే న్యాయపద్ధతుల్లో గౌరవంగా ఋణప్రాప్తి, శుక్రుడైతే మైత్రిపూర్వకంగా, శని అయితే ఆలస్యం జరుగవచ్చు. శని ఆరవభావకక్ష్యాధిపతిని చూస్తుంటే అనుకొన్నంతలో కొంతభాగమే ఋణరూపంలో లభిస్తుంది.
2,6 భావాల సంబంధం కనిష్ఠ సోదరుల మూలంగా, 3,6 భావాల సంబంధం తల్లి మూలంగా, 4,6 భావాల సంబంధం సంతానం, సంతానం వంటి వారి మూలంగా, 6వ భావ సంబంధం భార్య, భాగస్వామి ఇత్యాదుల మూలంగా, 8,6 భావాల సంబంధం తండ్రి, తండ్రి వంటివారి మూలంగా, 10,6 భావాల సంబంధం జ్యేష్ఠ సోదరులు, మిత్రుల మూలంగా ఋణప్రాప్తిని చెప్పవచ్చు.
అప్పులు తీర్చడం (ఋణబాధావిముక్తి) అనేది 12వ భావంపై ఆధారపడి ఉంటుంది. 12వ భావ కక్ష్యాధిపతి వక్రి అయినా, వక్రిగ్రహ నక్షత్రంలో ఉన్నా ఋణవిమోచనావకాశాలు తక్కువ. వీరి వక్రత్వం పోయినపుడే ఋణ విమోచనావకాశాలు. 12వ భావ కక్ష్యాధిపతి రవి అయితే తండ్రి, ప్రభుత్వం ఇత్యాది సాయంతో ఋణవిమోచన, చంద్రుడైతే త్వరితగతిలో ఋణవిమోచన, కుజుడైతే బలప్రయోగం ద్వారా అప్పు తీర్చవలసి ఉంటుంది. బుధుడైతే ప్రతినిధిద్వారా కంతులవారీగా తీర్చడం జరుగుతుంది. గురువు అయితే ధర్మబద్ధంగా, గౌరవప్రదంగా, శుక్రుడైతే మంచిమాటలద్వారా, సంప్రతింపులద్వారా, శని అయితే ఆటంకాలు, అడ్డంకులతర్వాత అప్పుతీరుతుంది.
దొంగతనంద్వారా పోగొట్టుకొన్న వస్తువు తిరిగి పొందడానికి
ప్రథమభావం పృచ్ఛకుని, 7వభావం దొంగను సూచిస్తుంది. పోయినవస్తువును

రెండవభావం సూచించగా,తిరిగి పొందడాన్ని 11వ భావం చెపుతుంది. 11వ భావకక్ష్యాధిపతి ఉన్న నక్షత్రాధిపతి 11వ భావకారకుడైతే పోగొట్టుకొన్నవస్తువు తప్పక తిరిగి వస్తుంది.

7వ భావ కక్ష్యాధిపతి ద్వారా దొంగ లింగము, వయస్సు నిర్ణయించవచ్చు. 7వ భావకారకుడు ప్రథమభావానికి కూడ కారకుడైతే పరిచితుడే దొంగతనం చేసినాడని నిర్ణయించవచ్చు. ద్వితీయభావ కారకుడైతే దొంగతనం చేసింది కుటుంబసభ్యుల్లోనే ఒకరై ఉండాలి. తృతీయభావకారకుడైతే ఇరుగుపొరుగు నివాసి, సోదరుడు, సోదరతుల్యుడు, ఏదోపనిమీద వచ్చినవాడు దొంగతనం చేసి ఉండవచ్చు. నాల్గవభావకారకుడైతే ఆ భవన ప్రాంగణంలో నివసించే వ్యక్తి అని నిర్ణయించవచ్చు. ఐదవ భావకారకుడైతే ఇష్టుడు, ప్రేమ పాత్రుడు, సంతానం, సంతానం వంటివారు దొంగతనానికి పాల్పడి ఉండవచ్చు. 6వ భావానికి కూడ కారకుడు అయితే రోగి, శత్రువు, సేవకులలో ఆదొంగ ఉంటాడు. 8వ భావకారకుడైతే అపరిచితుడు, కొంతకాలమునకు ముందే పరిచయమేర్పడిన వ్యక్తి అయి ఉంటాడు. 9వ భావకారకుడైతే దూరప్రాంతాలనుండి వచ్చిన అపరిచితుడు, వేరు కులం, జాతివాడు, పూర్తిగా అపరిచితుడు, దొంగ సన్యాసి గావచ్చు. 10వ భావ కారకుడైతే గౌరవనీయుడు, సందేహానికి తావు ఇవ్వనివాడు, సంఘటనా స్థలంలో అన్ని వివరాలు తెలిసినవాడు దొంగ అయి ఉంటాడు. 11వ భావకారకుడైతే స్నేహితుడు, జ్యేష్ఠసోదరుడు లేదా సోదరతుల్యుడు, నమ్మినవాడు దొంగతనం చేసి ఉంటాడు. 12వ భావ కారకుడైతే అపరిచితుడు, దరిద్రుడు, బిచ్చగాడు, ఋణగ్రహీత, వృత్తిరీత్యా దొంగ అయిఉండవచ్చు.

దొంగ ఉన్న ప్రదేశం.

ప్రథమ సప్తమ భావాల్లోని గ్రహాలు తాము గాక వేర్వేరు 2 గ్రహాల కక్ష్యల్లో ఉండి, ఆ గ్రహాలు 10వ భావంలో ఉంటే దొంగ ఆ స్థలంలోనే ఉన్నాడు. ఆ కారకుడు 3వ భావంలో ఉన్న కారకుని కక్ష్యలో ఉంటే దరిదాపుల్లోనే ఆ దొంగ ఉంటాడు. ఆ కారకుడు 9వ భావం లో ఉన్న కారకుని కక్ష్యలో ఉంటే దూరంగా వెళ్ళినాడని చెప్పవచ్చు. ప్రథమసప్తమభావాల్లోని గ్రహాలు తమకక్ష్యల్లోనే ఉంటే ప్రశ్నించేవాడే దొంగ.

దశమ సప్తమ భావ కారకులు పరస్పరవీక్షణ కలిగి ఉంటే దొంగ ఇంట్లోనే ఉన్నాడని, సప్తమభావాధిపతి 3,6 భావాల సంబంధం పొందితే చాల దూరంలో ఉన్నాడని, సప్తమ భావాధిపతి చరరాశిలో ఉంటే ప్రయాణంలో ఉన్నాడని, స్థిరరాశి మరియు 10వ రాశిలో ఉంటే సొంతనివాసంలో ఉన్నాడని, స్థిరరాశి అయి పంచమభావం అయితే మిత్రుని ఇంట ఉన్నాడని, స్థిరరాశి అయి తృతీయభావం అయితే అపరిచితుని ఇంట ఉన్నాడని నిర్ణయించాలి.

వృచ్ఛకుని బంధుత్వాన్ని బట్టి 2,6,11 భావాల కారకులు అప్పటి ఆధికారికగ్రహాలసంబంధం కానవస్తే పోగొట్టుకొన్నది తిరిగి పొందే అవకాశాలున్నాయి. 5,8,12 భావాల కారకులతో అప్పటి ఆధికారిక గ్రహాలసంబంధం కానవస్తే ఆ వస్తువు తిరిగి రాకపోవచ్చు.

ఏడవ భావము. కళత్ర స్థానమని పేరు. వ్యాపారము శత్రువులు సమాజంలో ఇతరులతో సంబంధాలు సమితులు, సమాజాలు పొగొట్టు కున్న వస్తువులు, దొంగతనం, ఈ విషయాలన్నీ ఈ భావం ద్వారా తెలుస్తుంది. కళత్రం యొక్క ఒడ్డు, పొడుగు, రంగు, వయస్సు, వైవాహిక జీవితంలో సుఖా సుఖాలు ఇవి తెలియవస్తాయి. వ్యాపార రంగానికి సంబంధించిన విషయాలు కూడా ఇందులో తెలుసుకోవచ్చు.

సప్తమభావ కక్ష్యాధిపతి 2,7,11 భావలను సూచిస్తే వివాహం తప్పక అవుతుంది. సప్తమ భావ కక్ష్యాధిపతి లేదా అతడున్న నక్షత్రాధిపతి బుధుడు కాకుండడం, ఉభయరాశిలో లేకుండడం జరిగి దానితోబాటు లాభభావకక్ష్యాధిపతి సప్తమభావకారకుని నక్షత్రంలో ఉంటే వివాహితులు పరస్పర అనురాగం బంధం కలిగి ఉంటారు. లాభ భావ కక్ష్యాధిపతి ఉన్న నక్షత్రాధిపతి ఆరవభావకారకుడైతే ఇతరసంబంధాలున్నా హద్దుమీరి నడచుకోరు. పరస్పరం విశ్వాసపాత్రులుగా ఉంటారు.

ఒక వేళ కొన్ని కారణాలవల్ల విడిపోయిన జంట మరల కలుసుకోవడం 2,7,11 భావాల కారకులదశ,విదశ, అంతర్విదశల కాలంలో జరుగవచ్చు.

7వ భావ కక్ష్యాధిపతి ఉభయరాశిలో ఉన్నా, ఉభయరాశిలో ఉన్న గ్రహం యొక్క నక్షత్రంలో ఉన్నా, 7వ భావ కక్ష్యాధిపతి బుధుడైనా ద్వితీయ వివాహ అవకాశాలుంటాయి. 7వ భావ కక్ష్యాధిపతి 2,11 భాల్ని సూచించాలి.

8వ భావ కక్ష్యాధిపతి 6,11 భావాల కారకుల నక్షత్రంలో ఉంటే వివాహ సందర్భంలో కట్నరూపంలో ఆదాయం ఉంటుంది. అలా కాక ఆ గ్రహం 5,12 భావాల కారకత్వం కలిగి ఉంటే ఆ అవకాశాలు లేవు. తాను ఇచ్చుకో వలసి వస్తుంది.

వ్యాపార భాగ స్వామ్యవిషయంలో 7,10వ భావ కక్ష్యాధిపతులు 7 స్థాన కారకుడైతే భాగస్వామ్యం పనికి వస్తుంది. 7వ భావ కక్ష్యాధిపతి 5,11 భావాల సంబంధం పొందితే వారి బంధం శాశ్వతం.

7వ భావ కక్ష్యాధిపతి 6,12 భావాల కారకుడైతే భాగస్వామ్య భంగం జరుగవచ్చు. 7వ భావ కక్ష్యాధిపతి 6వ భావ కారకుడైతే అవతలి వ్యక్తి విడిపోవడానికి కారకుడౌతాడు. 12 వ భావ కారకుడైతే పృచ్ఛకుడు విడిపోవడానికి కారణమవుతాడు. 7వ భావ కక్ష్యాధిపతి శుక్రుడైతే సుముఖంగా విడిపోతారు. కుజుడైతే గొడవలు పడి విడిపోతారు. గురువైతే పరస్పరసంప్రతింపులు, చట్టపరంగా విడిపోతారు. బుధుడైతే ఇబ్బందిపడి కంతుల వారీగా లాభనష్టాలపంపకం, చెల్లింపు ఉంటుంది

ఎనిమిదవ భావము. దీనికి రంధ్ర స్థానమని, ఆయుషస్థానమని పేరు. సాధారణ

మరణము, జీవిత వయో పరిమితి, దాచి ఉంచిన ధనము, ఇన్సురెన్స్, ప్రావిడెంట్ ఫండ్, మొదలైన వాటి ద్వారా ధన ప్రాప్తి ఈ భావం వల్ల తెలుసుకో వీలౌతుంది. ఆకస్మిక క్రూర ప్రమాద ఆత్మహత్య, తత్ ద్వారా మరణ సంబంధం కూడా దీని వల్ల తెలుస్తుంది. జీవితంలో కష్టాలు అవమానాలు తిరస్కారాలు ఎనిమిదవ భావం వల్ల తెలుస్తుంది.

8వ భావకక్ష్యాధిపతి ఉన్న నక్షత్రాధిపతి బాధక, మారక స్థానాలు మరియు 8వ భావకారకత్వం పొంది కుజసంబంధం పొందితే ఆత్మహత్య అవకాశాలుంటాయి. (ప్రథమభావ వియాలను గుర్తుకు తెచ్చుకోవాలి.)

తొమ్మిదవ భావం దీనికి భాగ్య స్థానమని ధర్మ స్థానమని పేరు. పై చదువులు, పరిశోధనలు, తండ్రి అదృష్టము, ఉన్నతి,ఆధ్యాత్మిక చింతన, దైవ కార్యాలలో దేవాలయాది నిర్మాణాల్లో పాలు పంచుకోవడం, మత విషయాలలో చొరవ చూపడం, ఈ విషయాలను ఈ భావం ద్వారా తెలుసుకో వీలౌతుంది.

సాధారణ విద్యలు 4వ భావం నుండి తెలిస్తే ఉన్నతవిద్యను తెలుసుకోవడానికి నవమభావాన్ని పరిశీలించాలి. ఉన్నతవిద్యలో విజయసాధనకు లాభభావాన్ని చూడాలి. వీటి పరస్పర సంబంధం ఉన్నతవిద్యలో వృద్ధిని సూచ్చుంది. 11వ భావ కక్ష్యాధిపతి వక్రి అయితే ఉన్నతవిద్యాభ్యాసంలో ఆటంకాలుంటాయి. 6,11 భావాల సంబంధం కూడ ఉంటే ఉపకారవేతనప్రాప్తి కూడ ఉంటుంది.

4,9,12 భావాల సంబంధం విదేశాల్లో ఉన్నతవిద్యను తెలుపుతుంది. 9,11,12 భావాల సంబంధం పరిశోధనలో విజయాన్ని సూచిస్తుంది.

12వ భావంలోని గ్రహమున్న నక్షత్రాధిపతి 1,2,3,6,10,11 భావాల్లో ఉంటే విదేశాల్లో లాభావకాశాలు. తద్భిన్నంగా ఉంటే ఇబ్బందులు, నష్టాలుంటాయి.

పరిశోధనా వ్యాసాలు విజయవంతమవడానికి 9,11 విదేశాల్లో విద్యావకాశాలు 6,9,11,12 ఉపకారవేతనంతో విద్యాభ్యాసం 6,9,11 భావాల పరిశీలన వల్ల తెలియవస్తుంది.

పదవ భావం. దీనికి రాజ్యస్థానమనిపేరు. ఉద్యోగము వృత్తి, శ్రమ, వలన ధన ప్రాప్తి, ఈ భావ సంబంధిత గ్రహాల ద్వారా తెలుసుకోవచ్చు. ఉద్యోగంలో మార్పు, పదోన్నతి వేతనోన్నతి, ఇత్యాధి విషయాలను ఈ భావము తెలుపుతుంది. అధికార ప్రాప్తి, రాజ్య ప్రాప్తి, ఎన్నికలలో విజయం కూడా ఈ భావం ద్వారా తెలుసుకోవచ్చు వృత్తి, ఉద్యోగాల ద్వారా సంపాదనను తెలుసుకోవడానికి 2,6,10 భావాల్ని పరిశీలించాలి. ఆ కారకుల దశా,భుక్తి,అంతర్భుక్తి, కాలాల్లో ఉద్యోగప్రాప్తి అవకాశాలు లభించవచ్చు. ఉద్యోగంలో చోటు మార్పునకు 3,10,12 భావాల్ని పరిశీలించి చెప్పాలి. ఈ భావ కారకాల దశాది కాలాల్లో ట్రాన్స్ఫర్ లాంటివి జరుగుతాయి.

వృత్తి, ఉద్యోగాల మార్పునకు 3,5,9 భావాల పరిశీలించి గ్రహాల దశాభుక్త్యాది కాలాల్లో వృత్తి మార్పిడికి అవకాశాలున్నాయని చెప్పవచ్చు.

పోగొట్టుకొన్న ఉద్యోగంలో మరల స్థిరపడుటకు 2,6,10 భావాల్ని పరీక్షించాలి. 10 భావ కక్ష్యాధిపతి 2,6,10 భావాల కారకుడైన గ్రహ నక్షత్రంలో ఉంటే పోగొట్టుకొన్న ఉద్యోగం మరల ప్రాప్తిస్తుంది. 10 వ భావ కక్ష్యాధిపతి 1,5,9,12 భావాల కారకుని నక్షత్రంలో ఉండి 2,6,10 భావాల కారకుడు గాకుంటే మరల ఉద్యోగంలో చేర్చుకోబడే అవకాశాలు లేవు.

పదకుండవ భావము దీనికి లాభస్థానమని ఆయస్థానమనిపేరు. ఊహించని, అనుకున్న విషయాలను సాధించి విజయాన్ని పొందడం అనేది ఈ భావం ద్వారా తెలుస్తుంది. స్వయం కృషి వల్ల లాభాలు, బంధువుల ద్వారా, స్నేహితుల ద్వారా, సోదరుల ద్వారా, పొందే ప్రయోజనాలు ఈ భావం వల్ల అవగతమౌతుంది. పుస్తక ప్రచురణ, గడచిన జన్మ ఫలితాలు, ఆర్థిక లాభాల ప్రాప్తి, శత్రువులను అణిచి ఉంచడము, విద్య వాహన ప్రావ్తి, ఇత్యాదులన్ని ఈ భావం వల్ల తెలుసుకోవచ్చు.

ప్రతి విషయ పరిశీలనలో విజయసాధనకు 11 వ భావం అవసరం. రాజకీయాల్లో ప్రతిష్ఠాత్మక స్థితిని పొందాలంటే ఏకాదశ భావ కక్ష్యాధిపతి 9,10,11 భావ కారకుల నక్షత్రాల్లో ఉండి కుజ, గురు సంబంధం పొంది ఉండాలి.

పన్నెండవ భావము. ఖర్చులు, కష్టాలు, నిరాశ నిస్పృహలు, ధ్వంసాలు, పెట్టుబడులు, నష్టపోవడము, కోర్టు వ్యవహారాల్లో శిక్ష, శయ్యాసుఖము, ఆత్మ పరిశీలన, చాటుమాటు శత్రువులు, బహిరంగము గాని వ్యాపారాలు, స్త్రీలతో విరోధాలు, చెడు గ్రహాల వల్ల అర్థంకాని జబ్బులు, బాధలు, నేరారోపణలు, కారాగారవాసము, ఇత్యాది విషయాల పరిశీలనకు ఈ భావం తోడ్పడుతుంది. విదేశగమనం కూడా దీని ద్వారా తెలుసుకోవచ్చు. విదేశగమనం గురించి తెలుసుకోవడానికి 3,9,11,12 భావాల్ని స్వీకరించాలి. 11 వ భావ కక్ష్యాధిపతి 3,9,12 భావాల కారకుడైతే విదేశగమనం సూచింపబడుతుంది.

అధికారుల నుండి ప్రభుత్వం నుండి శిక్షకు గురి కావడాన్ని పరిశీలించడానికి 10 భావ కక్ష్యాధిపతి 7,8,12 భావాల కారకుడైతే ప్రభుత్వ శిక్షకు గురికావడం, అధికారం పేరు ప్రతిష్ఠలు పోగొట్టుకోవడం జరుగుతుంది.

12వ భావ కక్ష్యాధిపతి రాహువయి,వక్రిగ్రహ నక్షత్రంలో ఉండక, 2,3,8,12 భావాల కారకుడైతే కారాగార ప్రాప్తి అవకాశాలుంటాయి.

## గోచార ఫలితం

కృష్ణ మూర్తి పద్ధతిలో గోచార ఫలిత పరిశీలన కూడ కక్ష్యల ఆధారంగా జరుగుతుంది. ఒక గ్రహం ఒక రాశిలో సంచరిస్తుందనుకొందాము. ఆ సమయంలో అది ఏదో ఒక నక్షత్రంలో ఉంటుంది. ఆ నక్షత్రాధిపతియైన గ్రహం ఇవ్వవలసిన ఫలితాన్ని ఈ సంచరించే గ్రహం ఇస్తుంది. అయితే ఆ ఫలితం దేని ద్వారా జరుగుతుందో నక్షత్రాధిపతి చెపుతుంది. నక్షత్రాధిపతి ధనాదాయాన్ని సూచిస్తాడనుకొందాము. ఆ సంచరించే

గ్రహం ఐదవ భావకారకుడైనాడనుకొందాము. సంతానం ద్వారా, స్పెక్యులేషన్ ద్వారా ఆ ధనం ప్రాప్తిస్తుంది.
ఆ నక్షత్రంలో తొమ్మిది కక్ష్యలుంటాయి కదా. ఒక్కొక్క కక్ష్యకు ఒక్కొక్క గ్రహం ఆధిపత్యం వహిస్తుంది. గోచారంలో సంచరించే గ్రహం ఒక నక్షత్రంలో సంచరిస్తూ ఒక గ్రహాధిపత్యమున్న కక్ష్యలో సంచరించే సమయంలో ఆ గ్రహ భావకారకత్వాన్ని బట్టి ఫలితం మేలుకా కీడుకా అనేది నిర్ణయించాలి.
వింశోత్తరి దశను పోలికకు తీసుకున్నప్పుడు నక్షత్రాధిపతి మహాదశను సూచిస్తే కక్ష్యాధిపతి భుక్తిని సూచిస్తాడు.
క్రింద ప్రతి లగ్నంలో (మేషాదిగా) పుట్టిన వారికి వివిధ నక్షత్రాల్లో సంచరించే గ్రహాలు ఏ ఏ ఫలితాల్నిస్తాయో చూస్తాం.

మేషరాశి లగ్నంగా పుట్టిన వారి జాతకంలో అశ్విని, మఖ, మూల నక్షత్రాలకు అధిపతి కేతువు. రాశిచక్రంలో కేతువునకు ఆధిపత్యం లేనందున ఆ కేతువు ఏ రాశిలో ఉన్నాడో దాని అధిపతి లేదా ఏ నక్షత్రంలో ఉన్నాడో దాని అధిపతి భావాధిపత్యాన్ని గుర్తించాలి. గోచారంలో ఏ గ్రహమైనా సరే ఆ కేతువు సూచించే భావ ఫలితాన్నిస్తుంది.
మేషలగ్నం వారికి శుక్రుడు రెండు ఏడు భావాల అధిపతి భరణి, పుబ్బ, పూర్వాషాఢ నక్షత్రాలకు అధిపతి శుక్రుడు. ఏ గ్రహమైనా సరే ఈ మూడు నక్షత్రాల్లో సంచరించే కాలంలో ఆ జాతకుడు రెండు ఏడు భావాల ఫలితాల్ని రుచి చూపిస్తాడు.
మేష లగ్నం వారికి కృత్తిక,ఉత్తర,ఉత్తరాషాఢ నక్షత్రాలకు అధిపతియైన రవి 5 భావాధిపతి కాబట్టి ఆ నక్షత్రాలపై ఏ గ్రహం సంచరించినా 5వ భావ ఫలితాల్నిస్తాడు.
మేష లగ్నం వారికి రోహిణి, హస్త, శ్రవణం నక్షత్రాలకు అధిపతియైన చంద్రుడు చతుర్థ భావాధిపతి. కాబట్టి ఆ నక్షత్రాల్లో సంచరించే గ్రహకాలంలో చతుర్థ భావ సంబంధ ఫలితాల్నిస్తారు.
మేషలగ్నం వారికి మృగశిర, చిత్త, ధనిష్ఠ నక్షత్రాలకు అధిపతియైన కుజుడు లగ్న అష్టమాధిపతి అవుతాడు. ఈ నక్షత్రాల్లో సంచరించే గ్రహాలు ప్రధమ, అష్టమ భావ ఫలితాల్నిస్తాయి.
మేష లగ్నం వారికి ఆరుద్ర, స్వాతి, శతభిష నక్షత్రాలకు అధిపతియైన రాహువు, కేతువు వలె ఏ నక్షత్రంలో ఉన్నాడో ఆ నక్షత్ర అధిపతి లేదా ఏ రాశిలో ఉన్నాడో ఆ రాశి అధిపతి లేదా ఎవరితో కలసి ఉన్నాడో ఆ గ్రహం ఆధిపత్యాన్ని బట్టి ఆ నక్షత్రంపై సంచరించే కాలంలో ఫలితాల్నిస్తాడు.
మేష లగ్నం వారికి పునర్వసు, విశాఖ, పూర్వాభాద్ర నక్షత్రాలకు అధిపతియైన గురువు 9,12 భావాల అధిపతి కాబట్టి ఆ నక్షత్రాలపై ఏ గ్రహం సంచరించినా ఆ భావ ఫలితాల్నిస్తాడు.

మేష లగ్నం వారికి పుష్యమి, అనూరాధ, ఉత్తరాభాద్ర నక్షత్రాలకు అధిపతి యైన శని 10,11 స్థానాల అధిపతి కాబట్టి ఆ నక్షత్రాలపై సంచరించే కాలంలో ( ఏ గ్రహమైనా ) ఆ భావఫలితాల్నిస్తారు. సంచరించే గ్రహ కారకత్వాన్ని బట్టి ఉంటుంది.
మేష లగ్నం వారికి ఆశ్లేష, జ్యేష్ఠ, రేవతి నక్షత్రాలకు అధిపతియైన బుధుడు 3,6 అధిపతి కాబట్టి. ఆ నక్షత్రాలపై సంచరించే ఏ గ్రహమైనా 3,6 భావాల ఫలితాల్నిస్తాడు.

| | | | |
|---|---|---|---|
| అశ్వని, మఖ, మూల | 1,10,19 | కేతువు | ఇత్యాదిగా చూచుకొని ప్రతి లగ్నం నుండి |
| భరణి, పుబ్బ, పూర్వాషాఢ | 2,11,20 | శుక్రుడు | |
| కృత్తిక,ఉత్తర,ఉత్తరాషాఢ | 3,12,21 | రవి | |
| రోహిణి, హస్త, శ్రవణం | 4,13,22 | చంద్రుడు | |
| మృగశిర, చిత్త, ధనిష్ఠ | 5,14,23 | కుజడు | |
| ఆరుద్ర, స్వాతి, శతభిష | 6,15,24 | రాహువు | |
| పునర్వసు, విశాఖ, పూర్వాభాద్ర | 7,16,25 | గురువు | |
| పుష్యమి, అనురాధ, ఉత్తరాభాద్ర | 8,17,26 | శని | |
| ఆశ్లేష, జ్యేష్ఠ, రేవతి | 9,18,27 | బుధుడు | |

| నక్షత్రాలు | మేషం | వృ | మి | కర్ | సిం | క | తుల | వృశ్ | ధను | మక | కుం | మీ |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1,10.19 | ............................................................................ఆశ్రితగ్రహం | | | | | | | | | | | |
| 2,11.20 | 2,7 | 1,6 | 5,12 | 4,11 | 3,10 | 2,9 | 1,8 | 12,7 | 11,6 | 5,10 | 4,9 | 3,8 |
| 3,12.21 | 5,6 | 4 | 3 | 2 | 1 | 12 | 11 | 10 | 9 | 8 | 7 | 5 |
| 4,13.22 | 4 | 3 | 2 | 1 | 12 | 11 | 10 | 9 | 8 | 7 | 6 | 5 |
| 5,14,23 | 1,8 | 7,12 | 6,11 | 5,10 | 4,9 | 3,8 | 2,7 | 1,6 | 5,12 | 4,11 | 3,10 | 2,9 |
| 6,15.24 | ............................................................................ఆశ్రితగ్రహం | | | | | | | | | | | |
| 7,16,25 | 9,12 | 8,11 | 7,10 | 6,9 | 5,8 | 4,7 | 3,6 | 2,5 | 1,4 | 3,12 | 2,11 | 1,10 |
| 8,17,26 | 10,11 | 9,10 | 8,9 | 7,8 | 6,7 | 5,6 | 4,5 | 3,4 | 2,3 | 1,2 | 1,12 | 12,11 |
| 9,18.27 | 3,6 | 2,5 | 1,4 | 3,12 | 2,11 | 1,10 | 12,9 | 11,8 | 10,7 | 9,6 | 5,8 | 4,7 |

ఉదాహరణకు శని భరణిలో ఉన్నాడు. మిథునం వారికి శుక్రుడు 5,12 అధిపతి కాబట్టి శుక్రుడిచ్చే ఫలితాలనిస్తాడు. ఇష్టులకోసం, ప్రయాణాలమూలంగా, సోదరులమూలంగా వ్యయం అవుతుంది.

జ్యోతిషమార్తాండ, జ్యోతిషమన్నన్ **శ్రీ కె.ఎస్. కృష్ణమూర్తిగారు** 1908 నవంబరు 1వ తేదిన జన్మించినారు. 1972 మార్చిలో పరమపదించినారు.

వీరు జ్యోతిషాన్ని మథించి జ్యోతిషశాస్త్ర అభిమానులకు కె.పి. అమృతాన్ని అందించినారు.

హేతువాద దృక్పథంతో, శాస్త్రీయదృష్టితో, సమకాలీనజ్యోతిర్విదుల విమర్శలకు, హేళనకు గురి అయినా సంప్రదాయజ్యోతిషంలోని లోపాలను, గుర్తించి, సవరించి ఖచ్చితమైన ఫలితనిర్దేశానికి అనువైన పద్ధతిని కనుగొన్నారు.

స్వదేశవిదేశాల్లో వేనవేలు ప్రత్యక్ష, పరోక్ష శిష్యులు వీరి పథంలో పయనించి ఈ శాస్త్రం ద్వారా వివిధ వర్గాల, ఆర్తుల, బాధితుల, విపన్నుల, భవిష్యన్నిరీక్షకులకు ఊరట, ఆశ్వాసం, ప్రోత్సాహం, ప్రేరణనివ్వడానికి సమర్థులైనారు.

**ప్రశ్న జాతకవిధానంలో ఈ పద్ధతి ద్వారా ఫలితనిర్దేశం అప్రతిహతం. అనన్యసామాన్యం. నిర్దుష్టం. సందిగ్ధావస్థ ఉండదు. కుండబద్దలు కొట్టినట్లుగా వేటొకటి ముక్కలు రెండన్నట్లుగా ఖచ్చితంగా ఉంటుంది.**

దైవజ్ఞులు ఈ పుస్తకాన్ని చదివి, అధ్యయనం చేసి సులువైన, ఖచ్చితమైన రీతిలో ఫలితాలు చెప్పి జ్యోతిశ్శాస్త్ర ప్రామాణికతను నిరూపించడంలో తమవంతు సాయం అందిస్తారని కోరుకొంటూ

రచయిత
**పి.యం. గోపాలాచారి**

## ఉదాహరణలు

కృష్ణమూర్తి పద్ధతిద్వారా ఎంత సులభంగా, ఎంతఖచ్చితంగా, ఎంత చక్కగా ఫలితాలు చెప్పవచ్చో తెలుసుకోవడానికి వివిధ జ్యోతిశ్శాస్త్రజ్ఞుల రచనలను కొన్నిటిని పొందుపరుస్తున్నాను.

ఉదా 1

గుజరాత్‌లో 2007 ఫిబ్రవరిలో జరిగిన ఎన్నికలఫలితాలను 2006 డిసెంబరులోనే హైదరాబాదు వాసి ఐన శ్రీ సి. రామమూర్తిగారు కె.పి. ప్రశ్నజాతకంద్వారా విశదీకరించినారు.

గుజరాత్ రాష్ట్రశాసన సభ ఎన్నికలలో గట్టి పోటీకి నిలబడ్డ కాంగ్రెస్, బి.జె.పి.లలో గెలుపెవరిదో తెలుసుకో దలచిన వారు మన పద్ధతి ప్రకారం 1 నుండి 249 లోగా ఒక సంఖ్యను 93ను ఎన్నుకొన్నారు. వారి అభిమత ప్రశ్న "బి.జె.పి. ఎన్నికలలో గెలిచి ప్రభుత్వాన్ని స్థాపిస్తుందా?".

తేదీ.16-12-2007 సమయం. పగలు గం.10-16-45 ప్రదేశం.హైదరాబాదు.

ఒక వ్యక్తియో ఒక పార్టీయో గెలుపు సాధించాలంటే జాతకంలో ఈ పరిస్థితులుండాలి.

1. 6,11 కక్ష్యాధిపతులు వక్రత్వం పొందరాదు. అలాగే ఆ గ్రహం వక్రత్వం పొందిన గ్రహాల నక్షత్రాలలో ఉండరాదు.
2. ఆరవ కక్ష్యాధిపతి బలిష్ఠంగా 6,11 స్థానాలకు కారకుడవాలి. ఎట్టి పరిస్థితిలోను 5,12 భావాలకు కారకుడు కారాదు.
3. 11వ భావ కక్ష్యాధిపతి బలిష్ఠంగా 6,11 భావాల కారకుడవాలి. ఖచ్చితంగా 5,12 భావాల కారకుడు కారాదు.
4. 12వ భావ కక్ష్యాధిపతి 6,11 భావాల కారకుడైతే పృచ్ఛకుని వైపు గెలుపు. ఆ గ్రహం 5,12 భావాలకు కారకుడైతే విరోధికి గెలుపు.
5. లగ్నం, లగ్నాధిపతి బలంగా ఉంటే పృచ్ఛకునివైపు గెలుపు. 7వ భావం దాని అధిపతి బలంగా ఉంటే ప్రతిపక్షానికి గెలుపు.
6. కొన్ని సందర్భాలలో పృచ్ఛకుని గెలుపునకు 6,11 స్థానాలతో బాటు 1,12 స్థానాలకు కూడ కారకుడవడం జరుగుతుంది. అలాగే 5,12 స్థానాలతో బాటు 7,4 భావాలకు కారకుడు కారాదు. ఈ జాతకంలో

| గ్రహ | డిగ్రీలు | రాశి | నక్ష | కక్ష్య | గ్రహ కారకాలు |
|---|---|---|---|---|---|
| రవి | 239.57 | కుజ | బుధ | శని | 1,2,4,11 |
| చం | 314.37 | శని | రాహు | కేతు | 6,7,12 |
| కుజ | 72.06 | బుధ | రాహు | శని | 4,6,9,10 |

| | | | | | |
|---|---|---|---|---|---|
| బుధ | 239.09 | కుజ | బుధ | శని | 2,4,11 |
| గురు | 245.31 | గురు | కేతు | కుజ | 4,5,8,12 |
| శుక్ర | 198.39 | శుక్ర | రాహు | చం | 3,6,10 |
| శని | 134.41 | రవి | శుక్ర | శుక్ర | 1,3,6,7,10 |
| రాహు | 306.18 | శని | కుజ | చం | 4,6,9,10 |
| కేతు | 126.18 | రవి | కేతు | రాహు | 12 |

| భావ | రాశి | డిగ్రీలు | రాశి | నక్ష | కక్ష్య | భావకారకాలు |
|---|---|---|---|---|---|---|
| 1 | సింహ | 13.20 | రవి | శుక్ర | శుక్ర | రవి,శని |
| 2 | కన్య | 12.14 | బుధ | చం | రాహు | రవి,బుధ |
| 3 | తుల | 13.06 | శుక్ర | రాహు | బుధ | శుక్ర,శని |
| 4 | వృశ్చి | 14.01 | కుజ | శని | రాహు | రవి,కుజ,బుధ,రాహు |
| 5 | ధను | 14.06 | గురు | శుక్ర | శుక్ర | గురు |
| 6 | మకర | 13.48 | శని | చం | రాహు | చం,కుజ,శుక్ర,శని,రాహు |
| 7 | కుంభ | 13.20 | శని | రాహు | బుధ | చం,శని |
| 8 | మీన | 12.14 | గురు | శని | కుజ | గురు |
| 9 | మేష | 13.06 | కుజ | కేతు | బుధ | కుజ,రాహు |
| 10 | వృష | 14.01 | శుక్ర | చం | గురు | కుజ,శుక్ర,శని,రాహు |
| 11 | మిథు | 14.06 | బుధ | రాహు | బుధ | రవి,బుధ |
| 12 | కర్క | 13.48 | చం | శని | రాహు | చం,గురు,కేతు |

ఇక జాతకాన్ని పరిశీలిద్దాము. ఇందు 6వ భావ కక్ష్యాధిపతి రాహువు. ఆరవ భావంలో ఉన్నాడు. అతడు 5,12 భావాల్ని సూచించడం లేదు. 7వ భావానికి బలహీన కారకుడైనాడు. ఆరవభావాధిపతియైన శనిచే చూడబడుతున్నాడు. లగ్నంలోనే బలిష్ఠంగా ఉన్నాడు. అందుచే ఆరవభావకక్ష్యాధిపతిగా రాహువు 6వ భావానికి బలిష్ఠకారకుడైనాడు. ఇక 11వ భావ కక్ష్యాధిపతిని పరిశీలిస్తాము. 2,11 స్థానాల అదిపతి ఐన బుధుడు 11వ భావ కక్ష్యాధిపతియై 4వ భావంలో ఉన్నాడు. స్వనక్షత్రంలో శని కక్ష్యలో ఉన్నాడు. ఆ శని లగ్నంలో, ఆరవభావాధిపతిగా ఉన్నాడు. ఈవిధంగా బుధుడు 6,11 భావాల కారకుడైనాడు. ఈ రెండు కారణాలను బట్టి పృచ్ఛకుని అభిమతం సఫలమయ్యే అవకాశాలు గానవస్తున్నాయి.

ఇక ప్రతిపక్షం వైపునుండి చూస్తాము. 12 వ కక్ష్యాధిపతి కూడ రాహువే. ఈ గ్రహం ఇంతకు ముందు పేర్కొన్నట్లుగా 6,11 భావాల్ని సూచిస్తున్నాడు. అంటే ప్రతిపక్షానికి 12, 5 భావాల కారకుడన్నమాట. ప్రతిపక్షానికి 11వ భావం 5వ భావం అవుతుంది. 5వ భావ కక్ష్యాధిపతి శుక్రుడు. అతడు 3,10 భావాలకధిపతి. 3వ భావంలో, రాహువు నక్షత్రంలో, చంద్ర కక్ష్యలో ఉన్నాడు. ఆ చంద్రుడు 12వ భావాధిపతిగా 7వ భావంలో ఉన్నాడు. ఈ విధంగా 7,12 భావాల సంబంధం కానవస్తుంది.

| | | | | | |
|---|---|---|---|---|---|
| బుధ | 239.09 | కుజ | బుధ | శని | 2,4,11 |
| గురు | 245.31 | గురు | కేతు | కుజ | 4,5,8,12 |
| శుక్ర | 198.39 | శుక్ర | రాహు | చం | 3,6,10 |
| శని | 134.41 | రవి | శుక్ర | శుక్ర | 1,3,6,7,10 |
| రాహు | 306.18 | శని | కుజ | చం | 4,6,9,10 |
| కేతు | 126.18 | రవి | కేతు | రాహు | 12 |

| భావ | రాశి | డిగ్రీలు | రాశి | నక్ష | కక్ష్య | భావకారకాలు |
|---|---|---|---|---|---|---|
| 1 | సింహ | 13.20 | రవి | శుక్ర | శుక్ర | రవి,శని |
| 2 | కన్య | 12.14 | బుధ | చం | రాహు | రవి,బుధ |
| 3 | తుల | 13.06 | శుక్ర | రాహు | బుధ | శుక్ర,శని |
| 4 | వృశ్చి | 14.01 | కుజ | శని | రాహు | రవి,కుజ,బుధ,రాహు |
| 5 | ధను | 14.06 | గురు | శుక్ర | శుక్ర | గురు |
| 6 | మకర | 13.48 | శని | చం | రాహు | చం,కుజ,శుక్ర,శని,రాహు |
| 7 | కుంభ | 13.20 | శని | రాహు | బుధ | చం,శని |
| 8 | మీన | 12.14 | గురు | శని | కుజ | గురు |
| 9 | మేష | 13.06 | కుజ | కేతు | బుధ | కుజ,రాహు |
| 10 | వృష | 14.01 | శుక్ర | చం | గురు | కుజ,శుక్ర,శని,రాహు |
| 11 | మిథు | 14.06 | బుధ | రాహు | బుధ | రవి,బుధ |
| 12 | కర్క | 13.48 | చం | శని | రాహు | చం,గురు,కేతు |

ఇక జాతకాన్ని పరిశీలిద్దాము. ఇందు 6వ భావ కక్ష్యాధిపతి రాహువు. ఆరవ భావంలో ఉన్నాడు. అతడు 5,12 భావాల్ని సూచించడం లేదు. 7వ భావానికి బలహీన కారకుడైనాడు. ఆరవభావాధిపతియైన శనిచే చూడబడుతున్నాడు. లగ్నంలోనే బలిష్ఠంగా ఉన్నాడు. అందుచే ఆరవభావకక్ష్యాధిపతిగా రాహువు 6వ భావానికి బలిష్ఠకారకుడైనాడు. ఇక 11వ భావ కక్ష్యాధిపతిని పరిశీలిస్తాము. 2,11 స్థానాల అదిపతి ఐన బుధుడు 11వ భావ కక్ష్యాధిపతియై 4వ భావంలో ఉన్నాడు. స్వనక్షత్రంలో శని కక్ష్యలో ఉన్నాడు. ఆ శని లగ్నంలో, ఆరవభావాధిపతిగా ఉన్నాడు. ఈవిధంగా బుధుడు 6,11 భావాల కారకుడైనాడు. ఈ రెండు కారణాలను బట్టి పృచ్ఛకుని అభిమతం సఫలమయ్యే అవకాశాలు గానవస్తున్నాయి.

ఇక ప్రతిపక్షం వైపునుండి చూస్తాము. 12 వ కక్ష్యాధిపతి కూడ రాహువే. ఈ గ్రహం ఇంతకు ముందు పేర్కొన్నట్లుగా 6,11 భావాల్ని సూచిస్తున్నాడు. అంటే ప్రతిపక్షానికి 12, 5 భావాల కారకుడన్నమాట. ప్రతిపక్షానికి 11వ భావం 5వ భావం అవుతుంది. 5వ భావ కక్ష్యాధిపతి శుక్రుడు. అతడు 3,10 భావాలకధిపతి. 3వ భావంలో, రాహువు నక్షత్రంలో, చంద్ర కక్ష్యలో ఉన్నాడు. ఆ చంద్రుడు 12వ భావాధిపతిగా 7వ భావంలో ఉన్నాడు. ఈ విధంగా 7,12 భావాల సంబంధం కానవస్తుంది.

ఈ పరిశీలన ద్వారా తేలేదేమంటే ఎన్నికలలో బి.జె.పి. తప్పక విజయాన్ని సాధిస్తుంది. ఇది నిజమైంది.

ఉదా:- 2

మరొక జ్యోతిర్విదుని పరిశీలనా పటిమ ద్వారా కె.పి. ప్రాభవాన్ని పరికించండి. తే 28.4.2007 దిన క్రికెట్ వరల్డ్ కప్ ఫైనల్ పోటీలో శ్రీలంక ఆస్ట్రేలియాలు ఎదురెదురుగా నిలచినాయి. జాఫ్నామేన్ అనే జ్యోతిశ్శాస్త్రజ్ఞుడు లండన్ నుండి 173 సంఖ్యను తీసుకొని 27.4.2007 22.59 జాతక చక్రం తయారు చేసి ఫలితాలను ఈ క్రింది విధంగా ఇచ్చినాడు.

| | | గ్రహస్థితి | | | | గ్రహకారకత్వాలు | |
|---|---|---|---|---|---|---|---|
| గ్రహ | రాశి | డిగ్రీలు | రాశి | నక్ష | కక్ష్య | గ్రహము | కారకత్వం |
| రవి | మేష | 13.23 | కుజ | శుక్ర | శుక్ర | రవి | 2,7,8,9,11 |
| చంద్ర | సింహ | 24.23 | రవి | శుక్ర | బుధ | చంద్ర | 2,8,9,10,11 |
| కుజ | కుంభ | 22.39 | శని | గురు | శని | కుజ | 3,5,6,7,8 |
| బుధ | మేష | 7.23 | కుజ | కేతు | రాహు | బుధ | 1,7,11,12 |
| గురు | వృశ్చి | 25.10 | కుజ | బుధ | రాహు | గురు | 1,3,6,7,12 |
| శుక్ర | వృష | 24.26 | శుక్ర | కుజ | రాహు | శుక్ర | 2,3,5,8,9 |
| శని | కర్క | 24.20 | చంద్ర | బుధ | రాహు | శని | 1,4,5,7,10,12 |
| రాహు | కుంభ | 21.7 | శని | గురు | గురు | రాహు | 3,5,6,7 |
| కేతు | సింహం | 21.7 | రవి | శుక్ర | గురు | కేతు | 2,8,9,11 |

| భావస్థితి | | | | | | | భావకారకత్వాలు |
|---|---|---|---|---|---|---|---|
| భావ | రాశి | డిగ్రీలు | రాశి | నక్ష | కక్ష్య | భావం | కారకత్వం |
| 1 | కన్య | 26.06 | బుధ | కుజ | గురు | 1 | బు,గు,శని |
| 2 | తుల | 22.14 | శుక్ర | గురు | శని | 2 | ర,చం,శు,కే |
| 3 | వృశ్చి | 24.46 | కుజ | బుధ | రాహు | 3 | కు,గు,శు,రా |
| 4 | మకర | 2.29 | శని | రవి | గురు | 4 | శ |
| 5 | కుంభ | 7.13 | శని | రాహు | రాహు | 5 | కు,శు,శ,రా |
| 6 | మీన | 4.50 | గురు | శని | శని | 6 | కు,గు,రా |
| 7 | మీన | 26.6 | గురు | బుధ | గురు | 7 | ర,కు,బు,గు,శ,రా |
| 8 | మేష | 22.14 | కుజ | శుక్ర | శని | 8 | ర,చం,కు,శు,కే |
| 9 | వృష | 24.46 | శుక్ర | కుజ | రాహు | 9 | ర,చం,శు,కే |
| 10 | కర్క | 2.29 | చంద్ర | గురు | రాహు | 10 | చం,శ |
| 11 | సింహ | 7.13 | రవి | కేతు | రాహు | 11 | ర,చం,బు,కే |
| 12 | కన్య | 4.50 | బుధ | రవి | శని | 12 | బు,గు,శ |

ఇచ్చుట 1,6,11 భావాల కక్ష్యాధిపతులు ఇరువర్గాల వారికి సమానులే. ప్రథమ భావ

కక్ష్యాధిపతి గురువు. 6వ భావ కక్ష్యాధిపతి శని. 11వ భావ కక్ష్యాధిపతి రాహువు. ఐతే ఈ 11వ భావ కక్ష్యాధిపతి 5వ భావ కారకుడైనాడు. ఈ 5వ భావమనేది ఆస్ట్రేలియావారికి 11వ భావం, శ్రీలంక వారికి 12 వ భావం అవుతుంది.(6నకు 5వది 12 కదా).

శ్రీలంకవారి 1,6,11 భావాల ఉపకక్ష్యాధిపతులు వరుసగా గురు,కుజ,శుక్రులు. శుక్రుడు కుజుని నక్షత్రంలో, కుజుడు గురువు నక్షత్రంలో ఉండినా గురువునకు శుక్రునితో సంబంధం లేదు.

ఆస్ట్రేలియా వారి 1 (7), 6(12), 11(5) భావాల ఉపకక్ష్యాధిపతులు వరుసగా గురు,రాహు,గురువులు. రాహువు గురువు ఉన్న కక్ష్యాధిపతి అయినాడు. అందుచే పరస్పర సంబంధం కలదు.

శ్రీలంక పక్షంలో 11వ భావ ఉప కక్ష్యాధిపతి శుక్రుడు 5,3,8,9,2, భావాల కారకుడై శుభఫలితాన్నివ్వడం లేదు.

ఆస్ట్రేలియా వారి 11వ భావ ఉపకక్ష్యాధిపతి 7,3,1,12,6,7 భావాలకు కారకుడైనాడు. ఇది వారివిజయానికి బలమైన సూచకం. గురువు ఉన్న కక్ష్యాధిపతి అయిన రాహువు 5వ భావ కారకుడైనాడు. అది ఆస్ట్రేలియాకు 11వ భావం అవుతుంది. ఇది కూడ వారి విజయానికి తోడు అవుతుంది.

| కారకులు | శ్రీలంక | ఆస్ట్రేలియా |
|---|---|---|
| 1 | గురు, శని, బుధ | గురు,శని,రవి,బుధ,కుజ(7) |
| 6 | కుజ, గురు | గురు,శని,బుధ (12) |
| 11 | బుధ, చంద్ర,రవి,కేతు | శుక్ర,రాహు,కుజ,శని (5) |

7వ భావం ఆస్ట్రేలియాకు మొదటిభావం అవుతుంది. అచటినుండి మిగిలిన భావాల్ని లెక్కించాలి.

ఆ సమయంలో ఆధికారిక గ్రహాలు శని,కుజ,శుక్ర,రవి,రాహువులు. ఈ గ్రహాలన్నీ ఆస్ట్రేలియా వైపు కారకులుగా కానవస్తారు. శ్రీలంక వైపు మూడే గ్రహాలున్నాయి. జరిగే దశావిదశా,అంతర్విదశాదులు ఈ గ్రహాలకే చెంది ఉన్నాయి. శుక్ర,బుధ,శుక్ర,శుక్ర. శుక్రుడు ఆస్ట్రేలియా వారికి మాత్రమే కారకుడు. ఈ కారణంగా ఆస్ట్రేలియావారికే విజయావకాశాలు. ఇది 27వ తేదీననే నిర్ణయింపబడినదని గమనించాలి. నిజానికి 28వ తేదీన ఆస్ట్రేలియా పోటీలో నెగ్గినది. మేడం సేండీ క్రోతర్ గారి జూపిటర్ వెబ్ సైట్ ద్వారా ఏర్పాటైన 'అస్ట్రాలజీ గ్రూప్' నందు ఈ వ్యాసాన్ని చూడవచ్చు.

ఉదా:- 3

20 20 ప్రపంచ కప్ క్రికెట్ పోటీలో ఇండియా గెలుస్తుందా? అని ప్రశ్నించుకొని శ్రీ హెచ్.ఎస్. నాగి గారు లూధియానాలో 24.9.2007 న ఉ. 9.52 గంటలకు 1-249 నడుమ 17 ను ఎన్నుకొని జాతకచక్రం తయారు చేసుకొని ఫలితాన్ని శ్రీ సేండీ క్రోతర్ గారి 'అస్ట్రాలజీ గ్రూప్' మెయిల్స్ లో పోటీ జరగడానికి ముందే ప్రకటించినారు. ఇచ్చట

కూడ పై ఉదాహరణలో విధంగా సూచకాలు స్వీకరించాలి.

ఆరవభావ కక్ష్యాధిపతి 6,10,11 స్థానాల కారకుడైతే పోటీల్లో, కోర్టు కేసుల్లో గెలుపు తథ్యం. ఈ జాతకంలో ఆరవభావకక్ష్యాధిపతి రాహువు. అతడు 11వ భావంలో, స్వ నక్షత్రంలో ఉండి 11వ భావ కారకుడైనాడు. అందువల్ల ఇండియా తప్పక గెలుస్తుంది. అలాగే గెలిచింది.

గ్రహస్థితి గ్రహకారకత్వాలు

| గ్రహ | రాశి | డిగ్రీలు | రాశి | నక్ష | కక్ష్య | గ్రహము | కారకత్వం |
|---|---|---|---|---|---|---|---|
| రవి | కర్క | 0.49 | చంద్ర | గురు | కుజ | రవి | 1,4,6,9,10 |
| చంద్ర | సింహ | 9.17 | రవి | కేతు | గురు | చంద్ర | 5,6 |
| కుజ | మేష | 22.16 | కుజ | శుక్ర | శని | కుజ | 2,3,6,8,9 |
| బుధ | మిథు | 11.6 | బుధ | రాహు | శని | బుధ | 4,7,12 |
| గురు | వృశ్చి | 16.41 | కుజ | బుధ | బుధ | గురు | 1,4,7,9,10 |
| శుక్ర | సింహ | 7.15 | రవి | కేతు | రాహు | శుక్ర | 3,6,8 |
| శని | సింహ | 0.17 | రవి | కేతు | కేతు | శని | 5,6,11,12 |
| రాహు | కుంభ | 13.47 | శని | రాహు | బుధ | రాహు | 12 |
| కేతు | సింహ | 13.47 | రవి | శుక్ర | శుక్ర | కేతు | 3,6,8 |

భావస్థితి భావకారకత్వాలు

| భావ | రాశి | డిగ్రీలు | రాశి | నక్ష | కక్ష్య | భావం | కారకత్వం |
|---|---|---|---|---|---|---|---|
| 1 | మీన | 11.00 | గురు | శని | చంద్ర | 2 | ర,గు |
| 2 | మేష | 18.14 | కుజ | శుక్ర | రాహు | 3 | కు |
| 3 | వృష | 14.44 | శుక్ర | చంద్ర | శని | 4 | కు,శు,కే |
| 4 | మిథు | 9.10 | బుధ | రాహు | గురు | 4 | ర,బు,గు |
| 5 | కర్క | 3.01 | చంద్ర | గురు | రాహు | 5 | చం,శ |
| 6 | సింహ | 1.54 | రవి | కేతు | శుక్ర | 6 | ర,చం,కు,శు,శ,కే |
| 7 | కన్య | 11.00 | బుధ | చంద్ర | చంద్ర | 7 | బు,గు |
| 8 | తుల | 18.14 | శుక్ర | రాహు | చంద్ర | 8 | కు,శు,కే |
| 9 | వృశ్చి | 15.44 | కుజ | శని | గురు | 9 | ర,కు,గు |
| 10 | ధను | 9.10 | గురు | కేతు | గురు | 10 | ర,గు |
| 11 | మకర | 3.1 | శని | రవి | శని | 11 | శ |
| 12 | కుంభ | 1.54 | శని | కుజ | కేతు | 12 | బు,శ,రా |

## ఉదా 4

గడచిన సంవత్సరం 2007న భారతదేశంలో అధ్యక్ష పదవికి పోటీ జరిగింది. ముఖ్య

శుక్రుని నక్షత్రంలో ఉన్నాడు. అది ప్రతి పక్షానికి 12వ భావం అవుతుంది. ఈ విధంగా ఎన్నికలు బి.జె.పి.కి సాధకంగా లేవు.
ఆ తర్వాత ఎన్నికలు జరిగి కాంగ్రెస్ అభ్యర్థి అయిన శ్రీమతి ప్రతిభా పాటిల్ గెలిచినట్లు ప్రకటించబడఅందరికి తెలిసిందే. ఓట్ల విశ్లేషణలో క్రాస్ ఓటింగు జరిగినది కూడ గుర్తించవచ్చు.

ఉదా:- 5 మాజీ పాకిస్తాన్ ప్రధాని బేనజీర్ భుట్టో దారుణహత్యకు గురి అవుతారా?
తమదేశానికి తిరుగుప్రయాణం కట్టిన శ్రీమతి బేనజీర్ భుట్టోపై హత్యా ప్రయత్నాలు జరుగుతాయనే మాట ప్రచారంలో ఉండినది. అది జరిగి ఆమె మరణిస్తారా అనే ప్రశ్న శ్రీ కనకబోస్మియా గారి మనసులో ఉదయించింది. వెంటనే వారు కృష్ణమూర్తి పద్ధతిద్వారా ఫలితాన్ని తెలుసుకోదలచి తే 16.10.2007 దిన పగలు 1.20.43 గంటలకు అహ్మదాబాదులో 1-249 నడుమ 76 ను ఎన్నుకొని జాతకచక్రం తయారు చేసి పరిశీలించిన తర్వాత ఫలితాన్ని ఈక్రిందివిధంగా వివరించినారు.

| | | గ్రహస్థితి | | | | గ్రహకారకత్వాలు | |
|---|---|---|---|---|---|---|---|
| గ్రహ | రాశి | డిగ్రీలు | రాశి | నక్ష | కక్ష్య | గ్రహము | కారకత్వం |
| రవి | కన్య | 28.42 | బుధ | కుజ | శని | రవి | 2,3,5,10,11 |
| చంద్ర | వృశ్చి | 24.26 | కుజ | బుధ | రాహు | చంద్ర | 1,3,5,12 |
| కుజ | మిధున | 13.04 | బుధ | రాహు | బుధ | కుజ | 5,7,10,11 |
| బుధ | తుల | 14.04 | శుక్ర | రాహు | బుధ | బుధ | 3,7,12 |
| గురు | వృశ్చి | 22.49 | కుజ | బుధ | చంద్ర | గురు | 3,5,6,9,12 |
| శుక్ర | సింహం | 12.50 | రవి | కేతు | బుధ | శుక్ర | 1,4,11 |
| శని | సింహం | 11.11 | రవి | కేతు | శని | శని | 1,7,8 |
| రాహు | కుంభ | 12.01 | శని | రాహు | శని | రాహు | 7 |
| కేతు | సింహం | 12.01 | రవి | కేతు | బుధ | కేతు | 1 |

| భావస్థితి | | | | | | | భావకారకత్వాలు |
|---|---|---|---|---|---|---|---|
| భావ | రాశి | డిగ్రీలు | రాశి | నక్ష | కక్ష్య | భావం | కారకత్వం |
| 1 | కర్క | 18.33 | చంద్ర | బుధ | కేతు | 1 | చం,శు,శ,కే |
| 2 | సింహ | 14.17 | రవి | శుక్ర | శుక్ర | 2 | ర |
| 3 | కన్య | 13.42 | బుధ | చంద్ర | రాహు | 3 | ర,చం,బు,గు |
| 4 | తుల | 15.54 | శుక్ర | రాహు | శుక్ర | 4 | శు |
| 5 | వృశ్చి | 18.20 | కుజ | బుధ | బుధ | 5 | ర,చం,కు,గు |
| 6 | ధను | 19.14 | గురు | శుక్ర | రాహు | 6 | గు |
| 7 | మకర | 18.33 | శని | చంద్ర | బుధ | 7 | కు,బు,శ,రా |
| 8 | కుంభ | 14.17 | శని | రాహు | బుధ | 8 | శ |

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 9 | మీన | 13.41 | గురు | శని | రాహు | 9 | గు |
| 10 | మేష | 15.54 | కుజ | శుక్ర | రవి | 10 | ర,కు |
| 11 | వృష | 18.20 | శుక్ర | చంద్ర | బుధ | 11 | ర,కు,శు |
| 12 | మిథు | 19.14 | బుధ | రాహు | కుజ | 12 | చ,బు,గు |

ఈ విషయంలో 8,12 భావాలు దారుణమైన మరణాన్ని సూచిస్తాయి. 8,12 భావాల కక్ష్యాధిపతులు 8,12 భావాల కారకులైతే దారుణహత్య, ప్రమాదాలవల్ల మరణం ఇత్యాదులు ఫలమవుతుంది. ఆ 8,12 భావాలు బాధక మారక సంబంధాలు పొందితే హత్యనుండి తప్పించుకొనే అవకాశాలుండవు. 1,5,9,11 భావాల సంబంధం పొందితే (చరలగ్నానికి 11 బాధకం) బ్రతికి బయట పడవచ్చు.

అప్పటి జాతకాన్ని పరిశీలిస్తాము. 8వ భావ కక్ష్యాధిపతి బుధుడు. రాహువు నక్షత్రంలో తన కక్ష్యలో ఉన్నాడు. ఆ బుధుడు 3,12 భావాల కధిపతి. 3వ ఇంట ఉన్నాడు. అతడున్న నక్షత్రాధిపతి 7వ ఇంట ఉన్న రాహువు నక్షత్రంలో ఉన్నాడు. 7,8 అధిపతియై లగ్నంలో ఉన్న శని యొక్క రాశిలో ఆ రాహువు సొంతకక్ష్యలో ఉన్నాడు.

పైవిధంగా 8వభావ కక్ష్యాధిపతి 8,12 భావాలకు, మారకవిషయాలకు కారకుడైనాడు. 12వ భావ కక్ష్యాధిపతి కుజుడు. అతడు రాహువు నక్షత్రంలో బుధుని కక్ష్యలో ఉన్నాడు. 5,10 స్థానాలకు అధిపతి అయి 11వ ఇంట ఉన్న కుజుడు 7వ భావంలో ఉన్న రాహువు నక్షత్రంలోను, ఆ రాహువు 7,8 అధిపతియై లగ్నంలో ఉన్న శని రాశిలోను, 3,12 భావాల అధిపతియై 3వ భావంలో ఉన్న బుధుని కక్ష్యలో ఉన్న కారణంగా 12వ భావ కక్ష్యాధిపతి కూడ మారకభావాన్ని, 8,12 భావాల్ని సూచిస్తున్నాడు.
ఇక దశ, విదశాదుల్ని పరిశీలిద్దాము. ఇప్పుడు జరుగుతున్న దశ బుధదశ. రాహువిదశ. రాహువు స్వనక్షత్రంలో శని కక్ష్యలో ఉన్నాడు. ఈ రాహుభుక్తి 29.11.2009 వరకు నడుస్తుంది. ఈ కాలంలోగా చెడు జరిగే అవకాశాలెక్కువ. 2007 డిసంబరు 27న సుమారు 18.16 సమయంలో రావల్పిండిలో దారుణహత్య గావింపబడినది.

జరిగిన సంఘటనపై విచారణ.

21.12.2007న దశాభుక్త్యాదులు బుధ,రాహు,గురు,చంద్రదశలు. బుధ రాహువులకు ఈ సంఘటనతో గల సంబంధం ఇంతకు ముందే వివరింపబడింది. ఇక గురు, చంద్రులకున్న అధికారమేమిటో చర్చిద్దాము. గురువు బుధుని నక్షత్రంలో చంద్రుని కక్ష్యలో ఉన్నాడు. చంద్రుడు బుధుని నక్షత్రంలో రాహువు కక్ష్యలో ఉండడం వీరిద్దరికి 12,7,2,8 భావాల ఫలితాన్నివ్వడంలో శక్తతను చూపుతోంది. ఈవిధంగా మరొకమారు కృష్ణమూర్తి పద్ధతి సామర్థ్యం నిరూపింపబడినది.

ఉదా:- 6

వివాహం జరిగి విడాకులు తీసుకొన్న వ్యక్తి జాతకాన్ని పరిశీలిస్తాము. పుట్టిన తేది. 8.12.1971. సమయం 12.55 పగలు. స్థలం బొబ్బిలి. ఇది జన్మజాతకం. సంఖ్య అవసరం లేదు.

| | | గ్రహస్థితి | | | | గ్రహకారకత్వాలు | |
|---|---|---|---|---|---|---|---|
| గ్రహ | రాశి | డిగ్రీలు | రాశి | నక్ష | కక్ష్య | గ్రహము | కారకత్వం |
| రవి | వృశ్చి | 22.10 | కుజ | బుధ | రవి | రవి | 4,6,7,9 |
| చంద్ర | సింహ | 06.59 | రవి | కేతు | రాహు | చంద్ర | 5,6 |
| కుజ | కుంభ | 24.59 | శని | గురు | బుధ | కుజ | 1,2,9,10,12 |
| బుధ | ధను | 02.26 | గురు | కేతు | శుక్ర | బుధ | 4,5,7,9 |
| గురు | వృశ్చి | 23.38 | కుజ | బుధ | కుజ | గురు | 1,4,7,9,10 |
| శుక్ర | ధను | 18.03 | గురు | శుక్ర | కుజ | శుక్ర | 3,8,10 |
| శని | వృష | 08.39 | శుక్ర | రవి | శుక్ర | శని | 2,6,9,11,12 |
| రాహు | మకర | 13.08 | శని | చంద్ర | రాహు | రాహు | 5,6,11 |
| కేతు | కర్క | 13.08 | చంద్ర | శని | రాహు | కేతు | 2,5,11,12 |

| భావస్థితి | | | | | | | భావకారకత్వాలు |
|---|---|---|---|---|---|---|---|
| భావ | రాశి | డిగ్రీలు | రాశి | నక్ష | కక్ష్య | భావం | కారకత్వం |
| 1 | మీన | 08.04 | గురు | శని | కేతు | 1 | కు,గు |
| 2 | మేష | 13.13 | కుజ | కేతు | బుధ | 2 | కు,శ,కే |
| 3 | వృష | 12.10 | శుక్ర | చంద్ర | రాహు | 3 | శు |
| 4 | మిథు | 07.40 | బుధ | రాహు | రాహు | 4 | ర,బు,గు |
| 5 | కర్క | 03.17 | చంద్ర | గురు | రాహు | 5 | చం,బు,రా,కే |
| 6 | సింహ | 02.35 | రవి | కేతు | శుక్ర | 6 | ర,చ,శ,రా |
| 7 | కన్య | 08.04 | బుధ | రవి | శుక్ర | 7 | ర,బు,గు |
| 8 | తుల | 13.13 | శుక్ర | రాహు | బుధ | 8 | శు |
| 9 | వృశ్చి | 12.10 | కుజ | శని | కుజ | 9 | ర,కు,బు,గు,శ |
| 10 | ధను | 07.40 | గురు | కేతు | గురు | 10 | కు,గు,శు |
| 11 | మకర | 03.17 | శని | రవి | శని | 11 | శ,రా,కే |
| 12 | కుంభ | 02.35 | శని | కుజ | కేతు | 12 | కు,శ,కే |

వివాహం జరగడానికి 2,5,7,11భావాల్ని, విడి పోవడానికి 1,4,6,10 భావాల్ని పరిశీలించాలి. సంబంధిత గ్రహాలు పై రెండు విషయాలకు భావాలకు కారకులైతే వివాహం జరిగి విడిపోవడం కూడ జరుగుతుంది.

1. వివాహం జరగడానికి 7వ భావ కక్ష్యాధిపతి 2,5,7,11 భావాలకు కారకుడవాలి.
2. 7వ భావ కక్ష్యాధిపతి 1,4,6,10 భావాల కారకుడైతే వివాహం జరుగదు.

3. 7వ భావ కక్ష్యాధిపతి 2,5,7,11 భావాలతో బాటు 1,4,6,10 భావాలకు కూడ కారకుడైతే వివాహం జరిగి విడిపోవడం కూడ జరుగవచ్చు.
4. 11వ భావ కక్ష్యాధిపతి 2,5,7,11 భావాల కారకుడైతే వైవాహిక జీవితం సుఖమయంగా ఉంటుంది. 4,6,8,10,12 భావాల సంబంధం వైవాహికజీవితంలో ఇబ్బందుల్ని, పరస్పర అవగాహన లేకపోవడం, కష్టపరంపరలుంటాయి. మాటిమాటికి విడిపోవడం జరుగుతుంది.

ఈ జాతకంలో 7వ భావ కక్ష్యాధిపతి, కళత్రకారకుడైన శుక్రుడు 7వ భావాధిపతి బుధునితో కలసి ఉన్నాడు. 5వ భావంలో ఉన్న కేతువు నక్షత్రంలో ఉన్నాడు. ఆ కేతువు 6వ ఇంట ఉన్న చంద్రునికి ప్రతినిధి అవుతాడు. ఇక శుక్రుని చూస్తాము. అతడు 3,4,8 భావాలకు అధిపతి. 10వ ఇంటిలో ఉన్నాడు. ఈవిధంగా శుక్రుడు 3,4,8,10 భావాల కారకుడైనాడు. 7వ భావాధిపతియై రవితో కలసిన బుధుడు 3,4,5,7,8,10 భావాల కారకుడైనాడు. ఈవిధంగా వివాహం జరగడం, విడిపోవడం రెండింటికి ఇచ్చుట అవకాశాలు కానవస్తున్నాయి.

ఇక 11వ భావ కక్ష్యాధిపతి పరిస్థితిని పరిశీలిద్దాము. 11వ భావ కక్ష్యాధిపతి శని. అతడు ప్రథమ, వ్యయ భావాలకు అధిపతి. శుక్రుని కక్ష్యలో ఉన్నాడు. ఈ కారణంగా 1,12,3,4,8,10 భావాల కారకుడైనాడు. అందుచే ఈ వ్యక్తికి సుఖమయమైన వైవాహికజీవితం లభించని అవకాశాలే ఎక్కువ.

వివాహ కాలాన్ని పరిశీలిద్దాము. 19.5.1996 న వివాహం జరిగినది. అప్పుడు రవిదశ, కుజవిదశ, శని అంతర్విదశ నడుస్తుంది. దశాధిపతి ఐన రవి 7వభావాధిపతి. 5వ భావాధిపతి ఐన బుధుని నక్షత్రంలో ఉన్నాడు. భుక్తి అధిపతి యైన కుజుడు 2,9 భావాలకు అధిపతి. లగ్నంలో, 11వ అధిపతి అయిన గురువు నక్షత్రంలో ఉన్నాడు. అలాగే అంతర్విదశ అధిపతి అయిన శని 9వ ఇంట ఉన్న 7వ అధిపతి అయిన రవి నక్షత్రంలో ఉన్నాడు. ఈ విధంగా సరియైన (వివాహసూచక గ్రహాల దశాది) సమయంలో వివాహం జరిగింది.

వివాహమైన పదిరోజుల్లోనే విడిపోవడం జరిగింది. దానికి కారణం సంబంధిత గ్రహాలు బలిష్ఠంగా 10,4,8 స్థానాల్ని సూచించడమే.

మరల కలుసుకో గలరా అని పరిశీలిస్తే 2,1,7,11 భావాల సంబంధం ఉన్న దశాభుక్తులకాలం రావాలి. తర్వాత వచ్చే రాహు,గురు,శని భుక్తులు 2,5,7,11 భావాల్ని సూచించడం లేదు. ఆ తర్వాత వచ్చే భుక్త్యధిపతులు బుధ,కేతు శుక్రులు ప్రోత్సాహమివ్వడం లేదు. ఆ తర్వాత వచ్చే దశాధిపతి చంద్రుడు కూడ మరల సమాగమాన్ని అనుగ్రహించడం లేదు.

జైపూరు నుండి శ్రీ డా.వై.ఎస్.మూర్తి గారి 2001 కె.పి. యియర్ బుక్‌లో ప్రచురిత వ్యాస సారాంశము.

ఉదా:- 7 తప్పిపోయిన వ్యక్తి గురించి పరిశీలన

డా. కవిత అనే వ్యక్తి కానరాకపోవడం గురించి అన్ని టి.వి. లలో వివిధరీతుల్లో ప్రకటనలు, పరిశీలనలు, అభిప్రాయవ్యక్తీకరణలు జరుగుతున్న తరుణంలో కృష్ణమూర్తి పద్ధతిలో నిష్ణాతులైన శ్రీ కనకబోస్మియా గారు కృష్ణమూర్తి పద్ధతిలో ప్రశ్న జాతకం తయారు చేసి ఆధికారిక గ్రహాల ఆధారంగా ఫలితనిర్ణయం చేసారు. ఆ తీరు ఎంత ఖచ్చితంగా ఉందో చూడండి. తీసుకొన్న సంఖ్య 76 (1-249)ః పరిశీలనా కాలం25-12-2006ః సమయం 9.32.31ః స్థలం అహ్మదాబాదు.

తప్పి పోయిన వ్యక్తి తిరిగి తప్పక రాగలడని చెప్పాలంటే ప్రశ్నజాతకంలో 11వ భావ కక్ష్యాధిపతి 2,8,11 భావాల్ని తప్పక సూచించాలి. అంటే ఆ భావాలకు కారకుడవాలి. ఇచ్చట 11వ భావ కక్ష్యాధిపతి బుధుడు. కేతువు నక్షత్రంలో, శుక్రుని కక్ష్యలో ఉన్నాడు. బుధుడు 3,12 భావాల అధిపతి. 5వ భావంలో ఉన్నాడు. కేతువు 2వ భావంలో శనితో కలసి ఉన్నాడు. ఆ శని 7,8 భావాల అధిపతి శుక్రుడు 4,11 భావాల అధిపతిగా 6లో ఉన్నాడు.

| | | గ్రహస్థితి | | | | గ్రహకారకత్వాలు | |
|---|---|---|---|---|---|---|---|
| గ్రహ | రాశి | డిగ్రీలు | రాశి | నక్ష | కక్ష్య | గ్రహము | కారకత్వం |
| రవి | ధను | 9.21 | గురు | కేతు | శని | రవి | 2,5 |
| చంద్ర | కుంభ | 7.28 | శని | రాహు | రాహు | చంద్ర | 1,7,8 |
| కుజ | వృశ్చి | 19.38 | కుజ | బుధ | శుక్ర | కుజ | 3,5,10,12 |
| బుధ | ధను | 1.54 | గురు | కేతు | శుక్ర | బుధ | 2,3,5,12 |
| గురు | వృశ్చి | 12.54 | కుజ | శని | రాహు | గురు | 1,4,6,7,8,9 |
| శుక్ర | ధను | 23.37 | గురు | శుక్ర | శని | శుక్ర | 4,6,11 |
| శని | సింహం | 0.52 | రవి | కేతు | శుక్ర | శని | 1,2,7,8 |
| రాహు | కుంభ | 25.23 | శని | గురు | బుధ | రాహు | 4,6,8,9 |
| కేతు | సింహం | 25.23 | రవి | శుక్ర | బుధ | కేతు | 2,4,6,11 |

| భావస్థితి | | | | | | | భావకారకత్వాలు |
|---|---|---|---|---|---|---|---|
| భావ | రాశి | డిగ్రీలు | రాశి | నక్ష | కక్ష్య | భావం | కారకత్వం |
| 1 | కర్క | 18.33 | చంద్ర | బుధ | కేతు | 1 | చం,గు,శ |
| 2 | సింహ | 14.17 | రవి | శుక్ర | శుక్ర | 2 | ర,బు,శ,కే |
| 3 | కన్య | 13.41 | బుధ | చంద్ర | రాహు | 3 | కు,బు |
| 4 | తుల | 15.54 | శుక్ర | రాహు | శుక్ర | 4 | గు,శు,రా,కే |
| 5 | వృశ్చి | 18.20 | కుజ | బుధ | బుధ | 5 | ర,కు,బు |
| 6 | ధను | 19.14 | గురు | శుక్ర | రాహు | 6 | గు,శు,రా,కే |
| 7 | మకర | 18.33 | శని | చంద్ర | బుధ | 7 | చం,గు,శ |
| 8 | కుంభ | 14.17 | శని | రాహు | బుధ | 8 | చం,గు,శ,రా |

| 9 | మీన | 13.41 | గురు | శని | రాహు | 9 | గు,రా |
|---|---|---|---|---|---|---|---|
| 10 | మేష | 15.54 | కుజ | శుక్ర | రవి | 10 | కు |
| 11 | వృష | 18.20 | శుక్ర | చంద్ర | బుధ | 11 | శు,కే |
| 12 | మిథు | 19.14 | బుధ | రాహు | కుజ | 12 | కు,బు |

ఈ విధంగా 11వ భావ కక్ష్యాధిపతి 2,8,11 స్థానాల్ని సూచించడం వలన ఆమె తప్పక తిరిగి వస్తారు. తిరిగి వచ్చే విషయాన్ని పరిశీలించే ముందు ఆరోగ్య, ఆయుర్దాయవిషయాల్ని పరిశీలించాలి. మొదటగా లగ్న కక్ష్యాధిపతిని పరిశీలిద్దాము. లగ్నాధిపతి కేతువు. అతడు 7,8 భావాల అధిపతియై లగ్నభావంలో ఉండే శనితో కలసి 2వ భావంలో ఉన్నాడు. శుక్రుడు 4,11 భావాల అధిపతియై ఆరవభావంలో ఉన్నాడు. లగ్న కక్ష్యాధిపతి మారక స్థానానికి, శుక్రుడు బాధక స్థానానికి కారకుడైనాడు. ఈ సంబంధంవల్ల మరణావకాశాలెక్కువ. ఇక జరిగే దశల విషయం పరిశీలిద్దాము. 3,11 భావాల కారకుల దశాభుక్తి అంతర్భుక్తుల్లో తిరిగి రావడమనేది జరుగుతుంది. 3,11 భావ కారకులు
కుజ,బుధ,శుక్ర,రాహు,కేతువులు. వీరిలో ఎవరిని స్వీకరించాలన్నప్పుడు ఆధికారిక గ్రహాలు సాయమందిస్తాయి.
అప్పటి ఆధికారిక గ్రహాలు శని,చంద్ర,రాహు, కేతువులు. జరిగే దశ,విదశ,అంతర్విదశ, సూక్ష్మ దశలు---
రాహు-రాహు-శని-రాహు 2.1.2007 వరకు. పైవిషయాలు 2.1.2007 లోగా ఆమె తిరిగి వస్తుంది. కాని మృతగా. అలాగే ఆమె తేబడింది.

ఉదా:- 8 **రాజాజీ**

మనదేశంలోనే గాక విదేశాల్లో కూడ పేరు ప్రతిష్ఠలు సంపాదించిన భారతదేశీయ నాయకుడు శ్రీ చక్రవర్తి రాజగోపాలాచారిగారి మరణసమయాన్ని (ఆఖరిశ్వాస పీల్చుకొనే) ఆధికారిక గ్రహాల ఆధారంగా ముందుగానే నిశ్చయించడం ఎలా జరిగిందో ఆర్.పి. అండ్ కె.పి. అనే పుస్తకంలో చూడవచ్చు. ఆ పుస్తకంలో ఇది 12వ వ్యాసం. (64వ పేజీలో). శ్రీ కె. సుబ్రహ్మణ్యంగారు మరియు శ్రీ కె. హరిహరన్ గారు ప్రచురించిన ఈ గ్రంథంలో కె.పి. లో ప్రముఖులైన 24 మంది జ్యోతిష్కుల 41 వ్యాసాలు చోటు చేసుకొన్నాయి. ఈ వ్యాస రచయితయొక్క స్నేహితుడొకడు "రాజాజీ గారి పరిస్థితి చాల ఆందోళనకరంగా ఉంది " అని రేడియో వార్త విని 25.12.72 న మిత్రుని కలసి జ్యోతిష రీత్యా పరిస్థితి ఎలా ఉందో పరిశీలించమని కోరినాడు. అప్పుడు మధ్యాహ్నం 3:26. వెంటనే ఆ సమయానికి జాతక చక్రం తయారు చేయడం జరిగింది.

| | | గ్రహస్థితి | | | | గ్రహకారకత్వాలు | |
|---|---|---|---|---|---|---|---|
| గ్రహ | రాశి | డిగ్రీలు | రాశి | నక్ష | కక్ష్య | గ్రహము | కారకత్వం |
| రవి | ధను | 10.20 | గరు | కేతు | శని | రవి | 2,5,8 |
| చంద్ర | సింహ | 16.32 | రవి | శుక్ర | చంద్ర | చంద్ర | 1,4,6,7 |
| కుజ | వృశ్చి | 03.02 | కుజ | గురు | రాహు | కుజ | 6,7,8,912 |
| బుధ | వృశ్చి | 21.45 | కుజ | బుధ | రవి | బుధ | 2,3,7 |
| గురు | ధను | 22.54 | గురు | శుక్ర | శని | గురు | 1,6,7,8,9 |
| శుక్ర | వృశ్చి | 14.53 | కుజ | శని | రాహు | శుక్ర | 1,6,7,10,11 |
| శని | వృష | 22.23 | శుక్ర | చంద్ర | శుక్ర | శని | 1,4,10,11 |
| రాహు | ధను | 23.28 | గురు | శుక్ర | శని | రాహు | 1,6,7,8 |
| కేతు | మిథు | 23.28 | బుధ | గురు | శని | కేతు | 2,8,9 |

| భావస్థితి | | | | | | | భావకారకత్వాలు |
|---|---|---|---|---|---|---|---|
| భావ | రాశి | డిగ్రీలు | రాశి | నక్ష | కక్ష్య | భావం | కారకత్వం |
| 1 | వృష | 07.00 | శుక్ర | రవి | కేతు | 1 | చం,గు,శు,శ,రా |
| 2 | మిథు | 04.00 | బుధ | కుజ | శుక్ర | 2 | ర,బు,కే |
| 3 | మిథు | 29.49 | బుధ | గురు | చంద్ర | 3 | బు |
| 4 | కర్క | 27.31 | చంద్ర | బుధ | గురు | 4 | చం,శ |
| 5 | సింహ | 29.04 | రవి | రవి | కుజ | 5 | ర |
| 6 | తుల | 03.29 | శుక్ర | కుజ | శుక్ర | 6 | చం,కు,గు,శు,రా |
| 7 | వృశ్చి | 07.00 | కుజ | శని | బుధ | 7 | చం,కు,బు,గు,శు,రా |
| 8 | ధను | 04.00 | గురు | కేతు | చంద్ర | 8 | ర,కు,గు,రా,కే |
| 9 | ధను | 29.49 | గురు | రవి | రాహు | 9 | కు,గు,కే |
| 10 | మకర | 27.31 | శని | కుజ | గురు | 10 | శు,శ |
| 11 | కుంభ | 29.04 | శని | గురు | రవి | 11 | శు,శ |
| 12 | మేష | 03.29 | కుజ | కేతు | రవి | 12 | కు |

లగ్నంలో సహజ పాపి గ్రహం శని ఉన్నాడు. లగ్న నక్షత్రాధిపతి అష్టమంలో పడి అష్టమాధిపతి గురువుతో రాహువుతో కలసి ఉన్నాడు. గురువునకు బాధక స్థానాధిపత్యం కూడ వచ్చినది. లగ్నాధిపతి, లగ్న కక్ష్యాధిపతి, చంద్రనక్షత్రాధిపతి అయిన శుక్రుడు మారక స్థానంలో ఉన్నాడు. దినాధిపతి చంద్రుని అష్టమాధిపతి, బాధకాధిపతి చూస్తున్నాడు. ఈ గ్రహస్థితి ఎట్టిపరిస్థితుల్లోను రోగి కోల్కొనే సూచనలనివ్వడంలేదు. ఇచ్చట రవి,గురు,రాహు,శుక్ర,కుజ,బుధులు బలిష్ఠ కారక గ్రహాలు.
జాతక పరిశీలనారంభ కాలంలో లగ్నం వృషభం. దాని అధిపతి శుక్రుడు. లగ్న నక్షత్రాధిపతి రవి. బుధుని రాశి అయిన మిథునంలో రాహు నక్షత్రంలో లగ్నోదయ

సమయం అంటే సుమారు సాయంకాలం 5.30 అప్పుడు రాజాజీ గారు తుది శ్వాస పీల్చవచ్చు అని తీర్మానించడమైనది. 25.12.72 నాడు సాయం కాలం 5.40 సమయానికి శ్రీ రాజాజీ గారి ప్రాణ వాయువు అనంతాకాశంలో కలసి పోయిందని రేడియో ప్రసారం వెలువడింది. ఆధికారిక గ్రహాల ఆధారంగా ఖచ్చితంగా ఫలితనిర్ణయం చేయ వచ్చు అనడానికి ఇదొక ఉదాహరణం.

**ఉదా:- 9 పదోన్నతి**

ఉద్యోగంలో పదోన్నతికి సంబంధించిన ప్రశ్నకు సమాధానం ఫలితనిర్ణయం ఎంత ఖచ్చితంగా జరిగిందో క్రింది ఉదాహరణ ద్వారా తెలుసుకొనవచ్చు. R P & K P పుస్తకంలో 68వ పేజీలో చూడండి.

ఒక వ్యక్తి తన మిత్రునకు ఉద్యోగరీత్యా పదోన్నతి ఎప్పుడని ప్రశ్నించగా ఈ జ్యోతిష వ్యాసకర్త 10-5-1974 న సాయంత్రం 6.05 సమయంలో జాతకచక్రం తయారు చేయడం జరిగింది.

| గ్రహస్థితి | | | | | | గ్రహకారకత్వాలు | |
|---|---|---|---|---|---|---|---|
| గ్రహ | రాశి | డిగ్రీలు | రాశి | నక్ష | కక్ష్య | గ్రహము | కారకత్వం |
| రవి | మేష | 26.04 | కుజ | శుక్ర | కేతు | రవి | 1,5,7,8,11 |
| చంద్ర | ధను | 13.47 | గురు | శుక్ర | శుక్ర | చంద్ర | 1,2,5,8,10 |
| కుజ | మిథు | 18.41 | బుధ | రాహు | చంద్ర | కుజ | 2,7,8 |
| బుధ | వృష | 03.01 | శుక్ర | రవి | శని | బుధ | 7,9,11,12 |
| గురు | కుంభ | 19.28 | శని | రాహు | కుజ | గురు | 2,3,4,6 |
| శుక్ర | మీన | 12.55 | గురు | శని | రాహు | శుక్ర | 1,4,5,8 |
| శని | మిథు | 08.40 | బుధ | రాహు | గురు | శని | 2,4,5,8 |
| రాహు | వృశ్చి | 26.10 | కుజ | బుధ | గురు | రాహు | 2,7,9,12 |
| కేతు | వృష | 26.10 | శుక్ర | కుజ | గురు | కేతు | 2,7,8 |

| భావస్థితి | | | | | | | భావకారకత్వాలు |
|---|---|---|---|---|---|---|---|
| భావ | రాశి | డిగ్రీలు | రాశి | నక్ష | కక్ష్య | భావం | కారకత్వం |
| 1 | తుల | 22.05 | శుక్ర | గురు | శని | 1 | ర,చం,శు |
| 2 | వృశ్చి | 21.11 | కుజ | బుధ | శుక్ర | 2 | చం,కు,గు,శ,రా,కే |
| 3 | ధను | 20.30 | గురు | శుక్ర | గురు | 3 | గు |
| 4 | మకర | 21.06 | శని | చంద్ర | శుక్ర | 4 | గు,శు,శ |
| 5 | కుంభ | 22.53 | శని | గురు | శని | 5 | ర,చం,శు,శ |
| 6 | మీన | 23.51 | గురు | బుధ | కుజ | 6 | గు |
| 7 | మేష | 22.05 | కుజ | శుక్ర | శని | 7 | ర,కు,బు,రా,కే |
| 8 | వృష | 21.11 | శుక్ర | చంద్ర | శుక్ర | 8 | ర,చం,కు,శు,శ,కే |
| 9 | మిథు | 20.30 | బుధ | గురు | గురు | 9 | బు,రా |

| 10 | కర్క | 21.06 | చంద్ర | బుధ | శుక్ర | 10 | చం |
|---|---|---|---|---|---|---|---|
| 11 | సింహ | 22.53 | రవి | శుక్ర | శని | 11 | ర,బు |
| 12 | కన్య | 23.51 | బుధ | కుజ | కుజ | 12 | బు,రా |

అప్పటి ఆధికారిక గ్రహాలు. దినాధిపతి, లగ్నాధిపతి, చంద్రనక్షత్రాధిపతి శుక్రుడు. రాశ్యధిపతి, లగ్న నక్షత్రాధిపతి గురువు. ఈవిధంగా గురు శుక్రులు బలిష్ఠ కారకులైనారు. ఉద్యోగంలో పదోన్నతి తద్వారా ధనాదాయమధికమవడం 2,6,10,11 భావాల పరిశీలనద్వారా బయటపడుతుంది.

ఆధికారిక గ్రహాలకు ప్రశ్న సంబందిత భావాలతో సంబంధాలు కానవస్తే తప్పక ఆ ప్రశ్న ఫలవంతమవుతుందని

వందలకొలది ప్రశ్నజాతకాలద్వారా నాకు అవగతమైంది. అప్పటి జాతకాన్ని పరిశీలిద్దాము.

ఆరవ భావంలోని శుక్రుడు 120 డి.ల కోణ దృష్టితో 10వ భావాన్ని చూస్తున్నాడు. 6వ భావాధిపతి గురువు ద్వితీయాధిపతిని, లాభభావాన్ని, లగ్నాన్ని చూస్తున్నాడు. ఈ విధంగా గురు శుక్రులు (ఆధికారిక గ్రహాలు) 2,6,10,11 సంబంధాన్ని పొంది ఉన్నాయి. అందుచే తప్పక పదోన్నతి అవకాశాలున్నాయని చెప్పవచ్చు. ఈ సమయంలో గురూజీ కె.ఎస్.కె. గారి సూచనలను గుర్తుకు తెచ్చుకొంటాము.

1. జాతకపరిశీలన మొదులిడిన సమయంలోని ఆధికారిక గ్రహాలు ఫలితానుభవం జరిగే సమయంలో
   ఆ సెన్సిటివ్ పాయింట్స్‌ని స్పృశిస్తాయి.
2. రవి చంద్రులు, ఆధికారిక గ్రహాలతో బాటు ఆ సెన్సిటివ్ పాయింట్స్ వద్దకు వచ్చే సమయం పనులు నెరవేరుతాయి.

నా అభి ప్రాయంలో ఆ సంబంధిత భావాధిపతులు రాశిచక్రంలో ఆ సెన్సిటివ్ పాయింట్సుకు వచ్చినా సత్ఫలితాలుంటాయి. పై విధంగా పరిశీలించి ఆ మిత్రునికి రెండుమార్లు పదోన్నతి అవకాశాలున్నట్లు, అందులో ఒకటి అతి త్వరలో, మరొకటి ఆలస్యంగా జరుగవచ్చని చెప్పాను. 1974 జూన్ చివరివారంలో ఒక ప్రమోషన్ వచ్చినట్లు చెప్పినాడు. మొదటిది సాధారణంగా జరిగినా రెండవది ప్రమాదకారణంగా జరుగుతుందని చెప్పిన నేను కృష్ణమూర్తిగారు చెప్పిన రీతిలో పదోన్నతి విధానాలను గుర్తుకు తెచ్చుకొన్నాను. పదోన్నతికి కారకుడైన గ్రహం బుధుడైతే పై అధికారి వేరు చోటికి వెళ్లడం వలన, శని అయితే పై అధికారి మరణం వలన ఏర్పడిన ఖాళీని భర్తీ చేసే రీతిలో, గురువు ఐతే శాఖను విస్తరించడం మూలాన పదోన్నతి జరుగవచ్చు. ఇందుకు ఖాళీ ఏర్పడడానికి తోడ్పడే 9వ భావాధిపతి ఎవరనేది గుర్తించాలి. ఇచ్చట 9వ భావాధిపతి బుధుడు. ఆ భావంలో శని కుజులున్నారు. అది వాయుతత్వం గల

ఉభయరాశి. వాయు యాన ప్రమాదం వల్ల ఆ ఖాళీ ఏర్పడవచ్చు. ఇది విని నా మిత్రుడు ఆశ్చర్య చకితుడు, ఆలోచనా పరుడు ఐనాడు.

2.1.1975 నాడు ఆ పై అధికారి విమాన ప్రమాదానికి గురి అయినాడు. 4.1.75 న నామిత్రుని మిత్రునికి పదోన్నతి జరిగినది. ఈ విధంగా ఖచ్చితంగా చెప్పగలగడం కె.ఎస్.కె. గారి చలవ. నక్షత్రాధారిత ఫలిత నిర్ణయం వారు పెట్టిన భిక్ష. ఈ పద్ధతి లో ఫలితనిర్ణయం తప్పుగావడం అంటూ జరుగదు.

**ఉదా:- 10 నివేశన స్థలం-గృహం కొనుగోలు**

ఈ వ్యాసం 2007 అక్టోబరు నెలలో శ్రీ కనకబోస్మియా గారి ఈ మేగజైన్‌లో వెలువడిన వ్యాసం. వ్యాసకర్త హైదరాబాదు వాసి శ్రీ విశ్వనాథ్‌నాయరుగారు.

తన సోదరుడు నివేశనస్థలం కొనుగోలు విషయమై తనను ప్రశ్నించగా 1-249 లోగా ఒక సంఖ్యను కోరుకోమన్నారు. వారు టపీమని 187ను ఎన్నుకొన్నారు. ఆ సంఖ్యకు తే20.6.2007 దిన 20.35 గం.లకు హైదరాబాదులో ప్రశ్న జాతకం తయారు చేయడం జరిగింది.

| | | గ్రహస్థితి | | | | గ్రహకారకత్వాలు | |
|---|---|---|---|---|---|---|---|
| గ్రహ | రాశి | డిగ్రీలు | రాశి | నక్ష | కక్ష్య | గ్రహము | కారకత్వం |
| రవి | మిథు | 05.03 | బుధ | కుజ | రవి | రవి | 3,4,6,8.11 |
| చంద్ర | సింహ | 13.32 | రవి | శుక్ర | శుక్ర | చంద్ర | 5,7,8,10 |
| కుజ | మేష | 03.01 | కుజ | కేతు | రవి | కుజ | 3,4,8,11 |
| బుధ | మిథు | 16.57 | బుధ | రాహు | శుక్ర | బుధ | 2,6,7,9 |
| గురు | వృశ్చి | 19.13 | కుజ | బుధ | కేతు | గురు | 1,3,6,7,9,11,12 |
| శుక్ర | కర్క | 19.52 | చంద్ర | బుధ | శుక్ర | శుక్ర | 5,6,7,9,10 |
| శని | కర్క | 27.25 | చంద్ర | బుధ | గురు | శని | 2,6,7,9 |
| రాహు | కుంభ | 15.48 | శని | రాహు | శుక్ర | రాహు | 2 |
| కేతు | సింహ | 15.48 | రవి | శుక్ర | రవి | కేతు | 5,7,8,10 |

| | | భావస్థితి | | | | భావకారకత్వాలు | |
|---|---|---|---|---|---|---|---|
| భావ | రాశి | డిగ్రీలు | రాశి | నక్ష | కక్ష్య | భావం | కారకత్వం |
| 1 | ధను | 28.26 | గురు | రవి | కుజ | 1 | గు |
| 2 | కుంభ | 02.23 | శని | కుజ | కేతు | 2 | బు,శ,రా |
| 3 | మీనం | 07.30 | గురు | శని | కేతు | 3 | ర,కు,గు |
| 4 | మేషం | 09.34 | కుజ | కేతు | శని | 4 | ర,కు |
| 5 | వృష | 07.15 | శుక్ర | రవి | కేతు | 5 | చం,శు,కే |
| 6 | మిథు | 02.29 | బుధ | కుజ | కేతు | 6 | ర,బు,గు,శు,శ |
| 7 | మిథు | 28.26 | బుధ | గురు | శుక్ర | 7 | చం,బు,గు,శు,శ,కే |

| 8 | సింహ | 02.23 | రవి | కేతు | శుక్ర | 8 | ర,చం,కు,కే |
|---|---|---|---|---|---|---|---|
| 9 | కన్య | 07.30 | బుధ | రవి | కేతు | 9 | బు,గు,శు,శ |
| 10 | తుల | 09.34 | శుక్ర | రాహు | బుధ | 10 | చం,శు,కే |
| 11 | వృశ్చి | 07.15 | కుజ | శని | బుధ | 11 | ర,కు,గు |
| 12 | ధను | 02.29 | గురు | కేతు | శుక్ర | 12 | గు |

మొదటగా ప్రశ్న ఎంతవరకు తన మనోభావాన్ని తెలుపుతుందో చూస్తాము. మనః కారకుడు చంద్రుడు శుక్రుని నక్షత్రంలో శుక్రుని కక్ష్యలో ఉన్నాడు. 8వ భావం మననుండి డబ్బు పోవడాన్ని సూచిస్తుంది. శుక్రుడు శనితో కలసి ఉన్నాడు. ఆ శని 4వ భావ కక్ష్యాధిపతి. 7వ భావకారకుడైనాడు శుక్రుడు. ఈ విధంగా చంద్రుని ద్వారా ఈ ప్రశ్న పృచ్ఛకుని మనోగతం సరి అయినదే అని తెలుసుకొన్నాము.

కృష్ణమూర్తి పద్ధతిననుసరించి 4వ భావ కక్ష్యాధిపతి 2,4,8,11,12 భావాలతో కుజునితో సంబంధాన్ని పొందితే జాతకుడు భూమి,నివేశనస్థలం,గృహం ఇత్యాదుల్ని కొనుగోలు చేయడం జరుగుతుంది.

ఈ భావకారకుల దశ,విదశ,అంతర్విదశా కాలాల్లో, గోచారం కూడ చక్కగా సూచన నిచ్చే కాలంలో ఈ పని రూపు దాలుస్తుంది.

6వ భావం కూడ చోటు చేసుకొంటే ఋణసాయంతో ఆ పని జరుగుతుంది. గురు బుధుల సంబంధం ఉంటే ఆ ఋణసాయం బ్యాంకులు, ఫైనేన్స్ సంస్థల ద్వారా, రవి సంబంధం ఉంటే ప్రభుత్వ సంస్థల ద్వారా ఋణసాయమందుతుంది.

ఇక ఈ జాతకాన్ని పరిశీలిస్తాము. శని 4వ భావ కక్ష్యాధిపతి. కుజుడు నాల్గవ భావాధిపతి. పరస్పర వీక్షణ కల్గి ఉన్నారు. శని రెండవ భావాధిపతి. ఈ విధంగా 2,4 భావాలు, కుజ సంబంధం కాన వస్తుంది. బుధ శనులు ఆశ్రితగ్రహ రూపంలో ఆరవ భావంతో సంబంధం పొందియున్నారు. కాబట్టి ఋణసాయంతో ఈ పని జరుగుతుంది. ఆ బుధుడు రవితో కలసి ఉన్నాడు కాబట్టి ప్రభుత్వ సంస్థ ఋణసాయంతో ఋణప్రాప్తి తద్వారా కొనుగోలు జరిగే అవకాశం కానవస్తుంది.

7వ భావ కక్ష్యాధిపతి ఎదుటి వ్యక్తిని తెలియజేస్తాడు. ఇచ్చట శుక్రుడు 7వ భావ కక్ష్యాధిపతియై శనితో కలసి ఉన్న కారణంగా ఈ పని జరగడంలో ఎదుటివ్యక్తి సంబంధం సూచితమైంది.

8వ భావంలోని చంద్రుడు శుక్రుని నక్షత్రంలో ఉండి ఎదుటి వ్యక్తికి ధనం అందించడాన్ని సూచిస్తున్నాడు. అంటే కొనుగోలుదారుని చేతినుండి అమ్మకందారునకు డబ్బు అందుతుంది అని అర్థం.

11వ భావ సంబంధం కూడ ఈ పరిశీలనలో కాన వస్తుంది. 4వ భావ కక్ష్యాధిపతి అయిన శని 11వ భావాధిపతియైన కుజుని నేరుగా వీక్షిస్తున్నాడు.

గృహం/స్థలం కోసం ధనవినియోగం (డబ్బు పోగొట్టుకోవడం) 12 వ భావం ద్వారా

తెలుస్తుంది. 12వ భావాధిపతి గురువు బుధుని నక్షత్రంలో కుజుని రాశిలో ఉన్నాడు. శని బుధుని నక్షత్రంలో, గురువు కక్ష్యలో ఉన్నాడు. ఈ విధంగా శనికి 12వ భావ సంబంధం కానవస్తుంది. అందుచే చేతినుండి డబ్బు పోవడం సూచితమైంది. ఆచరణలోకి వచ్చే సమయం. అప్పటి దశావిదశాదులు. శుక్ర-శుక్ర-శుక్ర. చంద్రశుక్రుల సంబంధం చక్కగా 2,8 భావాలతో ముడిపడి ఉన్న కారణంగా శుక్రదశాకాలంలోనే ఈ కొనుగోలు జరుగవచ్చు. గురువు 11,12 భావాల సంబంధం అతని సూక్ష్మ ప్రాణ దశాకాలంలో పని జరుగవచ్చని సూచిస్తుంది. బుధశనుల సంబంధం కూడ ఉన్నందున శు-శు-శు-బు-గు దశాసమయంలో కొనుగోలు జరిగింది. అది 2007 ఆగస్టు 20వ తేదీన ఎ.ఐ.సి. సంస్థ ద్వారా ఈ ఋణం లభించింది. శని సంబంధం వల్ల పని జరిపించుకోవడంలో శ్రమాధిక్యత ఉండినది.
ఈ విధంగా 1-249 లోగా సంఖ్యను తీసుకొని ప్రశ్న జాతకం తయారు చేసి ఫలితనిర్ణయం చేయడం ఎంత ఖచ్చితంగా ఉంటుందో మరొకమారు నిరూపితమైంది.

ఉదా:- 11

నా మిత్రులక్షైంటు చి.సౌ. సుమతి గారు తమ విదేశ గమనాన్ని గురించి ప్రశ్నించి 1-249 లో 34 వ సంఖ్యను కోరుకున్నారు. 28.01.2008 నాడు ఉదయం 10.06.32 సమయంలో నెల్లూరులో జాతక చక్రం తయారు చేసి ఫలిత నిర్ణయం చేయడం జరిగింది. ( శ్రీ ఎం.ఆర్. ప్రసాద్.)

| | | గ్రహస్థితి | | | | గ్రహకారకత్వాలు | |
|---|---|---|---|---|---|---|---|
| గ్రహ | రాశి | డిగ్రీలు | రాశి | నక్ష | కక్ష్య | గ్రహము | కారకత్వం |
| రవి | మకర | 05.36 | శని | రవి | బుధ | రవి | 4,8 |
| చంద్ర | మిథున | 04.00 | బుధ | కుజ | శుక్ర | చంద్ర | 1,3,7,12 |
| కుజ | మిథున | 00.57 | బుధ | కుజ | బుధ | కుజ | 1,7,12 |
| బుధ | మకర | 24.02 | శని | కుజ | కుజ | బుధ | 1,2,5,7,9,12 |
| గురు | ధను | 13.28 | గురు | శుక్ర | శుక్ర | గురు | 1,6,7,8,11 |
| శుక్ర | ధను | 01.02 | గురు | కేతు | శుక్ర | శుక్ర | 1,3,6,7 |
| శని | సింహ | 13.48 | రవి | శుక్ర | శుక్ర | శని | 1,4,6,7,9,10 |
| రాహు | కుంభ | 04.08 | శని | కుజ | శుక్ర | రాహు | 1,7,9,12 |
| కేతు | సింహ | 04.08 | రవి | కేతు | చంద్ర | కేతు | 3 |

| | | భావస్థితి | | | | భావకారకత్వాలు | |
|---|---|---|---|---|---|---|---|
| భావ | రాశి | డిగ్రీలు | రాశి | నక్ష | కక్ష్య | భావం | కారకత్వం |
| 1 | వృష | 17.46 | శుక్ర | చంద్ర | బుధ | 1 | చం,కు,బు,గు,శు,శ,రా |
| 2 | మిథున | 13.46 | బుధ | రాహు | బుధ | 2 | బు |

| 3 | కర్క | 09.38 | చంద్ర | శని | శుక్ర | 3 | చం,శు,కే |
|---|---|---|---|---|---|---|---|
| 4 | సింహ | 08.12 | రవి | కేతు | గురు | 4 | ర,శ |
| 5 | కన్య | 10.44 | బుధ | చంద్ర | చంద్ర | 5 | బు |
| 6 | తుల | 15.09 | శుక్ర | రాహు | కేతు | 6 | గు,శు,శ |
| 7 | వృశ్చి | 17.46 | కుజ | బుధ | బుధ | 7 | చం,కు,బు,గు,శు,శ,రా |
| 8 | ధను | 13.46 | గురు | శుక్ర | శుక్ర | 8 | ర,గు |
| 9 | మకర | 09.38 | శని | రవి | శుక్ర | 9 | బు,శ,రా |
| 10 | కుంభ | 08.12 | శని | రాహు | రాహు | 10 | శ |
| 11 | మీన | 10.44 | గురు | శని | రవి | 11 | గు |
| 12 | మేష | 15.09 | కుజ | శుక్ర | శుక్ర | 12 | చం,కు,బు,రా |

తొలుతగా విదేశగమనవకాశాలున్నాయా అని పరిశీలిద్దాము. 12 భావ కక్ష్యాధిపతి శుక్రుడు. అతడు వక్రిగా లేడు. వక్రిగ్రహ నక్షత్రంలో లేడు. అతడున్న నక్షత్రం కేతువు. అతనికెప్పుడు వక్రత్వం లేదు. ఆ శుక్రుడు 3,9 భావాల కారకుడైనాడు. అందుచే విదేశగమన అవకాశాలు చక్కగా ఉన్నాయని చెప్పవచ్చు.

ప్రయాణ అవకాశాలు త్వరలోనా ఆలస్యమా? 11వ భావ కక్ష్యాధిపతి రవి శీఘ్రగామి. కన్యలోనున్న మరొక శీఘ్రగామి అయిన చంద్రుడు 11 వ భావాన్ని వీక్షిస్తున్నాడు. అయినా ఆలస్యం జరిగే సూచనలున్నాయి. ఎందుకంటే 11 వ భావాధిపతి గురువు నిదానంగా చరించే గ్రహం. 12 వ భావాధిపతి కుజుడు 30.01.2008 వరకు వక్రత్వాన్ని వీడడు.

ఇప్పుడు జరుగుతున్న దశ చంద్ర- శుక్ర-రాహు 2.11.2007 - 2.2.2008 వరకు. అంతర్భుక్తి అధిపతి రాహువు వక్రి ఐన కుజుని నక్షత్రంలో ఉన్నాడు. ఆ కుజుడు చంద్రుని శుక్రుని చూస్తున్నాడు. ఆ కారణంగా ఈ సమయంలో ఈ కార్యం జరుగదు. గురువు 8 వ భావ సంబంధం పొందడం వల్ల మానసిక ఆందోళన, పని జరుగుతుందా జరుగదా అనే డోలయమానత్వం ఉంటుంది.
అప్పటి అధికారికి గ్రహాల్ని పరిశీలిద్దాము.
లగ్న గురు, శని, రాహు చంద్ర బుధ,చంద్ర,శుక్ర వారాధిపతి చంద్రుడు

రవి, కుజ, కేతువులు కూడ వీరి సంబంధాన్ని పొందడం వల్ల ఆధికారికా గ్రహాలైన్నాయి. వీరిలో బలిష్టులు, మరియు ప్రవర్తన మాన దశాధిపతులు ఫలితాన్నిస్తారు. 2.2.2008 వరకు అవకాశం లేదని ముందే అనుకొన్నాము. ఆ తరువాత గురువు అంతర్భుక్తి అది 22.04.2008 వరకు సాగుతుంది.

దశాధిపతి, భుక్తి అధిపతి, అంతర్భుక్తిఅధిపతి చంద్ర శుక్రులు గురువులు. వారు 3,11,12 భావాల సూచకులు. అందుచే వీరిని ముఖ్య కారకులుగా స్వీకరింపవచ్చు. ఈ సమయంలో విదేశగమనం జరుగవచ్చునని తీర్మానించవచ్చు. ఆ పై సూక్ష్మ దశకు వెళదాము. గురువునకు 8 వ భావ సంబంధం, శని వక్రిగా ఉండడం వల్ల వారి సూక్ష్మంలో జరుగదు. ఆ పై బుధుని సూక్ష్మ దశ, అది 25.02.2008 నుండి 07.03.2008 వరకు నడుస్తుంది. ఆ బుధుడు ఒక అధికారిక గ్రహం మరియు 3.9.12 భావాల కారకుడు. అందుచే ఈ కాలంలో నా క్లైంట్ ప్రయాణం కట్టవచ్చును. బుధునిలో రాహువు ప్రాణ దశలో అనగా 06.03.2008 -- 07.3.08. మధ్యకాలంలో అని నిశ్చయించాము. ఆ రాహువు లగ్న కక్ష్యాధిపతి.
నిజానికి వారు 06.03.2008 నాడు విమానం ఎక్కినారు.

ఉదా:- 12

నా మిత్రుని బంధువు కుమారుడు <u>ఉద్యోగానికై</u> ప్రయత్నిస్తూ ఎప్పుడు అవకాశం కలదని ప్రశ్నించి 1నుండి 249 లోగా 7 వ సంఖ్యను ఎన్నుకొన్నాడు. 26.10.2007 సాయంత్రం 5.58.07 నిమిషాలకు నెల్లూరులో పరిశీలనకై జాతకం చక్రం తయారుచేసుకొన్నాను.

| | | గ్రహస్థితి | | | | గ్రహకారకత్వాలు | |
|---|---|---|---|---|---|---|---|
| గ్రహ | రాశి | డిగ్రీలు | రాశి | నక్ష | కక్ష్య | గ్రహము | కారకత్వం |
| రవి | తుల | 8.49 | శుక్ర | రాహు | గురు | రవి | 7,11 |
| చంద్ర | మేష | 13.21 | కుజ | శుక్ర | శుక్ర | చంద్ర | 1,2,4,5,7 |
| కుజ | మిథు | 16.2 | బుధ | రాహు | శుక్ర | కుజ | 1,3,8,11 |
| బుధ | తుల | 3.18 | శుక్ర | కుజ | శుక్ర | బుధ | 1,3,6,8 |
| గురు | వృశ్చి | 24.40 | కుజ | బుధ | రాహు | గురు | 3,6,8,9,12 |
| శుక్ర | సింహ | 22.22 | రవి | శుక్ర | శని | శుక్ర | 2,5,7 |
| శని | సింహ | 12.08 | రవి | కేతు | బుధ | శని | 5,10,11 |
| రాహు | కుంభ | 11.32 | శని | రాహు | శని | రాహు | 11 |
| కేతు | సింహ | 11.32 | రవి | కేతు | బుధ | కేతు | 5 |

| భావస్థితి | | | | | | | భావకారకత్వాలు |
|---|---|---|---|---|---|---|---|
| భావ | రాశి | డిగ్రీలు | రాశి | నక్ష | కక్ష్య | భావం | కారకత్వం |
| 1 | మేష | 7.33 | కుజ | కేతు | గురు | 1 | చ,కు,బు |
| 2 | వృష | 8.3 | శుక్ర | రవి | శుక్ర | 2 | చ,శు |
| 3 | మిథు | 4.32 | బుధ | కుజ | శుక్ర | 3 | కు,బు,గు |
| 4 | కర్క | 0.21 | చంద్ర | గురు | చంద్ర | 4 | చ |
| 5 | కర్క | 28.40 | చంద్ర | బుధ | శని | 5 | చ,శు,శ,కే |
| 6 | కన్య | 1.34 | బుధ | రవి | గురు | 6 | బు,గు |

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 7 | తుల | 7.33 | శుక్ర | రాహు | రాహు | 7 | ర,చ,శు |
| 8 | వృశ్చి | 8.03 | కుజ | శని | కేతు | 8 | కు,బు,గు |
| 9 | ధను | 4.32 | గురు | కేతు | చంద్ర | 9 | గు |
| 10 | మకర | 0.21 | శని | రవి | రాహు | 10 | శ |
| 11 | మకర | 28.40 | శని | కుజ | శని | 11 | ర,కు,శ,రా |
| 12 | మీన | 1.34 | గురు | గురు | రాహు | 12 | గు |

ఉద్యోగ ప్రాప్తి విషయం 2,6,10 భావాల ద్వారా అవగతమౌతుంది. ఈ జాతకంలో 10వ భావ కక్ష్యాధిపతి రాహువు. స్వనక్షత్రంలోనే ఉన్నాడు. వక్రిగాడు, శుక్రునకు, శనికి ప్రతినిధియై 2,10 భావాల కారకుడైనాడు. అందుచే తప్పక ఉద్యోగ ప్రాప్తి కలదని చెప్పవచ్చు. 11 వ భావం శని సంబంధాన్ని పొందడం వలన ఆ పని జరగడానికి కొంత కాలం పడుతుందని చెప్పవచ్చు. 2,6,10 భావాల కారకత్వాన్ని కుజుడు తప్ప అన్ని గ్రహాలు పొంది ఉన్నాయి. వీటిలో ముఖ్యులెవరో ఆధికారిక గ్రహాలద్వారా తెలుసుకోవాలి. ఆధికారిక గ్రహాలను పరిశీలిద్దాము.

***లగ్న***కుజ,శుక్ర,శుక్ర ***చంద్ర***,కుజ,శుక్ర,శుక్ర ***దినాధిపతి***శుక్రుడు

ఈ విధంగా కుజ శుక్రులే ముఖ్య ఆధికారిక గ్రహాలైనారు. కారకుల్లో కుజుడు లేనందువల్ల అతడు నిరస్తింపబడినాడు. ఒక శుక్రుడే మిగిలినాడు అయితే ఆ శుక్రునితో శని కేతవులు కలసి ఉన్నారు. ఆ శుక్రుడు కేతువును చూస్తున్నాడు.
ఈ కారణంగా శుక్ర, శని, రాహు, కేతువులు ముఖ్య కారకులైనారు.

ప్రస్తుతం శుక్ర మహాదశ,శుక్ర భుక్తి, శుక్రఅంతర్భుక్తి జరుగుతున్నది. ఇంతకు ముందు మనం ఉద్యోగ ప్రాప్తికి ఆలస్యమవుతుంది. అని అనుకొన్నాము గదా. అందుచే శుక్రుడు కారకుడైనా శుక్ర సూక్ష్మంలో ఈ పని జరుగదు. ఆపై వచ్చే రవి, చంద్ర, కుజులు కారకులు గారు. రాహు సూక్ష్మంలో ఉద్యోగ ప్రాప్తి జరుగవచ్చు. 14.12.2007 నుండి 14.01.2008 వరకు ఈ రాహు సూక్ష్మ దశ జరుగుతుంది. ఈ కాలం 32 రోజులకు పర్యాప్తమైనది. ఆ సూక్ష్మ దశలో శుక్రుని ప్రాణ దశ 4.1.2008 నుండి 09.01.2008 వరకు జరుగుతుంది. ఈ కాలం ఆ వ్యక్తికోరిక ఈడేరుతుంది.
నిజానికి ఆ వ్యక్తి 07.01.2008 నాడు డ్యూటీలో చేరినాడు.

మా మిత్రులు శ్రీ రంగనారాయణ గారి కలం నుండి

2001 లో నేను జ్యోతిషం నేర్చుకోవాలని ఒక గురువు వద్ద చేరాను. వారు నాకు సాయనం గొప్పదని చెప్పి నేర్పడం మొదులు పెట్టారు. వైదిక విధానంలో పాశ్చత్యాన్ని జోడించి ప్రోగ్రెషన్స్ ద్వారా ఫలితనిర్ణయం చేస్తూవచ్చారు. అప్పుడు నాకు అది చాల గొప్పది అనిపించింది. కాని నా అదృష్టమో దురదృష్టమో తెలియదు. మా గురువు ట్రాన్స్‌ఫర్

పై వేరే పట్టణానికి వెళ్ళిపోయారు.

అప్పుడు విచారింపగా శ్రీ పి.యం. గోపాలాచారిగారు చాలమందికి జ్యోతిషం నేర్పుతున్నారని తెలియవచ్చింది. వారి వద్ద శిష్యునిగా చేరినాను. వారు చాల నిదానంగా, సూక్ష్మంగా ఎన్నో విషయాల్ని, జ్యోతిషఫలితరహస్యాలను బోధించి కృష్ణమూర్తిపద్ధతిని, అందులో సబ్‌లార్డ్ మహిమను ఎన్నో ఉదాహరణలతో అరటి పండు ఒలిచి పెట్టినట్లు బోధించినారు. కృష్ణమూర్తిపద్ధతి అనన్యసామాన్యమైనదని అప్పుడు నాకు అర్థమైనది. ఫలితం ఎప్పుడూ తప్పు పోయినది లేదు. వారి వద్ద జ్యోతిష అభిజ్ఞ, దైవజ్ఞ అనే ఉత్తీర్ణతా పత్రాలను స్వీకరించాను. ఈ విధంగా వారు ఎందరికో ఈ శాస్త్రాన్ని నేర్పియున్నారు. ఇంకొక విషయమేమంటే వారు నాకు ఆరవతరగతి తెలుగు ఉపాధ్యాయులు.

వారి వద్ద జ్యోతిషం నేర్చిన తర్వాత స్వయంగా కె.పి. విధానంలో సాధారణజాతకం, ప్రశ్నజాతకం తయారు చేసి ఖచ్చితంగా ఫలితాలు చెప్పగలిగాను. 'రూలింగ్ ప్లానెట్స్' పనితీరు అమోఘం. అందు కొన్ని అనుభూతుల్ని తెలియజేస్తున్నాను.

ఉదా:- 13

కనిగిరిలో ఒకానొకమిత్రుడు తన భార్య గర్భవతిగా ఉందని ఆమె ప్రసవించబోయేది మగశిశువునా, స్త్రీ శిశువునా? జ్యోతిషరీత్యా తెలుపగోరినాడు. 1-249 లోగా 28ని ఎన్నుకొన్నాడు. 23-7-2007 రాత్రి గం.10.40 సమయాన జాతకచక్రం తయారుచేసాను.

| | | గ్రహస్థితి | | | | గ్రహకారకత్వాలు | |
|---|---|---|---|---|---|---|---|
| గ్రహ | రాశి | డిగ్రీలు | రాశి | నక్ష | కక్ష్య | గ్రహము | కారకత్వం |
| రవి | కర్క | 6.36 | చంద్ర | శని | బుధ | రవి | 3,4,5,9,10,11 |
| చంద్ర | తుల | 22.24 | శుక్ర | గురు | శని | చంద్ర | 3,4,6,7,8 |
| కుజ | మేష | 26.26 | కుజ | శుక్ర | కేతు | కుజ | 1,4,6,7,12 |
| బుధ | మిథు | 16.45 | బుధ | రాహు | శుక్ర | బుధ | 2,10 |
| గురు | వృశ్చి | 16.22 | కుజ | శని | గురు | గురు | 4,7,8,9,10,11 |
| శుక్ర | సింహం | 8.47 | రవి | కేతు | గురు | శుక్ర | 1,4,6 |
| శని | సింహం | 1.00 | రవి | కేతు | శుక్ర | శని | 4,9,10,11 |
| రాహు | కుంభ | 13.49 | శని | రాహు | బుధ | రాహు | 10 |
| కేతు | సింహం | 13.49 | రవి | శుక్ర | శుక్ర | కేతు | 1,4,6 |

| | | భావస్థితి | | | | భావకారకత్వాలు | |
|---|---|---|---|---|---|---|---|
| భావ | రాశి | డిగ్రీలు | రాశి | నక్ష | కక్ష్య | భావం | కారకత్వం |
| 1 | వృష | 7.46 | శుక్ర | రవి | శుక్ర | 1 | కు,శు,కే |
| 2 | మిథు | 4.33 | బుధ | కుజ | శుక్ర | 2 | బు |
| 3 | కర్క | 0.9 | చంద్ర | గురు | చంద్ర | 3 | ర,చ |
| 4 | కర్క | 27.45 | చంద్ర | బుధ | గురు | 4 | ర,చ,కు,గు,శు,శ,కే |

| 5 | సింహ | 29.20 | రవి | రవి | రాహు | 5 | ర |
|---|---|---|---|---|---|---|---|
| 6 | తుల | 3.59 | శుక్ర | కుజ | శుక్ర | 6 | చ,కు,శు,కే |
| 7 | వృశ్చి | 7.46 | కుజ | శని | కేతు | 7 | చ,కు,గు |
| 8 | ధను | 4.33 | గురు | కేతు | చంద్ర | 8 | చ,గు |
| 9 | మకర | 0.9 | శని | రవి | రాహు | 9 | ర,గు,శ |
| 10 | మకర | 27.45 | శని | కుజ | గురు | 10 | ర,బు,గు,శ,రా |
| 11 | కుంభ | 29.20 | శని | గురు | రవి | 11 | ర,గు,శ |
| 12 | మేష | 3.59 | కుజ | కేతు | చంద్ర | 12 | కు |

పంచమ భావకక్ష్యాధిపతి కుజుడు పుంరాశిలో నున్నాడు. అందుచే పుట్టబోయే బిడ్డ ఖచ్చితంగా మగబిడ్డయే కాని ప్రసవం సులభమైనది కాదని చెప్పాను. అదేవిధంగా అక్టోబరు నెలలో శస్త్రచికిత్సానంతరం ఆమె మగ శిశువును ప్రసవించింది.

మరొకమిత్రుడు చెన్నైలో ఎల్.ఐ.సి. లో ఉద్యోగిగా ఉన్నాడు. అతనికి వివాహం అయి 15 సం. అయికూడ సంతానం కలుగలేదు. జ్యోతిషరీత్యా తనకు సంతానయోగం కలదా లేదా తెలుపమన్నాడు. 1-249 లోగా 189 ఎన్నుకొన్నాడు. జాతకచక్రంతయారు చేసాను. 7వ భావం అతని జీవితభాగస్వామినిది. అందుండి 5వభావం 11వది. దాని కక్ష్యాధిపతి 2,5,11 భావాలకు కారకుడు కాలేదు. అందుచే సంతానావకాశాలు లేవని దృఢంగా చెప్పాను. కొన్నాళ్ల తర్వాత నా మిత్రుడు నన్ను కలసినాడు. తన భార్యకు గర్భసంచిలో లోపమున్నదని ఆగామికాలంలో ఇబ్బందులు లేకుండడానికి గాను గర్భసంచి తీసివేయడంజరిగిందని చెప్పినాడు.

ఒకనాడు నెల్లూరు ఈనాడు ఆఫీసులో పనిజేసే నామిత్రుడు తన భార్య గర్భవతిగా ఉందని పుట్టబయేది మగ బిడ్డా లేక ఆడబిడ్డా అని ప్రశ్నించి 78 సంఖ్యను ఎన్నుకొన్నాడు. దీనిపై చక్రం తయారు చేసి పరిశీలించగా పంచమభావ కక్ష్యాధిపతి స్త్రీరాశిలో పడినాడు. కె.పి. పుస్తకాల్లో తెల్పిన విధంగా పుట్టబోయేది ఆడపాప అని చెప్పాను. కొన్నినెలల తరువాత ఆ మిత్రుడు కనబడి తనభార్య స్త్రీశిశువును కన్నదని, ముందే నేను చెప్పగల్గినందుకు పొగడ్తలనందించినాడు.

ఈవిధంగా మా గురువుగారు శ్రీ పి.యం. గోపాలాచారిగారి వద్ద నేర్చుకొన్న కృష్ణమర్తి పద్ధతిద్వారా ముందుగానే జరుగబోయేవిషయాలను ఖచ్చితంగా తెలుసుకో వీలయింది. అంతా కె.ఎస్.కె. గారి చలవ.

ఉదా:- 14 **వివాహమా మరణమా**

11.09.1976 19.05 సాయం నెల్లూరు నా మిత్రుని కూతురి జాతకం

గ్రహస్థితి ఈ విధంగా ఉంది.

| గ్రహ | డిగ్రీలు | రాశి | నక్ష | కక్ష్య |
|---|---|---|---|---|
| రవి | 145.23 | రవి | శుక్ర | బుధ |
| చంద్ర | 359.05 | గురు | బుధ | శని |

గ్రహకారకత్వం

| గ్రహాలు | కారకత్వం |
|---|---|
| రవి | 3,6,7,8 |
| చం | 1,4,5,7 |

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| కుజ | 168.18 | బుధ | చం | బుధ | కు | 1,2,5,7,9 |
| బుధ | 163.57 | బుధ | చం | గురు | బు | 1,4,5,7 |
| గురు | 37.33 | శుక్ర | రవి | కే | గు | 1,2,6,10 |
| శుక్ర | 168.32 | బుధ | చం | బుధ | శు | 1,3,5,7,8 |
| శని | 168.26 | చం | బుధ | బుధ | శ | 4,5,7,11,12 |
| రాహు | 190.43 | శుక్ర | రాహు | శని | రా | 7 |
| కేతు | 10.43 | కుజ | కేతు | శని | కే | 1 |

| | భావస్థితి | | | | భావకారకత్వం | |
|---|---|---|---|---|---|---|
| భావం | డిగ్రీలు | రాశి | నక్ష | కక్ష్య | భావాలు | కారకత్వం |
| 1 | 341.55 | గురు | శని | చంద్ర | 1 | చం,కు,బు,గు,శు,కే |
| 2 | 15.53 | కుజ | శుక్ర | రవి | 2 | కు,గు |
| 3 | 54.37 | శుక్ర | చంద్ర | గురు | 3 | ర,శు |
| 4 | 70.32 | బుధ | రాహు | శని | 4 | చం,బు,శ |
| 5 | 96.54 | చంద్ర | శని | బుధ | 5 | చం,కు,బు,శు,శ |
| 6 | 126.51 | రవి | కేతు | రాహు | 6 | ర,గు |
| 7 | 161.55 | బుధ | చంద్ర | రాహు | 7 | ర,చం,కు,బు,శు,శ,రా |
| 8 | 195.53 | శుక్ర | రాహు | శుక్ర | 8 | ర,శు |
| 9 | 224.37 | కుజ | శని | రాహు | 9 | కు |
| 10 | 250.32 | గురు | కేతు | శని | 10 | గు |
| 11 | 246.54 | శని | రవి | బుధ | 11 | శ |
| 12 | 306.51 | శని | రాహు | రాహు | 12 | శ |

వివాహం జరగడానికి 7 వ కక్ష్యాధిపతి 2,7,11 భావాల కారకుడు అవాలి. ఈ జాతకంలో 7 వ భావ కక్ష్యాధిపతి రాహువు. ఆ రాహువు 7 వ భావానికి మాత్రమే కారకుడు అతని నక్షత్రంలో ఎవరు లేరు. అందుకే తప్పక వివాహమౌతుంది. అయితే ఎప్పుడు? 2,7,11 భావ కారకుల దశా విదశా అంతర్విదశల్లో ఆ పని జరగాలి. 2 వ భావకారకులు కుజ,గురువులు. 7 వ భావ కారకులు రవి,చంద్ర,కుజ,బుధ,శుక్ర,శని రాహువులు.

11 వ భావ కారకుడు శని ఈ విధంగా కేతువు తప్ప అన్ని గ్రహాలు 2,7,11 భావాల కారకులైనారు. వీరులో కొందరిని తొలగించాలి. ఈ భావ కారకత్వంతో పాటు ఎవరికి 4,6,8 10,12 భావకారకత్వం కూడ కలదో పరిశీలించాలి. 7 వ భావంతో పాటు రవి 6,8 భావాలకు చంద్రుడు 1,4 భావాలకు, గురువు 6 భావానికి, శుక్రుడు 8 వ భావానికి శని 12 వ భావానికి బుధుడు 4 వ భావానికి కారకుడైనాడు. అందుచే కుజ, రాహువులే వివాహా న్నివ్వడానికి సమర్థులు. వీరి దశాభుక్తి కాలాల్లో వివాహ అవకాశాలుంటాయి. ఈ సంఘటన జరిగి సమయంలో రవి దశలో చంద్ర భుక్తి జరుగుతున్నది. 2005 జూలై నుండి నవంబర్ వరకు కుజ భుక్తి, ఆ పై 2006 అక్టోబర్ వరకు రాహు భుక్తి జరుగుతుంది. ఆ భుక్తులు రాకముందే అనగా చంద్ర భుక్తి లోనే 26.06.2005 న సాయంత్రం 4, 5 గంటల మధ్య ఆమె ఆత్మ హత్య చేసుకొని మరణించింది.
11 వ భావాధిపతి అనార్శిక గ్రహం అయిన శని ఆలస్యం చేస్తాడు. వివాహాన్ని

జరుపనివ్వడు. అతడు 12 వ భావాధిపతి కూడ. సప్తమ భావాన్ని చూస్తున్నాడు. ఇప్పుడు జరిగేది రవి దశ. రవి 6,8 భావాలకారకుడు ఆ రవి శుక్రుని నక్షత్రంలో ఉన్నాడు. ఆ శుక్రుడు 3,8 భావాల కారకుడు. కుజుడు వివాహ వ్యతిరిక్త భావాలకు కారకుడు కాకపోయిన సప్తమంలోని శుక్రునికి బుధునకు చాలా దగ్గరగా ఉన్నాడు. ఇద్దరు శత్రువులు. అది శత్రు రాశి అందుచే శుభ ఫలితాలను ఇవ్వడంలో బలహీనుడు. బాధక స్థానంలో మారకాధిపతిగా ఉన్నాడు. బాధకాధిపతితో తృతీయ అష్టమాధిపతితో కలసి ఉన్నాడు.

1,3,8 కక్ష్యాధిపతులు 2,7 మరియు బాధకస్థానాల్ని సూచిస్తే అల్పాయుర్ధాయం. ఈ జాతకంలో ఒకటవ భావ కక్ష్యాధిపతి చంద్రుడు. 3 వ భావ కక్ష్యాధిపతి గురువు. 8 వ భావ కక్ష్యాధిపతి శుక్రుడు. గురువు 2,6 భావాలకు, శుక్రుడు 3,8 భావాలకు చంద్రుడు 7 వ భావాన్నికి కారకుడై మారక బాధక సంబంధం పొంది అల్పాయుర్ధాయాన్ని ఇస్తున్నాడు.

ఇచ్చట కుజ రాహువులు ముఖ్యపాత్ర వహిస్తున్నందు వల్ల హఠాత్తుగా, ఏకాంతంలో ఆత్మహత్యా రూపంలో మరణం ఆసన్నమయింది. 8 వ భావ కక్ష్యాధిపతి ఉన్న నక్షత్రాధిపతి అనగా శుక్రుడు ఉన్న నక్షత్రాధిపతి చంద్రుడు లగ్నం లోనే ఉన్న కారణంగా తన నివాశ స్థలం లోనే, స్వప్రయత్నం తోనే చంద్ర అంతర్ భుక్తిలోనే మరణం ఏర్పడింది. ఉపకక్ష్యా విధానంలో పరిశీలిస్తాము.

ప్రధమ భావ ఉపకక్ష్యాధిపతి 7 వ భావ ఉపకక్ష్యాధిపతి తానున్న నక్షత్రాధిపతిద్వారా 4,6,10,12 భావాల సంబంధం పొంది తానున్న కక్ష్య ఉపకక్ష్యల ద్వారా 5,7,11 భావాల సంబంధం పొందకుంటే వివాహం జరుగక పోవచ్చు. ఇచ్చట ప్రధమ భావ ఉపకక్ష్యాధిపతి శుక్రుడు. అతడున్న నక్షత్రాధిపతి చంద్రుడు. ఆ చంద్రుడు గురు శనుల ద్వారా 6,12 భావాల సంబంధం పొందినాడు. 7 వ భావ ఉపకక్ష్యాధిపతి రాహువు అతడు స్వ నక్షత్రం లో ఉన్నాడు. ఆ రాహువు 4 వ భావ నక్షత్రాధిపతిగా, 6 వ భావ కక్ష్యాధిపతిగా, 12 వ భావ నక్షత్ర కక్ష్య ఉపకక్ష్యాధిపతిగా 4,6,12 భావాల సంబంధాన్ని పొందినాడు. అయితే చంద్ర రాహువులు 5,7 భావాల సంబంధం పొందిఉన్నారు. అందుచే వివాహం నిశ్చమయి నిశ్చితార్థం జరిగి ఆగష్టులో వివాహం ఏర్పాటయింది. కాని 26.06.2005 న ఆత్మ హత్యచేసుకొని అసువులు బాసింది. ఈ విధంగా 2,7 స్థానాలు అటు వివాహాన్ని మరణాన్ని కూడ సూచించాలని గ్రహించాలి. లోతుగా పరిశీలిస్తేనే శుభాన్నిస్తాయా, అశుభాన్నిస్తాయా అనేది తెలియ వస్తుంది.

ఉదా:- **ఆయుర్దాయ ప్రశ్న 15**

జ్యోతిశ్శాస్త్రం జరుగబోయే విషయాలను ముందే చెప్పగలుగుతుందా? చాలమందికి అంటే ఈ శాస్త్రాన్ని నమ్మేవాళ్ళకు కూడ ఈ విషయంలో కొంత సందేహంలేకపోలేదు.

ఉన్నదున్నట్లుగా జరుగబోయేదానిని చెప్పడం ఎవరికి సాధ్యం కాదని వారు ఎక్కువగా నమ్ముతారు. వీరి సంగతే ఇలా ఉంటే ఈ శాస్త్రాన్ని నమ్మని వారి సంగతి అసలు చెప్పబని లేదు.

శాస్త్రాన్ని శాస్త్రంగా చూచి, శాస్త్రీయంగా పరిశీలిస్తే తప్పక సరైన ఫలితాలు చెప్పవచ్చు. ఒక కొన్ని సార్లు జరగడం కొన్ని సార్లు జరుగక పోవడం అంటూ ఉండదు.

ప్రొఫెసర్ శ్రీ కృష్ణమూర్తిగారు కనుగొని ప్రచారం చేసిన కృష్ణమూర్తి పద్ధతిలో గణించి చెప్ప ప్రయత్నిస్తే ఫలితం సక్రమంగా చెప్పవచ్చు. ఇది జ్యోతిషశాస్త్ర రంగంలోనే ఒక విప్లవం లాంటిది. ప్రాచీన ఋషుల పద్ధతిల్లో లోపాలను ఏ విధంగా సర్దగలిగింది చూస్తే వారు చేసిన తీవ్ర కృషి మనకు అర్థమవుతుంది.

నా మిత్రుడొకడు మాటలసందర్భంలో తనకు తెలిసిన వాడు చాల జబ్బున పడి ఉన్నాడని కోలుకో గలడో లేడో జాతకం చూచి చెప్పాలని 4-2-1985న అడిగినాడు. నాకూ కుతూహలంగా ఉండడం మూలాన అతనితో బాటు కలసి అతని మిత్రుని ఇంటికి వెళ్ళాను.

ఇంట్లో వాళ్లు సరైన జాకం లేదని చెప్పారు. వెంటనే నేను రోగిని 1-249 లోగా ఒక సంఖ్యను చెప్పమన్నాను. వారు 243 ఇచ్చారు. మరుసటి రోజు అంటే 5వ తేది రాత్రి 10.30 గంటలకు ఫలితనిర్ణయానికి పూనుకొన్నాను.

| రాశి చక్రంలో గ్రహస్థితి ఈ విధంగా ఉంది. | | | | | గ్రహకారకత్వం |
|---|---|---|---|---|---|
| రవి | 293.18 | శని | చంద్ర | రవి | రవి 5,6,1 |
| చంద్ర | 114.14 | చంద్ర | బుధ | రాహు | చం 4,5,7,11 |
| కుజ | 338.41 | గురు | శని | శుక్ర | కు 2,8,9,11,12 |
| బుధ | 283.31 | శని | చంద్ర | రాహు | బు 4,5,7,11 |
| గురు | 276.16 | శని | రవి | బుధ | గు 1,6,10,11 |
| శుక్ర | 339.29 | గురు | శని | శుక్ర | శు 3,8,11,12 |
| శని | 213.50 | కుజ | శని | శని | శ 8,11,12 |
| రాహు | 29.42 | కుజ | రవి | రాహు | రా 2,6,11 |
| కేతు | 209.41 | శుక్ర | గురు | చంద్ర | కే 1,8,10 |

| భావస్థితి | | | | | భావకారకత్వం |
|---|---|---|---|---|---|
| 1 | 349.20 | గురు | బుధ | శుక్ర | 1 గు,కే |
| 2 | 22.23 | కుజ | శుక్ర | శని | 2 కు,రా |
| 3 | 50.23 | శుక్ర | చంద్ర | కేతు | 3 శు |
| 4 | 76.07 | బుధ | రాహు | శుక్ర | 4 చం,బు |

| 5 | 102.55 | చంద్ర | శని | రాహు | 5 ర.చం,బు |
|---|---|---|---|---|---|
| 6 | 133.45 | రవి | శుక్ర | శుక్ర | 6 ర,గు,రా |
| 7 | 169.20 | బుధ | చంద్ర | బుధ | 7 చం,బు |
| 8 | 202.23 | శుక్ర | గురు | శని | 8 కు,శు,శ,కే |
| 9 | 230.23 | కుజ | బుధ | శుక్ర | 9 కు |
| 10 | 256.08 | గురు | శుక్ర | రవి | 10 గు,కే |
| 11 | 282.56 | శని | చంద్ర | రాహు | 11 ర,చ,కు,బు,గు,శు |
| 12 | 313.45 | శని | రాహు | బుధ | 12 కు,శు,శ |

శ్రీ కృష్ణమూర్తిపద్ధతి ప్రకారం మొదటిభావకక్ష్యాధిపతి మారకస్థానాన్ని, బాధక స్థానాన్ని సూచిస్తే త్వరలో మరణం.

1,6 భావాల కక్ష్యాధిపతి శుక్రుడు శని నక్షత్రంలో ఉండడం మూలాన ఆ జబ్బు దీర్ఘకాలికమైంది. 8వ ఇంట శని కేతువులున్నారు. ఈ లగ్నానికి రవి,బుధ,శుక్ర,శనులు మారకులు. ఇది ఉభయరాశి అయినందువల్ల మారక, బాధకస్థానమవుతుంది. మారక బాధకాధిపతి బుధుడు.

బాధక మారక స్థానాలలో నిలిచి ఉన్న గ్రహాల నక్షత్రాలలో ఉన్నగ్రహాలు మరణాన్ని సూచిస్తాయి. లేదా ఆ రాసుల్లో ఉన్న గ్రహాలు లేదా రాశి అధిపతుల నక్షత్రాలలో ఉన్న గ్రహాలు లేదా వాటితో కలసిన గ్రహాలు మరణాన్ని సూచిస్తాయి. బాధక స్థానమైన కన్యకు అధిపతి బుధుడు. ఆ బుధుడు చంద్ర నక్షత్రంలో రాహువు కక్ష్యలో ఉన్నాడు. ఆ బుధుడు దశమ కేంద్రంలో రవి గురువులతో కలసి ఉన్నాడు.

రూలింగ్ ప్లేనెట్స్ విషయానికొస్తే ఆ రోజు మంగళవారం. అప్పటి లగ్నం కన్య. ఆనాటి నక్షత్రం పుష్యమి. దినాధిపతి కుజుడు. నక్షత్రాధిపతి బుధుడు. రాశి అధిపతి చంద్రుడు. లగ్నాధిపతి బుధుడు. పైవివరాలను బట్టి చూస్తే ఈ విషయంలో బుధుడు ముఖ్యపాత్ర వహిస్తున్నాడనేది అవగతమవుతుంది. అప్పుడు జరిగేదశ బుధునిలో రాహుభుక్తి రాహు అంతరం. మార్చి 3వ తేది వరకు కేతు సూక్ష్మం. అంగారకుడు ద్వితీయాధిపతి. అచట ఉన్న రాహువు, అష్టమాధిపతి శుక్రుని ఇంట అతని ప్రతినిధిగా ఉన్న కేతువు మరణానికి ముఖ్యకారకులైనారు. రాహువు 12వ భావ నక్షత్రాధితి. కేతువు 12వ భావ కక్ష్యాధిపతి. 1వ భావ నక్షత్రాధిపతి బుధుడు. కక్ష్య అధిపతి శుక్రుడు. 3వ భావ నక్షత్రాధిపతి చంద్రుడు. కక్ష్యాధిపతి శుక్రుడు. 6వభావ నక్షత్రాధిపతి కక్ష్యాధిపతి శుక్రుడు. 8వభావ నక్షత్రాధిపతి గురువు. కక్ష్యాధిపతి శని. గురువు 11వ భావ కక్ష్యాపతి కూడ. అందుచే రాహు భుక్తిలోనే మరణమాసన్నమవుతుందని చెప్పినాను. వారు మరణించింది 27.02.1985. ఆ నాడు బుధవారం. నక్షత్రం రోహిణి. చంద్రునిది. లగ్నం ధనుస్సు. ఈ వ్యాసం నేను నడుపుతూ వచ్చిన ‘ భాగ్యరేఖ ’ అనే జ్యోతిష వార

పత్రిక 1985 మే నెల సంపుటి1 సంచిక 11 లో ప్రచురితమైంది.

**ఉదా:- 12 ప్రసవకాలమెప్పుడు?**

నమ్మదగిన, ఆచరణసామర్థ్యం గల జ్యోతిశ్శాస్త్ర పద్ధతిగా, కృష్ణమూర్తిపద్ధతియొక్క విశిష్టతను శ్రీలంకకు చెందిన శ్రీ శివపాదంగారు ప్రకటించినారు.వారు ఒకశిశుజననవిషయాన్ని ఖచ్చితంగా, ముందుగా ఈ పద్ధతిననుసరించి చెప్పగలిగినారు. ఈక్రింద దాని వివరణను ఇస్తున్నాము.

జ్యోతిషంలో ఆచరణసామర్థ్యం కలిగి ముందుగానే ఫలితనిర్ణయం చేయడంలో అందరికి ఆమోదయోగ్యమై, పూర్తిగా విశ్వసనీయమైనది కృష్ణమూర్తి పద్ధతి మాత్రమే. శ్రద్ధాభక్తులతో మానసిక శ్రమకోర్చి, ఈ పద్ధతిని లోతుగా అభ్యసించినట్లైతే శ్రీమహాగణపతిదేవుని అనుగ్రహం తప్పక లభిస్తుంది. కాగితం, కలం, పంచాంగాదుల సాయం లేకుండానే శ్రీగురుాజీగారు సరియైన జననసమయాన్ని, లగ్నాన్ని, స్ఫుటాల్ని చాల ఖచ్చితంగా నిర్ణయించి సంస్కరింపగల్గుతున్నారనేది నన్ను ఇప్పటికి ఆశ్చర్యచకితుణ్ణి చేస్తుంది. అది వారి ఏకాగ్రత, ధీశక్తిని మాత్రమే గాక వారు ప్రచారం చేస్తున్న ఈ పద్ధతిలోని ఖచ్చితత్వాన్ని కూడ నిరూపిస్తుంది. ఈ విధంగా నేను కూడ చేయగల్గితే బాగుండుననిపించింది.

19-11-1969 నాడు నేను నా కార్యాలయానికి వెళ్తుండగా దారిలో నా మిత్రుడొకడు తగిలినాడు. జ్యోతిశ్శాస్త్ర రీత్యా తన ప్రశ్నకు సమాధానం చెప్పమన్నాడు. అతని భార్య గర్భవతి. జాఫ్నాలో ఉన్నది. వైద్యులు నవంబరు 15 నాటికి ఆమె ప్రసవించగలదని చెప్పినారు. కాని 18 నాటికి కూడ బిడ్డ జన్మించలేదు. అప్పటివరకు కూడ ఉండి తాను మటాలేకు వచ్చానని, తన భార్య ఎప్పుడు ప్రసవించగలదని అడిగినాడు.

1-249 లోగా 135ను ఎన్నుకొన్నాడు. కొంత ఏకాగ్రతతో పరిశీలించి అనంతర్ 23వ తేది సాయంత్రం లేదా 24వ తేది ఉదయం బిడ్డ జన్మించవచ్చని చెప్పినాను. నా మిత్రుడు నవ్వి ఊరకున్నాడు. కాగితం, కలం,గణనాదులేమీ లేకుండ ఫలితనిర్ణయం చేయడం అతని అపనమ్మకానికి కారణమైంది.

నేను దారిలో నడుస్తూ ఉన్నా నా మనస్సులో మాత్రం 135 ఆధారంగా గణనాకార్యక్రమం సాగుతూనే ఉంది. సం. 125 తులలో 0 డిగ్రీ వద్ద ఉంటుంది. సం.130 తులలో 6$^{డి}$, సం.135 తులలో 15$^{డి}$ సం.140 తులలో సుమారు 21$^{డి}$ ఉంటుంది. లగ్నం తుల ఐతే 5,11 భావాలు కుంభ సింహాల్లో సుమారు 11$^{డి}$ అవుతాయి. అప్పుడు రాహు కేతువులు గురు శుక్ర నక్షత్రాల్లో, కుంభ సింహాల్లో 5,11 భావాల్లో ఉన్నారు. రాహువు గురు శనులకు కతువు శుక్ర రవులకు ప్రతినిధులవుతారు.

లగ్నోదయం శుక్రుని రాశిలో రాహువునక్షత్రంలో జరిగినది. శుక్రుడు రూలింగ్ గ్రహాల్లో ఒకడైనాడు. అప్పుడు శుక్రుడు లగ్నంలో, రాహువు నక్షత్రంలో ఉన్నాడు. అందుచే

శుక్రుడు రాహువుకన్న బలిష్ఠుడై 5,11 భావాల కారకుడైనాడు. శుక్రుడు బలిష్ఠుడైన రూలింగ్ గ్రహం కూడ.
చంద్రుడు ఎప్పుడైతే గోచారంలో శుక్రుని రాశిలోనికి వస్తాడో అప్పుడు ఫలితం రూపు దాలుస్తుంది. ఈ రోజున చంద్రుడు మీనరాశిలో బుధుని నక్షత్రంలో ఉన్నాడు. చంద్రుడు దగ్గరి సత్వరకాలంలో వృషభరాశిలోనికి రావడం జరిగినప్పుడు మాత్రమే సఫలం అవుతుంది.
శుక్రుని తర్వాత శుక్రుని నక్షత్రంలో ఉన్న కేతువు ముఖ్య పాత్ర వహిస్తాడు. వృషభరాశిలో కేతువు నక్షత్రం లేదు కాబట్టి కేతువున్న రాశ్యధిపతి రవిని స్వీకరించాలి. అనగా శుక్రరాశిలో రవి నక్షత్రంపై చంద్రుడు సంచరించే కాలంలో శిశుజన్మ చోటు చేసుకోవచ్చు. ఈ విధంగా చర్చించుకొన్న నేను నాఫలితనిర్ణయం సరియైనదే అని తృప్తిచెంది అతని నుండి కబురుకై వేచి ఉండినాను. అంతటితో ఆగక ఇంటికి వెళ్ళిన తర్వాత అదే నాడు రాత్రి గం.7.30 సమయాన జాతకచక్రం తయారు చేసాను. అది ఈ క్రిందివిధంగా ఉంది.
సంతాన ప్రశ్నకు 2,5,11 భావాల్ని పరిశీలించాలి.
2వ భావం శని నక్షత్రంలో రాహువు సబ్‌లో, 5వ భావం చంద్రనక్షత్రం రాహువు సబ్‌లో, 11వ భావం శుక్రనక్షత్రం శుక్ర సబ్ లో ఉంది. ఈ సబ్ అధిపతులు చక్కగా సంతాన కారకులైనందున సుఖప్రసవమని చెప్పవచ్చు. ద్వితీయభావం ఖాళీగా ఉంది. తదధిపతి కుజుడు. ఆ కుజుడు గురువు నక్షత్రంలో ఉన్న కారణంగా కుజ గురువులు కారకులైనారు.
పంచమభావంలో రాహువు అతని నక్షత్రంలో శుక్రుడు ఉన్నారు. పంచమాధిపతి శని. రవిబుధులు శనినక్షత్రంలో ఉన్నారు. రాహు శుక్రులు ముఖ్యకారకులు కాగా రవిబుధశనులు సహకారకులైనారు. లాభభావంలో కేతువున్నాడు. శని కేతువు నక్షత్రంలో ఉన్నాడు. లాభభావాధిపతి రవి. అతని నక్షత్రంలో ఏ గ్రహం లేదు కాబట్టి రవిశనికేతువులు కారకులైనారు.
ఈవిధంగా క్రోడీకరిస్తే గురు కుజ శుక్ర రాహు రవి బుధ శని(వ) కేతువులు 2,5,11 భావాల కారకులైనారు. రాహువు శనిరాశిలో గురువు నక్షత్రంలో ఉండడం మూలాన రాహువే బలిష్ఠుడు. అందుచే శని గురువులను తొలగించవచ్చు. ఇలాగే కేతువు రవిశుక్రులకు ప్రతినిధి అవడంవల్ల వారిద్దరిని కూడ తొలగించవచ్చు. ఈవిధంగా రాహుకేతుబుధకుజులు ముఖ్యశిష్ట కారకులైనారు.
పరిశీలనా సమయంలో లగ్నభావరాశి శుక్రునిది. నక్షత్రం రాహువుది. సబ్ శుక్రునిది. చంద్రుడున్న రాశి గురువుది. నక్షత్రం బుధునిది. సబ్ రాహువుది. వారాధిపత్యం బుధునిది. ఆ బుధుడు కుజరాశిలో, శని నక్షత్రంలో బుధసబ్‌లో ఉన్నాడు.
వీరిలో సమాన మరియు బలిష్ఠమైన గ్రహాలు కేతువు,రాహువు,బుధులు. కారకులలో వీరిని గుర్తించి ఫలితనిర్ణయం చేయాలి.

ప్రశ్నవిషయం అద్యతన భవిష్యత్తుకు సంబంధించినది కాబట్టి చంద్రునిపై ఆధారపడాలి. తన చారంలో చంద్రుడు ఎప్పుడు కేతు,రాహు,బుధ పాలిత ప్రాంతాలపై సాగుతాడో ఆ సమయంలో శిశు జననం జరుగుతుంది. గ్రహాలలో ఛాయాగ్రహాలు బలిష్ఠాలు. అందుచే చంద్రుడు రాహుకేతువుల సంబంధిత స్థానాల్లో సంచరించే సమయంలో ఫలితానుభూతి జరుగుతుంది. కేతువునకు రవి శుక్రులతో సంబంధమున్న కారణంగా వృషభసింహాల్ని స్వీకరించాలి. రాహుసంబందాన్ని పరిశీలిద్దాం. రాహువు శని రాశిలో ఉండడం వల్ల మకరకుంభాల్ని తీసుకొందామంటే శని వక్రి. గురువు ఆధారంగా ధనుర్మీనాలు, చంద్రుని ఆధారంగా కర్కాటకం స్వీకరింప వలసి వస్తుంది. వీరిలో శుక్రునకు ప్రాముఖ్యమివ్వడం జరుగుతుంది. శుక్రుడు 5,11 భావాలకు సామ్య కారకుడైనాడు. స్వరాశిలోనే ఉండడం దీనికి కారణం. ఇక సబ్ విషయానికి వస్తే బుధుని స్వీకరించాలి. అతడు శని నక్షత్రంలో ఉండి శుక్రునకు రవికి సుస్థానంలో ఉండి ముఖ్యపాత్ర వహిస్తున్నాడు.

ఇక సబ్ సబ్ విషయానికి వస్తే గురువును స్వీకరించాలి. ఎందుకంటే రాహువు శనిగురువుల సంబంధాన్ని పొంది ఉన్నాడు. శని వక్రత్వం వల్ల నిరస్తుడైనాడు. ఇక గురువు ఒక్కడే మిగిలినాడు. ఈవిధంగా చంద్రుడు శుక్రరాశి, రవి నక్షత్రం, బుధసబ్,గురు సబ్ సబ్ (శుక్ర-రవి-బుధ-గురు వృషభంలో 6.27.03)కాలంలో శిశు జననం జరుగుతుంది. ఆ సమయం 24.11.1969 నాడు సరిగా మధ్యాహ్నం గం.2.00.

రాహువు ఉన్న సబ్ చంద్రునిది కాబట్టి వారం కూడ సోమవారమే ఐనది. ఈవిషయాన్ని నా మిత్రునకు ఫోన్ ద్వార తెలియజేసినాను. 29వ తేదీన నామిత్రుడు నాకు ఫోనుచేసి నేను చెప్పిన విధంగానే 24.11.1969 నాడు సరిగా మధ్యాహ్నం గం.2.00 సమయంలో ఆతని భార్య ప్రసవించినదని కుమారుడు జన్మించాడని ఆనందంతో తెలియజేసినాడు.